జగ్గన్న శాస్త్రి, ముదిగంటి.

మహారాణి ఝాఁసీ లక్ష్మీబాయి

రాజమహేంద్రవరము, 1930.

Record no. 38

Jagganna Śāstri, Mudigaṇṭi.

# Mahārāṇi Jhām̐sī Lakṣmībāyi

Rājamahēndravaramu, 1930.

Record no. 38

## Bibliographic Record Target

జగ్గన్న శాస్త్రి, ముదిగంటి.
మహారాణి ఝాంసీ లక్ష్మీబాయి / గ్రంథకర్త ముదిగంటి జగ్గన్న శాస్త్రి. - 2. కూర్పు. - రాజమహేంద్రవరము : ఈశ్వరముద్రాక్షరశాల, 1930.
(2), 189, (1) p. ;18 cm.
Record no. 38

Jagganna Śāstri, Mudigaṇṭi.
Mahārāṇi Jhāṁsī Lakṣmībāyi / granthakarta Mudigaṇṭi Jagganna Śāstri. - 2. kūrpu. - Rājamahēndravaramu : Īśvaramudrākṣaraśāla, 1930.
(2), 189, (1) p. ;18 cm.
Record no. 38

35 mm microfilm
Image placement: IA (IIA) IB IIB Date filming began:

'పల్లెటూరు గ్రంథమండలి' సంపాదకుడు.
పదమూడవ పుస్తకము. ముదిగంటి జగ్గన్న శాస్త్రి.

# మహారాణి ఝాన్సీ లక్ష్మీబాయి

గ్రంథకర్త.

ముదిగంటి జగ్గన్న శాస్త్రి
రాజమండ్రి.





రెండవ కూర్పు 1000



రాజమహేంద్రవరమున
ఈశ్వరముద్రాక్షరశాలయందు
ముద్రింపబడియె.

# పీఠిక.

క్వసూర్యః ప్రభవోవంశః క్వచాల్పవిషయామతిః
తితీర్షుర్దుస్తరం మోహాదుడు పేనాస్మిసాగరం.

"సూర్యవంశజులయొక్క శౌర్యప్రతాపము లెక్కడ? అల్పవిషయజ్ఞానముగల నేనెక్కడ! అగాధమై, యపారమై, యశక్యమైన జలరాశియెక్కడ! దానిని తెప్పచే నీదుకొని పోవ ప్రయత్నించు టెక్కడ! అది భ్రమ గాక మరియొకటి కానేరదు." అని యొక కవి వచించినట్లు భారతనాయికామణియు, స్వధర్మ, స్వరాజ్య సంరంభముతో భారతరాజ్యకీ యాకాశమును వెలుగొంద జేసిన యతులతారాప్రభయు, వైరివీరులకు సింహస్వప్నమును నగుమహారాణి ఝాన్సీలక్ష్మీబాయియొక్క వీరచరిత్రను వర్ణింప విషయజ్ఞానమంతగా లేని నావంటివాని కసాధ్యమని వేరుగ చెప్పనక్కరలేదు.

అయిన నీభారతశౌర్యరాశి నాంధ్రలోకమున కెఱిగింపవలెనను కుతూహలముతో కొన్ని యాంగ్లగ్రంథములను, హిందీగ్రంథములను, మహారాష్ట్రగ్రంథములను జూచి విషయములను గ్రహించి యీపుస్తకమును వ్రాయుటకు సాహసించితిని. ఇందలి లోపాలోపములను పాఠకులు మన్నింతురుగాక!

ముదిగంటి జగ్గన్నశాస్త్రి.

# పుస్తకములపట్టీ

'EMPIRE IN ASIA'—Torrens.

Meeting Records.

'1857'—Narayan Keshav Behere (Maharatta)

LIFE OF LAXMIBAI—D. B. Parasnis.
(Hindi translation.)

# మహారాణి ఝాంసీ లక్ష్మీబాయి

## మొదటి ప్రకరణము.

### జననము—బాల్యము.

సింధు, గంగా, బ్రహ్మపుత్ర, గోదావరీ, కృష్ణవేణీ నదీనద పుణ్యస్రోతస్సులచేతను, హిమాచల, ఉదయాచల, అస్తమాచల, వింధ్యాచలాది పర్వతరాజములచేతను, రత్నాకరాది చతురంభోధులచేతను, కాశీ, ప్రయాగాది తీర్థరాజములచేతను, ఆంగ్లసార్వభౌమశిరోభూషణమై వెలయుచున్న కోహినూరు మొదలగు నప్రతిమాన వజ్ర, వైడూర్యములచేతను, వసిష్ఠ వాల్మీకాది ఋషీశ్వరులచేతను, నారదోద్ధవాది మునిపుంగవులచేతను నలంకరింపబడుచున్న భారత పుణ్యభూమిలో భారత వీరరత్నములుకూడ నెప్పటికప్పు డుద్భవించుచునే యున్నవి. భారత, భాగవత, రామాయణవీరు లటుండ నలెగ్జాండరును బుసహోత్తముడును సెల్యూకసును చంద్రగుప్తుడును, హూణ, శాక్యాదులను హర్షవర్ధన, సముద్రగుప్తాదులును, మూగలులను ఛత్రపతిశివాజీ, రాణాప్రతాప, ఛత్రసాలు మొదలగువీరులును నెదిర్చి యెప్పటికప్పుడు విజయపరంపరలను గాంచుచునే యుండిరి.

వీరులేగాక వీరమాత లెందఱుద్భవింపలేదు ! రాణీసంయుక్త, విమల, అహల్యాబాయి, రుద్రమాదేవి లెందఱో రణభేరి మ్రోయించిరి. ఇట్లే యాంగ్లేయులనుగూడ ననేక రణరంగములలో నెదిర్చిన వీరు లనేకులు గలరు. ఇట్టి భారత వీరలోకమునంతను వెలుగొందజేసి, తటిల్లతవలెధగధగ మెరసి, ప్రపంచమునంతను దిగ్భ్రమనొందింపజేసి, శత్రుగణముచే గూడ "హైందవజోన్ ఆఫ్ ఆర్కు" (Indian Joan of Arc) "హైందవ బోడీసియా" (Indian Boadicea) యని పొగడ్తలనందిన మహారాణి ఝాన్సీలక్ష్మీబాయి మోరోపంతుతాంబే యను నొక మహారాష్ట్రబ్రాహ్మణునకు శ్రీకాశీమహాక్షేత్రమున నుద్భవించెను. మోరోపంతు కృష్ణరావుతాంబే మనుమడు; సార్థకనాముడగు బలవంతరావు కుమారుడు; వీరందరును పేష్వాలసైన్యములలో గొప్పగొప్ప సరదారులుగ నుండి తమతమ యుపక్రమపరాక్రమములను బ్రదర్శించుచుండిరి.

కాని యంతిమపీష్వాయగు ద్వితీయబాజీరావు 1818 వ సంవత్సరమున నెనిమిదిలక్షలరూప్యములపెన్షను స్వీకరించి పూనాపీడి బ్రహ్మావర్తమునకు వెడలిపోయెను. ప్రభుత్వమువా రతనిసోదరుడగు చిమాజీఆపాను సింహాసనాసీనుని జేయ బ్రయత్నించిరి; కాని యతడధికారశూన్యమైన నామమాత్రపుపదవి కంగీకరింపక తీర్థరాజమైన కాశీక్షేత్రమున దన



జీవితమును గడుపనెంచెను, మోరోపంతు చిమాజీఆపాయొక్కదయకు బాత్రుడయ్యెను; అతనిపైగల గాఢానురాగముచే చిమాజీ కాశీక్షేత్రమున కతనినిగూడ తనతో దీసికొని పోయెను.

మోరోపంతు సహధర్మచారిణి భాగీరథీబాయి; ఈమె మహాపతివ్రత; సాధ్వి; సుగుణశీల; సౌందర్యరాశి; ఈమె యుత్తమగుణశోభితయై, భర్తృపరాయణియై, గృహాంగణమున రాజ్యము నేలుచు గృహలక్ష్మియై వెలయుచుండెను.

మోరోపంతు తనభార్య గుణగణముల కత్యంతముద మందుచు నామెపై గాఢానురాగమును గలిగియుండెను. వారిరువురును దమగృహమును స్వర్గధామముగా నొనర్చిరి. వారిప్రేమ దినదినప్రవర్ధమాన మగుచు నాదర్శప్రాయముగ నుండెను.

పత్యనుకూలాచతురాప్రియంవదాసురూపసంపూర్ణా ।
సహజస్నేహరసాలాకుల వనితా కేన తుల్యాస్యాత్ ॥

స్వధర్మనిర్వహణమునందు భర్తకు చేదోడు వాదోడుగానుండునది; గృహపాలనాది కృత్యములందు చతురతను జూపునది; ప్రియమైనవచనములనే బలుకునది; రూపయావనసంపత్తుచే నొప్పునది; యథార్థమైన స్నేహభావముచే దనరారునదియగు కులకాంతకు సాటి యేదైనను గలదే ! పూర్వజన్మసుకృతముచేతనే పురుషుల కిట్టిగృహలక్ష్ములు లభించు

చుండురు. ఈసతీపతుల పవిత్రదాంపత్య ప్రేమఫలమే మన కథానాయిక.

1835 వ సంవత్సరము నవంబరు 16 వ తేదీని భాగీరథీబాయి గర్భము ఫలించి యొక కన్యారత్న ముదయించెను. ఈయపూర్వఫలమునకు తల్లిదండ్రు లానందమగ్నమానసులైరి. స్నేహితులును, సంబంధులును, పరిచితులును, నీబాలజ్యోత్స్నోదయమునకు వికసితవదనులై "ఈశ్వరు డీబాలికకు జిరాయువు నిచ్చుగాక! ఈకన్య కీర్తివంతురాలును పరాక్రమవంతురాలును నగునుగాక!" యను నాశీర్వాదదుందుభులను మ్రోయించిరి. ఒకనాడు సుప్రసిద్ధకాశీజ్యోతిషపండితు డీబాలిక జాతకపత్రమును జూచి "ఈమె రాజ్యలక్ష్మీపరివేష్టితయై, యజేయ్యశౌర్యరాశి యగు స్త్రీ కాగలదు" అని జ్యోతిషము చెప్పెను. పుష్పోదయమునకు బూర్వమే సౌగంధము దిక్కుల ప్రసరింప నారంభించును గదా! కాని యీబాలిక నవపల్లవారుణశరీరచ్ఛాయను, శాంతస్వభావమును జూచినవా రెవ్వరును కలలోగూడ నీమె పౌరుషస్వరూపము నూహింపజాలరైరి! ఈమెకు తల్లిదండ్రులు మనూబాయియను నామకరణము నిడిరి. ఇట్లుండ చిమాజీ ఆపా చనిపోయెను. మోరోపంతు కాశిలో కుటుంబయాత్రను జేయుట దుర్లభమయ్యెను. కాని చిమాజీఆపా సోదరుడగు బాజీరావు మోరోపంతును బ్రహ్మావర్తమునకు బిలిపించి



యుచితస్థానము నొసంగెను. వారచ్చట సుఖజీవనము జేయుచుండ మందభాగ్యురాలగు మనూబాయి మూడవయేటనే తనతల్లిని గోల్పోయెను. మోరోపంతు కళత్రవియోగదుఃఖము నొకవంక భరించుచు తానే స్వయముగా గృహకృత్యముల నన్నిటిని జక్కబెట్టుకొనవలసి వచ్చెను. మనూబాయి లాలనపాలనముల నతడే జేయుచు తల్లిలేనికొరతను దీర్చుచుండెను. మను శుక్లపక్షబాలచంద్రికవలె దినదినప్రవర్ధమాన మగుచు నూతనకళలను తొడగదొడంగెను. మను తండ్రితో పురుషమండలమున దిరుగుచుండునపుడు దాని విశాలనేత్రములను, బంగరుకాంతిని, నవపల్లవ సౌకుమార్యమును జూచి యబ్బురపడనివా రెవరును లేరు! బాజీరావుపీష్వా మొదలగువారందరు నామెయందమునకు మెచ్చుకొని యామెను చబేలీ (సంపంగిపుష్పము) యని పిలుచుచుండెడివారు. కాని యీచబేలీపుష్పము పీష్వావనమున బెరుగుచుండుటచే సద్గుణసౌగంధమునకు దోడు శౌర్యసంపత్తునుగూడ బాల్యమునుండియే యలవర్చుకొనుచుండెను. బంగారమునకు దావియబ్బెను.

బాజీరావు దత్తపుత్రులగు నానాసాహెబు, రావుసాహెబులుగూడ బాలురగుటచే నీపవిత్రయును నానావిధ వీరక్రీడలం దారితేరుచుండిరి. ప్రాచీనశిక్షావిధానము ననుసరించి యీమె సమస్తవిద్యలను, కళలను నభ్యసించుచుండెను. ఇందీమె యభిమానకళ యుద్ధకళ, ముఖ్యముగా ఖడ్గప్రహార

ములో నీమె యసమానపాండిత్యమును గడించి దాని మహిమ నాంగ్లసిపాయిల కెట్లు చవిజూపెనో మున్ముందు మనము చూడగలము. అశ్వారోహణము, కందకములను లంఘించుట, వ్యూహముల నతిచతురతతో నర్ధచంద్రాకారముగను, ధనురాకారముగను, నేర్పరించుట మొదలగువాని నీమె యేడేండ్ల బాలిక నానాసాహేబు, రావుసాహేబులతో బాటు నేర్చుకొని ముందురాబోవు వీరజీవితమున కిప్పటినుండియు బునాదులను నిర్మించుకొనుచుండెను. క్షాత్రతేజ మీబాలిక మనోక్షేత్రమున చిన్ననాటనుండియే నాటుకొన నారంభించెను. ఒకనాడు నానాసాహేబు భద్రగజము నెక్కి విలాసార్థము గ్రామోపాంతమునకు బోవుచుండెను. మనూబాయికూడ వాని ననుసరింప యత్నించెను. అదిచూచి బాజీరావు నానాసాహేబును హెచ్చరించినను నతడు చూడనట్లు నటించి యూరక బోవుచుండెను. మనూబాయి తనపట్టును విడదాయెను. మోరోపంతు తనకుమార్తె పట్టుదలకు కుపితుడై "నీ కేనుగు నెక్కు భాగ్యము లేదు. నీ నిరర్థక పట్టుదలను విడుము" అని మందలించెను. మనూబాయి వెంటనే "నాభాగ్యమును మీ రెరుగరు! నాకొక్కటికాదు పదియేనుగులు నిత్యము కైవారము జేయుచుండగలవు" అని ప్రత్యుత్తరమిచ్చిన ట్లొక యితిహాసముగలదు. ఈబాల వాక్యమే చివరకు బ్రహ్మవాక్యమయ్యెను! మనూబాయి కేడువత్సరములు వ



చ్చెను. ఆమె సౌందర్యము వయసుతోపా టతిశయించుచుండెను. శరీరకాంతులు స్వర్ణకాంతుల నీనుచుండెను. మోరోపంతునకు కుమార్తె వివాహచింత హెచ్చుకాజొచ్చెను. పిల్లకు తల్లిలేదు తండ్రికి ధనము లేదు. ఇట్టి కన్యకకు తగిన వరుడు సత్కులమున దొరకుటెట్లు? అను చింతయే మోరోపంతును బాధింప దొడగెను. బ్రహ్మావర్తమున నతని జాతీయులగు బ్రాహ్మణు లెవరును లేరు.

ఇట్లుండ నదృష్టవశమున ఝాన్సీరాజ్యమునుండి తాత్యాదీక్షితుడను నొకజ్యోతిష్కుడు బాజీరావు దర్శనమునకు బ్రహ్మావర్త మరుదెంచెను. ఈసమయమున మోరోపంతు తన కుమార్తె జాతకము నతని కిచ్చి యీకన్యకకు తగిన వరుని ఝాన్సీరాజ్యమున జూడవలసినదని కోరెను. అత డాజాతకమునుజూచి "ఈమె మున్ముందు రాజ్యలక్ష్మిని బడయగలదు" అని జ్యోతిషముజెప్పి ఝాన్సీరాజ్యము నేలుచుండిన మహారాజా గంగాధరరావున కీసంగతి తెలియజేసెను. కొలదిదినములకే 1842 వ వత్సరమున మహారాజా గంగాధరరావు మనూబాయి నతివైభవముతో వివాహమాడెను. ఝాన్సీ, బ్రహ్మావర్తములలో హర్షధ్వనులు చెలరేచెను. వివాహసమయమున నొక యద్భుత విశేషము జరిగెను. వధూవరుల మధుపర్కములకు బ్రహ్మముడి వేయుచుండ మనూబాయి పురోహితుని బిలచి "పురోహితవర్యా!

ఈముడి యెప్పటికిని విడివడనట్లు గట్టిగా బంధించుము" అని చెప్పెనట ! అనగా నాచంద్రార్కము మా ప్రేమబంధము విడివడకుండునుగాక అని భావగర్భితముగా బలికెను ! ఆహా ! ఇదియేకదా భారత వివాహాదర్శనము ! అత్తవారు మనూబాయికి (ఆదేశాచారము ప్రకారము) లక్ష్మీబాయి యను నూతన నామకరణ మిడిరి. మహారాజా గంగాధరరావు వివాహమగుటతోడనే మామగారికి నెలకు 300 రూప్యముల జీతము నేర్పరచి ఝాన్సీరాజ్యములో నొక సరదారుపదవి నిచ్చి యుచిత గౌరవ మర్యాదలతో నతని కుటుంబమును ఝాన్సీకి దోడ్కొనిపోయెను.

ఝాన్సీ

ఈ ఝాన్సీ మహారాష్ట్రుల పరిపాలనలోని కెప్పుడెవ్విధముగ వచ్చెనో కొంత తెలియవలసి యున్నది మధ్య భారతదేశమున (Central India) బుందేల్ఖండుఅను నొక విశాల, సుందర, సౌభాగ్య ప్రదమైన ప్రదేశము కలదు. బుందెలీలు అను నొక రాజపుత్రజాతివా రుండు దేశమునకే బుందేల్ఖండు అని పేరు. ఈబుందేల్ఖండులో ననేక చిన్న చిన్న స్వతంత్ర, స్వదేశ సంస్థానములు గలవు. ఈసంస్థానము లన్నింటిలో నతిబలాఢ్యమై, చారిత్రకవిఖ్యాతిని బడసిన సంస్థానమునకు ఝాన్సీ రాజధానిగా నుండెను. ప్రాచీన ఝాన్సీ వైభవమంతయు నేడు జూచినచో భస్మీపటల



మైనట్లు చూపరులకు గాన్పింపకలదు. ఆ ఝాన్సీ మన కిక నెన్నడును గాన్పింపబోదు ! ఓర్ఛా రాజైన వీరసింహదేవు నిర్మించిన ఝాన్సీకోట నేటికిని జీర్ణించి జర్జరీభూతమై యున్నను తన పూర్వవైభవమును, విస్తృత, భయంకర స్వరూపమును గొంతకు కొంతయైన జూపుచుండెను. వీరసింహదేవు సహజముగా బహుపరాక్రమశాలి. ఈభాగము నితడే పాలించుచుండెను. ఇతడు 1607 లో అక్బరుపాదుషా మంత్రియు సుప్రసిద్ధ చరిత్రకారుడును నగు అబుల్ఫజలును యుద్ధములో నోడించెను; అబుల్ ఫజలు యుద్ధములో మరణించెను. అక్బరు యీపరాభవమును సహింపజాలక తన కుమారుడగు సలీము నతనిపైకి బంపెను. అతడు పరాక్రమశాలియగు వీరసింహు నెదిరింపజాలక యుద్ధమును మానుకొనెను. అక్బరు చనిపోయిన తరువాత నతని కుమారుడు సలీము ఝాన్సీని వదలుకొనెను. కాని షాజహాను కాలమున ఝాన్సీ తిరుగ ఢిల్లీ యధికారమునకు లొంగిపోవలసివచ్చెను. కాని 1704 లో బహదుర్షా ఢిల్లీసింహాసనము నధిష్ఠించినపుడు ఝాన్సీపరగణాను ఛత్రసాలు తన జాగీరులో గలుపుకొనెను. ఈ ఛత్రసాలు పవారు రాజపుత్రుడు; బహుపరాక్రమశాలి; స్వధర్మాభిమాని. ఇతడు బుందేల్ఖండు ప్రాంతమునంతను నతి చాకచక్యముతో బరిపాలించుచు ప్రజారంజకుడై యుప్పెను. ఇతని వైభవమును జూచి సహింపజాలక మాళ్వాదేశ

పుసుబేదారు, అల్లాబాదునవాబు, ఢిల్లీపాదుషా మొదలగువా రొక్కుమ్మడి యితనిపై దలపడిరి. ఛత్రిసాలు ప్రథమ బాజీరావు పీష్వా సహాయముతో వారి నెదుర్కొనెను. శత్రువు లీపురుషసింహముల నిద్దరను జూచినతోడనే పలాయనులైరి. ఛత్రిసాలు బాజీరావు నుచితరీతిని సత్కరించి బుందేల్ఖండులో గొంతభాగము నతని కిచ్చెను. ఛత్రిసా లంతటితో దృప్తిచెందక తన మరణకాలమునందు బుందేల్ఖండులో కోటిరూప్యములు వచ్చు మూడవభాగమును తిరుగ బాజీరావు కిచ్చెను. బాజీరా వీభాగమును మూడు భాగములుగా విభజించి ముగ్గురు సుబేదారుల నేర్పాటు చేసి తగిన కట్టుదిట్టములను గావించి దక్షిణమునకు మరలిపోయెను. ఇందులో నిరువది లక్షలరూప్యములు వచ్చు నొక భాగమగు ఝాన్సీప్రాంతము నారోశంకరు మోతీ వాలేయను సుబేదారు అధికారముక్రింద నుండెను. 1756 లో ఝాన్సీ సుబేదారు తిరుగబాటుజేసి ఝాన్సీని తనవశము జేసికొనెను. ఈసంగతి విని బాజీరావు రఘునాథ హరినేవాల్కరు అను మహారాష్ట్రుని సుబేదారుగ నియమించి దక్షిణదేశమునుండి పంపించెను. ఇతడు మహాబుద్ధిశాలి; పరాక్రమవంతుడు. ఇతడు ఝాన్సీ చేరి శత్రువును నాశ మొనర్చి పీష్వారాజ్యమును తిరుగ ఝాన్సీలో బ్రతిష్ఠించెను. బాజీరా వీశుభవార్తను విని సుబేదారుపదవి రఘునాథహరి వంశపరంపరా యనుభ



వించునట్లు ప్రపాదించెను. రఘునాథహరి బుందేలులనుండి ఝాన్సీరాజ్యమును రక్షించుకొనుట కనేక సైన్యములను జేకూర్చుకొనెను. తరువాత నతడు తిరుగబాటుదారుల నందర నణచివేసి ఝాన్సీప్రాంతము నంతను దనయధీనమునకు దెచ్చుకొనెను. ఈప్రకారము బుందేల్ఖండులో మహారాష్ట్ర రాజ్యము విజృంభించుటతోడనే రఘునాథహరి సోదరులగు లక్ష్మణరావు, శివరావుభావులుగూడ నతని సహాయార్థము వచ్చిరి. ఈరఘునాథహరియే మనచరిత్రనాయిక లక్ష్మీబాయి యొక్క భర్తృవంశమునకు మూలపురుషుడు; బుందేల్ఖండులో మహారాష్ట్రాధికారమును బునఃప్రతిష్ఠించిన యోధుడు. ఇతనికి సంతానము లేకపోయెను; వృద్ధావస్థ ప్రాప్తించియున్నందున నితడు తన యధికారమును తమ్ముడైన శివరావు భావున కిచ్చివేసి కాశీలో నీశ్వరధ్యానమున కాలముగడుపుచుండెను. ఇట్లుండ ద్వితీయ బాజీరావు పీష్వాయై పూనాసింహాసనము నధిరోహించెను. ఇతని పరిపాలనకాలములో మహారాష్ట్రమంతయు నల్లకల్లోలమయ్యెను. సరదారులందరును స్వాతంత్ర్యమును బ్రకటింప నారంభించిరి. పీష్వా అసమర్థుడయ్యెను. ఇట్టితరి పాప మాంగ్లేయు లెట్లూరకుండగలరు! వారును తమశక్తికొలది రాజ్యవిజృంభణకు గడంగిరి. కాని శివరావుభావు బహుపరాక్రమవంతుడు. కనుక నింగ్లీషుసేనానియగు లేక్ దొర యతనితో నొక నూతనసంధి నేర్పాటుచేసుకొ

నెను. 1804 ఫిబ్రివరి 6 వ తేదీని వాట చేసుకొనిన సంధిప త్రిములో నిట్లు కలదు. "ఇంగ్లీసువారును శివరావుభావుయును స్నేహితులు. వా రాపదలు వచ్చినపు డొకరి కొకరు పరస్పర సహాయము జేసికొనవలెను." ఈశివరావుభావుకు కృష్ణరావు, రఘునాథరావు, గంగాధరరావు, అను ముగ్గురు పుతు్రి లుండి రి. శివరావుభావు తదనంతరము కృష్ణరావు కుమారుడగు రామచంద్రిరావు అధికారమునకు వచ్చెను. ఇతనికాలములో గూడ ద్వితీయ బాజీరావే పీష్వా యగుటయు నతని యవినీతి చేతను, అసమర్థతచేతను రాజ్యమంతయు చిందర వందర యగుటయు, నెవనికివాడు, స్వతంత్రుిడగుటయు నాంగ్లేయుల చేతులలోనికి పీష్వా యధికారమంతయు గ్రిమక్రిమముగా జారుటయు మొదలగు విపరీతపరిస్థితులన్నియును సంభవించెను. 1817 జూన్ 13 వ తేదీని పీష్వా యింగ్లీషువారితో సంధిచేసుకొనెను. ద్వితీయబాజీరా వీసంధిద్వారా బుందేల్ఖండునంతను ఆంగ్లేయులపరము జేసెను. ఈనూతన సంధిప్రికార మాంగ్లేయులు ఝాన్సీకి సుబేదారైన రామచంద్రిరావుతో మరల నొక ప్రిత్యేకసంధి జేసికొనిరి. సీప్రిలో నాంగ్లేయుల తరఫున జాన్ వాహుచప్ యును రామచంద్రిరావు తరఫున మంత్రిగో పాలరావును సంధిపత్రిమును వ్రాిసికొనిరి. దీనిప్రికార మింగ్లీషువారు ఝాన్సీని రామచంద్రిరావు వంశపారంపర్యముగా ననుభవింపగలందుల కంగీకరించిరి.



1835 సంవత్సరమున రామచంద్రిరావు సంతతిలేకుండ చనిపోయెను. చనిపోవునపు డతడు కృష్ణరావు అను నొక బాలకుని దత్తతచేసికొనెను. ఈదత్తత శాస్త్రసమ్మతము గాదని యెంచి ఝాన్సీలో నుండు ప్రిభుత్వయేజెంటు బేక్బేదార శివరావుభావుయొక్క మరియొక కుమారుడైన రఘునాథరావును సింహాసనముపై గూర్చుండబెట్టెను. ఇతడు కూ్రిరుడు; అవినీతిపరుడు; దుర్వ్యసనములకు లోనయి ప్రిజలను క్షోభపెట్టెను. రాజ్యమును పాడుచేసెను. రఘునాథరావు 1838 లో చనిపోయెను. తరువాత రాజ్యమునకు రావలసిన వారిని నిశ్చయించుటకు ప్రిభుత్వమువారే యొక కమీషను నేర్పరచి శివరావుభావుపుత్త్రుడైన గంగాధరరావు సన్నిహిత వారసుడని ధృవపరచి యతనిని సింహాసనాసీనుని జేసిరి. ఈగంగాధరరావే మన చరిత్రి నాయికయగు ఝాన్సీ లక్ష్మీబాయిభర్త.

### మహారాజా గంగాధరరావు పరిపాలన.

ఝాన్సీరాజ్యమును మొదటినుండియు వీరులును, పౌరుష శాలురును పాలించుచుండిరను విషయము మన కీచరిత్రి వలన బోధపడుచున్నది. ఝాన్సీపై సంపూర్ణాధి కారమును గంగాధరరావుకిచ్చుచు ప్రిభుత్వమువా రతనిపై నొక షరతు విధించిరి. మహారాజు ఖర్చుపై ఝాన్సీ రాజ్యములో గొంత ఆంగ్లసైన్యము నుంచవలెనని నియమించిరి. దీనికొరకు గంగా

ధరరావు సుమారు మూడులక్షలరూపాయిలను ప్రత్యేకముగా యుంచి రెండుఆంగ్లపటాలములను రెండు ఆయుధకోశాగారములను వారివశముజేసెను. ఖజానాలోనున్న 30 లక్షలరూపాయిలును, సర్వాధికారములును గంగాధరరావు కిచ్చివేయబడెను. గంగాధరరావు పట్టాభిషేక మతివైభవముతో జరుపబడెను. అనేకమంది సరదారులును, జాగీరుదారులును వినయపూర్వకముగా నతని కనేక కానుకలను సమర్పించిరి. ఝాన్సీ ప్రజ లందరును సంతోషస్వాంతులై తోరణాద్యలంకారములతో నగరము నలంకరించి యుత్సవములను జరుపుకొనిరి. మహారాజా గంగాధరరావు బుద్ధిశాలి పరాక్రమవంతుడు; రాజకీయ దురంధరుడు; ప్రజలందరు నతని పరిపాలనలో సర్వసౌఖ్యముల ననుభవించుచుండిరి. అతనికి పూర్వుడైన రఘునాధరావు గావించిన ఋణములన్నియును తీరి రాజ్యము సుభిక్షముగా పరిపాలింపబడుచుండెను త్వరలోనే గంగాధరరావు ప్రజల కత్యంతప్రియుడయ్యెను. అతడు మొట్టమొదట పరిపాలనావిధానములో ననేక మార్పులను గలుగజేసెను; కార్యదక్షులు, రాజనీతికోవిదులు, బుద్ధిశాలురు నగువారలను మంత్రులనుగా నేర్పరచి రాజ్యసభను కట్టుదిట్టము చేసెను. రాఘోరామచంద్రపంతును రాజమంత్రిగాను, నరసింహారావును దర్బారువకీలుగాను, నానాభోపట్కరును అదాలతుగాను నిట్లు ప్రజ్ఞావంతుల నేరి ప్రతిసంస్థను సంస్కరింప



దొడగెను. ఠాకురులు, బుందేలులు మొదలగు వారలనుండి యుపద్రవములు రాకుండ నచ్చటచ్చట తగినంత సిబ్బంది నుంచెను; పలుగడలను శాంతి స్థాపింపబడెను.

గంగాధరరావు గొప్పరాజ్యతంత్ర ప్రవీణుడు; అతడు రాజ్యమునకు వచ్చుటతోడనే రఘునాధరావు కాలములో జరిగిన యవినీతిని, అన్యాయమును బూర్తిగా దొలగించుటే కాక నతడు ఝాన్సీ రాజ్యమునకు కలుగజేసిన నష్టమును గూడ కూడదీసికొనెను. త్వరలోనే ఝాన్సీలో లక్ష్మీబాయి తోపాటు ధనలక్ష్మియు, రాజ్యలక్ష్మియు నభివృద్ధి కాజొచ్చెను. ధనాగారములు, రత్నభాండారములు పూర్వవైభవముతో దులతూగ నారంభించెను. అశ్వదళము పెంపొందింపబడెను; గంగాధరరావు మదపుటేనుగుల ననేకములను దెప్పించి చతురంగబలములతో రాజ్యమును కట్టుదిట్టము చేసికొనెను. ఏనుగులు, గుఱ్ఱములు మొదలగువాని యంబారీలు, జీనులు, కవచములు మొదలగు సామానంతయు బంగారముతోనే తయారుచేయబడి రాజ్యవైభవమును విశదముచేయుచుండెను. ఇట్లు 5000 శాశ్వతసైన్యమును, 2000 రక్షకభటులును, 500 గుఱ్ఱపుదళమును, నూర్గురు అంగరక్షకులును, (తోప్ ఖానా) మరఫిరంగులను తయారుచేయు నాలుగుకార్యాలయములును చేకూర్చుకొనబడెను. గంగాధరరా వెంత వినమ్రుడో అంత పరిపాలనాదక్షుడు; అతనియాజ్ఞల నందరును

శిరసావహించుట కుత్సాహ పడుచుందురు. అతఁడొక్కొక రాజ్యకార్యనిర్వాహణమున కొక్కొక ప్రజ్ఞావంతుని నియమించి వారిచేతనే సకాలములో కార్యములను జరిపించుచు నెంతమాత్రము కాలవిలంబనమైనను తానే స్వయముగా జేయుచుండును. ఓర్ఛా, దతియా, చర్ఖారీ, పన్నా, ఛత్రపురము మున్నగు రాజులందరు నతనిని "కాకాసాహేబు" అని సన్మానపూర్వకముగా పిలుచుచు గౌరవించుచుండిరి. ఇతని చాతుర్యమును, కార్యదక్షతను, దయాళుత్వమును జూచియే ఆచ్చటి యాంగ్లాధికారికూడ నితనిని సన్మానించుచు నుభయుల మైత్రిని దృఢతరము జేసికొనుచుండెను. ఇట్లు రాజ్యవైభవము నన్నివిధములను పెంపొందించి గంగాధరరావు కుటుంబముతో బుణ్యక్షేత్రములు సేవింప తీర్థయాత్రల కరిగెను. వారు కాశీ, గయా, ప్రయాగ మొదలగు తీర్థరాజములను సేవించి యనేక దానధర్మములను జేసిరి; మహారాణి లక్ష్మీబాయి తనజన్మభూమియగు కాశికాక్షేత్రమును గాంచినపు డపరిమితానందభరితురాలై జగన్నాథుడగు కాశీవిశ్వేశ్వరుని సేవించెను. వారు తీర్థయాత్రలను సలిపిఝాఁసీకి తిరిగివచ్చుటతోడనే ప్రజలు సంతోషపూర్వకముగా నుత్సవములను సలుపుకొనిరి. ఇట్లు ఝాఁసీ నగరమంతయు నానందముతో నోలలాడుచుండ మహారాణి లక్ష్మీబాయి కొక నవమన్మథమూర్తి జనించెను. ఈపుత్రోదయముచే గంగాధరరావు మరింత సంతోషముతో



నుండెను. పట్టణ మంతయు నుత్సవములతో కోలాహలముగా నుండెను. కాని మూఁడు నెలలు నిండకమునుపే యీబాలుఁడు పరమపదించెను. గంగాధరరావు కిది యొక గొడ్డలిపెట్టుగా పరిణమించెను. పుత్రవియోగదుఃఖము నతఁడు భరింపలేకపోయెను; అతని విచారమునకు మేరలేక మనోవ్యాధిచే కృశించిపోవుచుండెను. శరీరస్వాస్థ్యము చెడిపోయెను. అంతకంతకు వ్యాధి వృద్ధియై యౌషధసేవవలన లాభములేకపోయెను. ప్రజలందరును గగ్గోలుపెట్టసాగిరి. గంగాధరరావు కారోగ్యముగలిగి చిరంజీవి యగుగాక యని వారీశ్వరుని ప్రార్థించిరి. కాని యెన్ని చేసిననేమి? గొప్పగొప్పవైద్యుల ప్రయత్నములన్నియు వృథయయ్యెను. ప్రభుత్వాధికారియైన మేజరు మాల్కము దొర యీవిషయములను ప్రభుత్వమువారి కెఱుకపరచి, తానును వైద్యసహాయమును గావించెను. పూజలు, హోమములు, జపములు, తపములు, అనుష్ఠానములు మొదలగునవెన్నియో జరుపబడెను. ఇక మహారాణి లక్ష్మీబాయి దురవస్థ వర్ణింప నలవిగాకుండెను. ఒకప్రక్క పుత్రవియోగదుఃఖము శరీరమును దహించుచుండెను. రెండవప్రక్క భర్త మృత్యువాత బడనుండెను; ఆమె ఆహారనిద్రలను వీడి సంతాపాగ్నిచే తపించుచుండ ఝాఁసీదర్బారంతయు విచారసాగరమున మునిగియుండెను; అంతకంతకు నిరాశ జనించెను; లక్ష్మీబాయితండ్రి మోరోపంతు, రాజమంత్రి నరసింహరావు

లుగలసి మహారాజును సందర్శించి రాజకీయవిషయములను గురించి యతనితో జర్చించిరి. మహారాజట్లు ప్రత్యుత్తర మిచ్చెను. "నాకింకను జీవింతుననునాస యున్నను దత్తతచేసికొనవలెనని కుతూహలము గలదు. మాకుటుంబమునకు జెందిన వాసుదేవనేవల్కరు అనువానికి ఆనందరావను నొకకుమారుడు గలడు. అతనిని దత్తత చేసికొనవలెనని నాకోరిక." ఈ యానందరావు కపుడయిదేండ్ల ప్రాయము. అతనిని జూచిన వారందరు నతడు మహాబుద్ధిశాలియు శూరుడును కాగలడని యూహించుచుండిరి. అప్పుడే దత్తహోమమున కేర్పాట్లు గావింపబడెను. పండిత వినాయకరావు యథావిధిగా శాస్త్రవచనములతో దత్తవిధిని జరిపించెను. మోరోపంతు, రాజమంత్రి నరసింహరావు, లాలాహోరిమల్లు మొదలగు పరివారమును, ఝాన్సీలోని గొప్పగొప్పధనాఢ్యులును, బుందేల్ఖండుయొక్క సహాయప్రభుత్వాధికారి (Assistant Political Agent) మేజరు ఏలిసు, స్థానికసేనాధికారి కప్టను మార్టిను మొదలగువారందరు నుండగా దత్తత జరిపింపబడెను. ఆనందరావుకు దామోదరరావు అను నూతన నామధేయ మీయబడెను. మహారాజు ఆనందముతో స్వయముగా దామోదరరావును పట్టాభిషిక్తుని జేసెను. దర్బారున కాహ్వానింపబడినవారందరు నానాభూషణాదులతో యథాయోగ్యముగా సత్కరింపబడిరి. ఈ దత్తతస్వీకారము పూర్తియగుటతోడనే గంగా



ధరరావు రాజమంత్రి నరసింహరావును, మోరోపంతును పిలిచి ప్రభుత్వమువారి కొక పిటీషను వ్రాయించెను అప్పుడచ్చోట ఝాన్సీసహాయప్రభుత్వాధికారి (Assistant Political Agent) కూడ నుండెను ఆయుత్తరములో నిట్లు వ్రాయబడెను. "బ్రిటిషుప్రభుత్వమువారు తమ యధికారమును బుందేల్ఖండులో స్థాపించుటకు పూర్వమునుండియు గూడ మావంశమువారు తమ కెట్టిసహాయము జేయుచు వచ్చిరో యారవు అంతకును తెలిసియే యున్నది. నేనుకూడ బ్రిటిషుప్రభుత్వమువారి యాజ్ఞానువర్తినై మెలగితిని ఈవిషయమై సమస్తము నిచ్చటి ప్రభుత్వాధికారి (Political Agent)కే తెలియును. నేను నేడు రోగగ్రస్థుడనై యున్నాను. నేటివరకును నాప్రవర్తన బ్రిటిషుప్రభుత్వముపట్ల ధర్మబద్ధముగనే యుండెను. ప్రభుత్వమువారుకూడ నాపై కృపాదృష్టినే బరపిరి. కాని నేడు నావెనుక నావంశము నష్టమగుచుండుట జూడ నాకు ఖేదముగానున్నది. ఇట్లు కాకుండుటకు నేను, బ్రిటిషు ప్రభుత్వమునకును మావంశమువారికిని జరిగిన సంధిప్రకారము మావంశముననే చెందిన ఆనందరావు అను నయిదేండ్ల బాలుని దత్తత జేసికొంటిని. వానికి దామోదరగంగాధరరావు అను పేరిడితిని. అతడు నామనుమడు ఈశ్వరకృపచేతను సర్కారువారి యనుగ్రహముచేతను నే నీసంకటావస్థనుండి తప్పించుకొని జీవింపగలననియే యాశించుచున్నాను.

నాయవస్థ మారినచో నాకు సంతతి కూడ కలుగవచ్చును. అట్లు తటస్థించినచో మరల నీవిషయమై యోచింపవలసి యుండును. కాని నేనిప్పుడు పరలోకగతు నగుదు నేని నేనింతవరకు బ్రిటిషుప్రభుత్వమువల్ల నెట్టియుత్తమప్రవర్తనను జూపుచు నుంటినో దానిని గ్రహించి సర్కారువారీబాలుని కృపాదృష్టితో జూతురుగాక! నాభార్య జీవించునంతకాలము నామెయే యీరాజ్యమునకు ప్రభ్విగానుండవలెను. ఈబాలకున కామెయే తల్లిగానుండి రాజ్యవ్యవస్థ యామెయధీనములోనే యుండవలెను. ఈవిధముగా నెట్టిసంకటములు ప్రాప్తించకుండును గాక!"

ఈయుత్తరమును గంగాధరరావు ఏలిసుదొరచేతి కందిచ్చుచు దుఃఖము నాపుకొనజాలక కంఠస్తంభితబాష్పములతో దన యిచ్ఛను నెరవేర్పవలసిన దని మరల మరల జెప్పెను. ఏలిసుదొర అతివినయముతో నిట్లుప్రత్యుత్తరమిచ్చెను. "మహారాజా! మీరు వ్రాసినయుత్తరమును బ్రిటిషుప్రభుత్వమువారికి పంపించుచు నేను జెప్పవలసినంతవరకు మిమ్ముగురించి ప్రభుత్వమువారి కెరుకపరచెదను." ఈపరిశ్రమవలన మహారాజశరీరము మరింతదైన్యము నొందెను! రాబోవు విషమావస్థను సూచించు చిహ్నములు కాన్పించుచుండెను. ఏలిసు, మార్టిను లిద్దరును ఔషధము నిచ్చి తమయిండ్లకు బోయిరి. అందరును వెళ్ళినతర్వాత మహారాణీ లక్ష్మీబాయి మహారా



జును దర్శింపబోయెను. స్వర్గము నలంకరింప సిద్ధముగానున్న తనభర్తను జూచుటతోడనే మహారాణి హృదయము నీరైపోయెను; ఆమె నిశ్చేష్టురాలై నోటమాటరాక నేల కూలబడెను. ఏలిసుదొర వెంటనే బుందేల్ఖండు ప్రభుత్వాధికారి (Political Agent) యైన మాల్కముకిట్లు జాబు వ్రాసి పంపెను. "నేడు మహారాజు ఆహ్వానము నంగీకరించి నేను రాజభవనమునకు బోతిని. నేనును కప్తను మార్టినును గలసి మహారాజును దర్శించితిమి. అతనియవస్థ కడుదైన్యముగా నుండెను. నే నిందుతో బంపించిన పిటిషను నాకు చదివి వినిపింపబడెను. అది చదివి వినిపించినతరువాత మహారాజునకు మాట రాకపోయెను; నే నంతట తిరిగి నాబంగాళాకు వచ్చివేసితిని"

ఇట్లు జరిగినతరువాత మహారా జంతకంతకు దైన్యత నొందుచుండెను. మహారాణి లక్ష్మీబాయి దుఃఖము నాపుకొనజాలక రానున్న కష్టమును జింతించుకొనుచు నగాధజలరాశిమధ్య వెరవుగానక కొట్టుకొనుచుండు నోడచందమున నుండెను. వేలకువేలు ప్రజలు మహారాజు క్షేమము నారయుటకు రాత్రింబవళ్ళు కోటచుట్టును దిరుగుచుండిరి. మాటకట్టువడినభర్తను జూచుటతోడనే రాణి లక్ష్మీబాయి కన్నీరు మున్నీరుగా నేడ్చుచు తనయిలువేల్పగు మహాలక్ష్మీదేవి నెలుగెత్తి పిలుచుచు "హే జగజ్జననీ! హే! మాతా! నీవు చిన్నతనములోనే నాగొంతుకను గోసివేసితివి! ఈదుర్భరదుఃఖము

ననుభవింపకుండ నీవు నాప్రాణముల నేల నాభర్తతోపాటు తీసికొనిపోరాదు !" అని వాపోవుచుండెను. మోరోపంతు మొదలగువారు లక్ష్మీబాయి నూరడించుచు ధైర్యమును బుఱికొల్పుచుండిరి. ఎన్నిమందు లున్న నేమి ! చిట్టచివరకు మహారాజు దీనవదనముతో "ఏజెంటుసాహేబు యెచ్చట నున్నాడు !" అని కొనయూపిరితో బ్రశ్నించెను. ఎలిసుదొరకు తత్క్షణమే వర్తమాన మంపబడెను. అతనిని చూచి గంగాధరరావు ముఖము చిదానందమును దాల్చెను; అత డేదియో మాట్లాడ బ్రయత్నించెను; కాని నోట మాటరాలేదు. వైద్యులుకూడ వలదని మాట్లాడ వారించిరి. చిట్టచివరకు మృత్యువా సన్నమగుటకు బూర్వ మతడు మరియొక పిటీషను బుందేల్ఖండుయేజెంటు మాల్కాముదొరకు వ్రాయించెను. ఎలిసుదొరకు వ్రాసిన విషయముల నన్నింటినిందులో జేర్చుచు రామచంద్రరావుతో ప్రభుత్వమువారు చేసుకొనిన సంధివిషయమై యిట్లు వ్రాసెను. "ఝాన్సీ బ్రిటిషు ప్రభుత్వములమధ్య మిత్రత చిరకాలమునుండియు నేర్పడెను. ఈకారణముచేతనే బ్రిటిషు ప్రభుత్వమువారు రామచంద్రరావునకును, అతని వారసులకును, మరియు వారివారసులకును, బుందేల్ఖండులో నాంగ్ల ప్రభుత్వమధికారము చెలాయించు కాలము వచ్చునాటికి శివరావుభావు యధీనమందున్న, ఝాన్సీప్రాంతమంతకును వంశపారంపర్యహక్కులతో స్వతంత్రునిగా నియమించి వాని నా



ప్రాంతమునకు స్వతంత్రరాజుగా నంగీకరించిరి. నే నిందులో వ్రాసిన సమస్తవిషయములను మేజరు ఎలిసు, కప్తాను మాల్కములకిదివరకే స్పష్టపరచితిని. నేను నావంశములో వాడైన ఆనందరావను నొకబాలుని దత్తము చేసికొంటిని. దీనిని గురించిన యుత్తరమును వారికే యిచ్చివేసితిని. వా రాయుత్తరమును మీకు బంపించియుందురని విశ్వసించుచున్నాను."

గంగాధరరావు తన యంతిమప్రార్థనను మిత్రులగు బ్రిటిషువారు మన్నింతురనియు, చిరకాలము ఝాన్సీరాజ్యము తనవంశములోనే యుండుననియు సంపూర్ణవిశ్వాసమును గలిగియుండెను. అతడు లక్ష్మీబాయిని పిలచి "నీ వెట్టివిచారమును బొందవలదు: బ్రిటిషు ప్రభుత్వమువారికి సమస్తవిషయములను విశదపరచితిని. నాప్రార్థనను బ్రిటిషుప్రభుత్వమువారు తప్పక మన్నింతురని నావిశ్వాసము. నాతరువాత నాంగ్లప్రభుత్వమువారి కృపారసదృష్టిచే నీ కెట్టికష్టములును కలుగకుండునుగాక !" అని యూరడించెను. చివరకు 1853 నవంబరు 21 తారీఖున మహారాజా గంగాధరరావు స్వర్గస్థు డయ్యెను.

ఈవిషాదవార్త అచిరకాలములోనే దేశమంతయు ప్రాకిపోయెను. ఝాన్సీనగరమంతయు విచారములో మునిగిపోయెను. రాజమహాలు శూన్యగృహ మయ్యెను ! ఎచ్చటజూచినను రోదనధ్వనులు తప్ప మరేవియు వినరాకుండెను. మృగశాబకముపై వజ్రబాణము పడినట్లు, దూదిపింజలో నగ్నికణ

ములు రాలినట్లు మహారాణి లక్ష్మీబాయి హృదయము నీవార్త వ్రక్కలు జేయుచుండెను. 18 వత్సరముల బాలికకు దుర్భర వైధవ్యదశ ప్రాప్తించుటకన్న నీలోకములోనికకలుగదగినహాని యేమియునుండజాలదు! ముందెట్టికష్టపరంపరలు రానున్నవో యెవరికెఱుక! వాని నన్నింటిని బదునెనిమిదేండ్లబాలిక తరించుటెట్లు! ఝాంసీనగరమునకు ముందెట్టిదినములు పట్టనున్నవో, వీరసింహదేవు భుజపరాక్రమమును, ఛత్రసాలు పౌరుషమును, శివరావుభావు ధైర్యసాహససంపత్తిని జాటగల ఝాంసీకోట యేమికానున్నదో, సుమారు మూడువందల వత్సరములనుండి బుందేల్ఖండులో నసమానఖ్యాతిని గాంచి స్వదేశసంస్థానాధీశులచే పరిపాలింపబడుచువచ్చిన యీఝాంసీరాజ్యమిక మెట్టితుపానుల నెదుర్కొనవలెనోకదా! భారమంతయు దైవముదే! యనునట్లు ప్రజారోదన బయలుదేరెను.

పౌరు లందరును గంగాధరరావు శవముతో శ్మశానమున కరిగిరి. ఎలిసు, కప్తను మార్టిను దొరలును మరికొందరు ఆశ్రితులును విచారసూచకముగ కాలాంబరధారులై రుద్రభూమికి వెడలిరి; సర్దారులు, ఠాకురులు, ప్రజాగణము మొదలగువారు లెక్కలేకుండ నచ్చటకు బోయిరి. వీరందరును నాలుగుమూలలనుండియు విచారముతో హాహాకారములను గావించిరి. ఎలిసు, మార్టిను మొదలగువారీయాపత్స



మయమున రాజమహాలునకు బోయి లక్ష్మీబాయిని శాంతివచనములతో నూరడించి ధైర్యమును బురికొల్పుచుండిరి. ఝాంసీరాజ్యకోశాగారము కోటలో నుండెను ఎలిసు కోటలోనికి జని కోటలోనున్న ఖజానాను జాగ్రత్త పెట్టించెను. అందులో సుమారు 3 లక్షల రూప్యములు ఉండెను. కోశాధ్యక్షుడైన పండితజ్వాలానాథు సమక్షమందు కోశాగారమునకు దాళమును సీళ్లును వేయబడెను. కోటను సంరక్షించుటకు సింధియాసర్కారుయొక్క సేన నియమింపబడెను. కప్తను మార్టిను సేన నతినిపుణతతో తయారుచేయుచుండెను.

మహారాజా గంగాధరరావు చనిపోయిన వార్తను ఎలిసుద్వార బుందేల్ఖండు ఏజెంటు మాల్కముగారు 1853 నవంబరు 21 వ తారీఖున తెలియజేసెను. మాల్కము దానితోపాటు 25 నవంబరున ప్రభుత్వకార్యదర్శి కిట్లు సూచించుచు వ్రాసెను. ఇతడు గవర్నరుజనరలుకు రుచించు విధానమునే సూచించి కపటనాటకమున బాత్ర వహించెను.

"మాన్యవర్యా!

మహారాజా గంగాధరరావు నవంబరు 21 వ తేదిని స్వర్గస్థు డయ్యె ననుసంగతి గవర్నరుజనరలు సాహేబు బహదరుగారికి తెలియజేయుటకు నాకెంతయో దుఃఖము వచ్చుచున్నది:

2. చనిపోవుట కొకదినముపూర్వము మహారాజు దామోదరగంగాధరరావు అను నొక అయిదేండ్ల బాలునిపెంచుకొనెను; ఈపిల్లవాడు గంగాధరరావు వంశములోని వాడని యతడు చెప్పెను. కాని యతడు గంగాధరరావునకు పూర్వుడైన రఘునాధరావు కయిదవ తరములోని వాడని తెలియవచ్చినది. కనుక నతడు మనసాంప్రదాయము ప్రకారము మహారాజునకు వేరిలుపిడిచిన సోదరుడని తలంపవలెను.

3. మేజరు ఏలిసు మహారాజును కలుసుకొనిన విషయమును, ఆతనిమృత్యువు విషయమై నాకు పంపించిన లేఖయును తమదివ్యసముఖమునకు మీాయవలోకనార్ధము పంపుకొనుచున్నాను. మహారాజు ఆనందరావును పెంచుకొనుచు నాకు వ్రాసిన లేఖనుగూడ తమకు పంపుకొంటిని.

4. ఝాన్సీమహారాజు తనకు మృత్యు వాసన్నమైన సమయమం దప్పటి కప్పుడు దత్తతచేసికొనుట కాలోచనలు సలిపెను. ఇది విని ఝాన్సీ దర్బారులోని ప్రతివాడును నాశ్చర్యపడియుండవచ్చును. ఏలనన ప్రజలందరును మహారాణి జీవించియున్నంతకాలము రాజ్యసంపత్తు సంతను మహారాణి యధీనముననే యుండునట్లు ప్రభుత్వమువారిని ప్రార్ధించెదరని యూహించుచుండిరి. కాని బ్రిటిషుప్రభుత్వమువారితో సంధిచేసికొనిన సుబేదారు శివరావుభావు వంశములోను, తనవంశములోనుకూడ వారసులును, దగ్గిరసంబంధులును లేక



పోవుటను జూచి యతడీ దత్తత చేసికొనుటకు నిశ్చయించెనని యూహించెదను. భారతప్రభుత్వమువారికి సూచనార్ధమై ఝాన్సీరాజవంశవృక్షము నొకదాని నిందుతో బంపించుచున్నాను. దీనిప్రకారము మీాబాలుడు మహారాజుకు పూర్వుడైన ప్రథమరఘునాధరావు వంశమువాడని విదితము కాగలదు.

నేను మేజరు ఏలిసుసాహేబుకు 2 వ తారీఖునే యొక సూచనాపత్రమును పంపించియుంటిని; దాని ప్రతిని యొకదానిని భారతసర్కారుకుగూడ పంపియుంటిని. నాసూచనల ననుసరించియే ఏలిసుసాహేబు తన విధిని నెరవేర్చుచున్నాడు.

బ్రిటిషుసర్కారువారు ఝాన్సీరాజ్య వ్యవస్థను గురించి యంతిమ ఆజ్ఞలను దయచేయువరకు మహారాజు దత్తతస్వీకార మెంతమాత్రమును లెక్కచేయబడదు.

ఝాన్సీ, బ్రిటిషు సర్కారులకు గల సంబంధమును తెలియజేయుటకు క్రింద కొన్ని ప్రమాణములను జూపుచున్నాను. వీనివలన నంతయు గ్రాహ్యము కాగలదు. ఈవిషయముల నన్నిటిని జాగ్రత్తగా పరిశీలించితిమేని ఝాన్సీమహారాజుకు దనరాజ్యమున కెవరినిగాని యుత్తరాదికారిగ నియమింపగల యధికార మున్నదియు లేనిదియు స్పష్టము కాగలదు.

1804 నుండి మనకు బుందేల్ఖండుతో సంబంధము కలిగెను. అప్పుడు పీష్వాయొక్క తాబేదారును, మండలాధిపతి

యు నగు శివరావుభావుతో మనము సంధి చేసికొంటిమి. 1817 లో పీష్వా ఝాన్సీపై సమస్తహక్కులను బ్రిటిషుసర్కారువారి కిచ్చివేయగా శివరావుభావువంశములోనివాడైన రామచంద్రరావునకు ఝాన్సీరాజ్యమును వంశపారంపర్యహక్కులతో నిచ్చివేసితిమి కనుకనే నాటినుండియు సుబేదారు బిరుదుకు బదులు రాజా యను బిరుద మివ్వబడెను. రామచంద్రరావు 1835 లో చనిపోయెను. అతనికి పుత్రులు లేరు. కాని అప్పుడు శివరావుభావు కుమారులగు రఘునాథరావు, గంగాధరరావులు జీవించియుండిరి. రాజ్యాధికారము వారి కిచ్చివేయబడెను. ఇపుడు గంగాధరరావు చనిపోవుటతోడనే అతనివంశ మంతమయ్యెను.

ఇచ్చట మరియొక విషయమును గూడ వ్రాయవలసియున్నది. రామచంద్రరావు చనిపోవుటతోడనే ఝాన్సీరాజ్యమున కిరువురు తమ హక్కును ప్రకటింపసాగిరి. ఒక డతని దత్తతపుత్రుడు; రెండవవా డతనిభార్య దత్తతపుత్రుడు; కాని వీరిద్దరిహక్కులు నప్పుడు తిరస్కరింపబడెను. ఈకాలమందు జరిగిన పత్రవ్యవహారములనుబట్టి ఝాన్సీరాజ్యము బ్రిటిషుప్రభుత్వమున కెట్టి షరతులతో నధీనము గావింపబడెనో విదితమగుచున్నది. దానిప్రకారము ఝాన్సీరాజుగాని రాణిగాని బ్రిటిషుసర్కారువారి యాజ్ఞ లేనిదే దత్తత చేసికొను నధికారము లేదు.



మహారాజా గంగాధరరావు తన యనంతర మేస్త్రీకి రాజ్యాధికారము నీయ నిశ్చయించెనో యామె యత్యంత యోగ్యురాలు; లోక మంతయు నామెను మిక్కిలి ప్రేమించుచున్నారు. ఆమె రాజకార్య నిర్వహణమునం దన్నివిధముల సమర్థురాలు కాని ప్రస్తుత పరిస్థితులను బట్టి ప్రభుత్వము వారిప్రాంతములను తమవశము చేసికొనుటలో నాలస్యము చేయకూడదనియే నాయభిప్రాయము. అట్టిస్థితిలో సర్కారువారు రాణీకి గంగాధరరావు స్వంత ఆస్తిని, రాజమహాలును ప్రసాదించి, యామె గౌరవమర్యాదలను సంపూర్ణముగా కాపాడుకొనుచు, రాజబంధువులతో కుటుంబయాత్రను సుఖముగా గడుపుటకు నెలకు కొంత పింఛనురూపకముగా నిచ్చుట కంగీకరించి రాణీని సంతోషపరచుట కాజ్ఞ నిప్పింతు రని విశ్వసించుచున్నాను.

రాణీ కెంతఖర్చు కావలెనో నిశ్చయించుటచాల కఠినమైనపని. బుందేల్ఖండులోనున్న అంతిమ మహారాష్ట్రవంశ మిదియే! ఈరాజవంశము నాశ్రయించి జీవింపగోరువా రనేకులుందురు. కనుక మాసమున కయిదువేల రూప్యములు తక్కువకాకుండ రాణీసాహెబు కిప్పించవలెనని సూచించుచున్నాను.

ఝాన్సీరాజ్యము చాలకాలమునుండి మన యధీనములో నుండెను; మేజరు రాస్ దాని నుత్తమస్థితికి దీసికొ

ని వచ్చెను. ప్రభుత్వమువారు దానిని కలుపుకొనుటకు నిశ్చ
యించునెడల దీనినికూడ సింధియాసర్కారుతో సమమైనస్థి
తికి తీసికొనివచ్చుటకు మన కెట్టికష్టములు నుండనేరవు.

సర్కారువారీప్రాంతమును నాయధీనమునం దుంచు
టకు నిశ్చయించుచో నే నందుకు సిద్ధముగనే యున్నాను"
కాని ఏలిసుదొర దీనికి కేవలము వ్యతిరేకముగా వ్రాసి లక్ష్మీ
బాయి నిట్లు సమర్థించెను.

"మనము ఓర్ఛారాజుతో నెట్టిసంధి జేసికొంటిమో అ
ట్టి సంధినే ఝాన్సీరాజుతోకూడ చేసికొంటిమి ఈరెండుసం
ధుల ఆశయములును నొకటియేయై యున్నవి. అట్టిస్థితిలో నొ
కరాజుకు దత్తతాధికార మిచ్చుటయు మరియొకనికి దిరస్క
రించుటయు నుచితము గానేరదు. కోర్టు ఆఫ్ డైరక్టర్లుకూడ
1836 మార్చి 27వ తేదిని గల పత్రములో స్వదేశసంస్థానా
ధీశులు దత్తతచేసికొనుటకు పూర్తియైన హక్కును కలిగి
యున్నారని స్పష్టముగా సూచించియున్నారు. బ్రిటిషు ప్ర
భుత్వమువారు పూర్వము తమకు గావించిన సహాయమునకు
తమచేతనే రాజ్యపదవియం దుంచబడినవారి కిపుడు, యితర
రాజవంశములతో సమానమైన ప్రాచీనత లేదను సాకుచే,
హక్కులను తిరస్కరించుట కోర్టు ఆఫ్ డైరక్టరుల యాజ్ఞలకు
విరుద్ధమనియు, వారి యుదారాశయములను నాశన మొనరిం
చుటే యనియు నాయభిప్రాయము." కాని యీకాగితము



చాలకాలమువరకును బుందేల్ఖండు ఏజంటు రికార్డులోనే పడి
యుండెను. మాల్కము తన రిపోర్టును సర్కారువారి కంపి
ఝాన్సీలో తగిన కట్టుదిట్టములను గావించెను. ఝాన్సీలో
మహారాజా సింధియా సైన్యములోని యారవ పటాలములోని
కొంతభాగమును, బెంగాలు నేటివు ఇన్ఫెంట్రీలోని యొక ప
టాలమును నుంచుటకు నిశ్చయించెను. మరియు ఝాన్సీ, క
రేరా కోటలను రెంటిని కాపాడుటకు మరి నాల్గు పటాల
ముల నేర్పాటు జేసెను. ఝాన్సి దర్బారులోని ప్రజలందరును
దత్తపుత్రునిపేరనే పరిపాలన జరుగవలె ననెడి పూర్ణవిశ్వా
సముతో నుండిరి. మహారాజా గంగాధరరావు జీవించియుం
డగనే పొలిటికలు ఏజంటు సమ్ముఖమందే దత్తవిధానము నం
తను బూర్తిగా నడిపెను; అతడు బ్రిటిషుప్రభుత్వమువారికిలేఖ
నంపి దత్తత నంగీకరింపవలసినదని కూడ ప్రార్థనల నంపుకొ
నెను. ప్రభుత్వమువారు తప్పక దీని నంగీకరింతురనియే య
తని విశ్వాసము; ఏలనన 1817 లో రామచంద్రరావుతో
చేసిన సంధిషరతుల ప్రకారమతడు వంశపరంపరముగా ఝాం
సీరాజ్యము ననుభవించుటకు హక్కు యివ్వబడెను పైగా
ఝాన్సీ చూపిన కృతజ్ఞతయు, బ్రిటిషుసర్కారువారి కనేకస
మయములందు జేసిన సహాయసంపత్తును మరవుకు రాజా
లవు.

చివరకనుకొనినట్లే జరిగెను. డాల్హౌసీప్రభువు ఝాం

సీని లాగుకొనెను. ఈసందర్భములో నింగ్లీషుపార్లమెంటు మెంబరైన టారెన్సు దొర యిట్లు వ్రాయుచున్నాడు.

"The Rajah wrote to the Governor General respectfully commending his youthful choice to his consideration and care, and asking for the recognition of his widow as Regent during the minority. The appealed to the second article of the subsisting treaty, which guaranteed the territory to heirs of his family in perpetual succession, whether heirs by descent, consanguinity or adoption and trusted that "in consideration of the fidelity he had always evinced towards Government, favour might be shown to the child." He was allowed to die in the delusion that native fidelity would be remembered. The Empire has grown so strong that the autocrat of Fort William thought it could afford to forget fidelity."

"మహారాజు తాను దత్తతచేసికొనిన బాలునిపై కృపయుంచవలెననియు, బాలుని తమవశము జేయుచున్నానని యు, నతనిమైనారిటీలో తల్లినే రీజెంటుగా నుంచవలసినదని యు కోరుచు గవర్నరుజనరలుకు వ్రాసెను. అత డప్పు డమలులోనున్న సంధిపత్రములోని రెండవఆర్టికిలును యెత్తిచూపెను. అది ఝాన్సీరాజ్య మతనివంశమునకు పుట్టుకచేతగాని, రక్తస్పర్శగల బాంధవ్యముచేతగాని, దత్తతచేతగాని పరంపర వారసులైన వారికి చెందవలెననియే స్పష్టముగా చెప్పుచున్నది.



మరియు నతడు "తా నెప్పుడును ప్రభుత్వముపట్ల జూపుచుండిన యకుంఠిత విశ్వాసమును దలంచియైనను బాలునిపై యాదరము చూపబడునని విశ్వసించెను." భారతీయులవిశ్వాసము స్మరింపబడు ననెడిభ్రమతో నతడు చనిపోవునట్లు చేసిరి. కాని యాంగ్లసామ్రాజ్యము విలియంకోట నిరంకుశాధికారి యైన గవర్నరుజనరలు విశ్వాసమును మరచిపోజాలునంతటి దృఢతరముగా భారతదేశమం దలముకొనెను;



# మహారాణి ఝాన్సీ లక్ష్మీబాయి

## రెండవ ప్రకరణము.

### ఝాన్సీ పతనము

ఆహా ! కాల మెట్టి విపరీతసంఘటనములను దెచ్చిపెట్టును ! కాలచక్రమా ! నీగతి నెవ్వరు నిరోధింప గలరు? పాదుషాలను ఫకీరులను జేయుటయు ఫకీరులను పాదుషాలను జేయుటయు నీకు దప్ప మరెవ్వరికి జెల్లును? యోగులుజోగులగుటయు జోగులు యోగు లగుటయు నీమహిమయే కదా ! రోమకసామ్రాజ్యమునురూపుమాపితివి! పెరిషియనుసామ్రాజ్యమును పాడుజేసితివి; అస్సీరియాసామ్రాజ్యము నంతమొందించితివి; మరి యెన్నింటినో మంటగలిపితివి ! హైందవసామ్రాజ్యముల నెన్నింటిని నీపొట్టబెట్టుకొనలేదు ! ఇక మిగిలియున్న వానినిమాత్రము నాశము జేయకుండనీవెట్లూరకుండగలవు? రాజ్యకాంక్ష లేనివానికికూడ రాజ్యకాంక్షను గలుగజేయుట నీపనియే కాబోలును ! పాప మాంగ్లేయులు భారతదేశమునకు వచ్చినప్పుడు రాజ్యమును సంపాదింపవలె ననెడి చింతయే వారికి లేదు ! ఈవిషయమునే యింగ్లీషువారు విసుగులేకుండ పదేపదే చాటుచుండుటయుగూడ నాచారమయ్యె



ను ! గవర్నరుజనరలు వారను హేస్టింగ్సు పరిపాలనకాలమున ప్రజలకును భారతదేశమునకును గలిగిన మహానర్థములవిషయమై యింగ్లండులోని పార్లమెంటులోగూడ రాద్ధాంతసిద్ధాంతములు జరిగెను. అప్పుడుగూడ నిట్లు యెలుగెత్తి చాటబడెను. "భారతదేశములో మా రాజ్యమును విస్తరింపజేసికొనుటగాని, అచ్చటి రాజ్యములను, దేశములను మాయధికారము క్రింద తెచ్చుకొనుటగాని బ్రిటిషు రాజనీతికిని, బ్రిటిషుప్రతిష్టకును, బ్రిటిషువారి కోరికకును విరుద్ధములు "అహా ! యెట్టి ధర్మపన్నములను ధేమ్సుతోయము లుద్భవింప జేయగలవు ! ఈధర్మపన్నములను చదివిన కొద్దికాలమునకే కారన్వాలీసు ప్రభువు టిప్పుసుల్తానుపై కురికి యర్ధరాజ్యమును కబళించెను తిరుగ రెండేండ్లు పూర్తికాకమునుపే మిగత యర్ధభాగమును వెల్లస్లీప్రభువు మ్రింగివేసెను. మరికొద్దిరోజులకే కర్నాటక ప్రాంతమును, అయోధ్య నవాబువద్ద లాగుకొనిన ప్రదేశమును ఆంగ్లరాజ్యములో గలిపివేయబడెను ఇట్లు రాజ్యము విస్తరించుటజూచి కోర్టు ఆఫ్ డైరక్టర్లు తమ సంతసమును వెలిబుచ్చియు నల్పకాలములో నింతరాజ్యము వచ్చుటచే సందేహమనస్కులై భారతదేశమున తమ రాజ్యమును వ్యాపింప జేయుటకు దమ కిష్టములేదని మరల ఘోషించిరి. ఆమిషముపై కురికి కన్నీటిధారలను విడుచు నక్రరాజ మింతకన్న నెక్కుడు విచారమును వెలిబుచ్చజాలదు. తోడనే నేపాలయు

ద్ధము జరుపబడెను. బ్రహ్మదేశము, అస్సాము, కూర్గు, సింధు, పంజాబు మొదలగునవన్నియు క్రమశః ఆంగ్లేయుల హస్తగతమయ్యెను. ఇంతలో డాల్హౌసీప్రభువు రంగము నలంకరించి యీ యర్ధకృషివ్యాపారమును సాంతము జేయ కంకణము బూనెను. ఇతఁడొక నూతనశాస్త్రమును కనుగొనెను. సంతానములేకుండ చనిపోవు స్వదేశసంస్థానాధీశుల రాజ్యములకు స్వస్తిచెప్పి వాని నాంగ్లరాజ్యములో కలుపుకొనవలెను; దత్తతాధికారము కోర కేయే స్వదేశసంస్థానములు బ్రిటిషుప్రభుత్వమువారి యనుమతిని బడయవలెనో వానినిగూడ తమరాజ్యములో కలుపుకొనవలెను అని యతని సిద్ధాంతము. డాల్హౌసీప్రభువిట్లు బహిరంగముగా ప్రకటించెను. "మొట్టమొదటనుంచియు మన యధికారములోనున్న ప్రదేశములమధ్య చిన్నసంస్థానము లున్నచో, నాసంస్థానాధీశులు నిస్సంతుగానున్నప్పుడు, మనమా సంస్థానముల నాపోశనము, బట్టి సమయము దొరకినపుడెల్ల మనరాజ్యము నభివృద్ధి జేసుకొనవలెను; ఇట్లు మనప్రభుత్వము నంతకంత కున్నతస్థితికి దేవలెను. ఈ చిన్నచిన్న రాజ్యములవలన మనకు చాలకష్టములు గలవు. ఇది మనరాజ్యమును బలపరచుటలేదు. సరికదా మనకు కంటకముగా నున్నది. దీనిని మనము కలుపుకొన్నచో మన కష్టములన్నియు తొలగిపోవును; మన ధనాగారములు వృద్ధిపొందును; బ్రిటిషుపరిపాలనములోని యఖండ సౌఖ్యమును ప్రజలు పొందగలరు;



ఇది ఆయారాజ్యములకుగూడ సర్వోత్కృష్టదశయనియే నా యభిప్రాయము. సమయము దొరకినపుడెల్లను జేతికి దొరకినంతవరకు రాజ్యములను దిగమ్రింగుచు బ్రిటిష్ప్రభుత్వము నభివృద్ధిపరచుటకు దగిన సదుపాయములు కాటంతటవియే చేకూరినపుడు మన మెన్నడును వానిని జారవిడువగూడదు. స్వదేశసంస్థానముల కేవిధమైన వారసులుగానిలేకపోవుట; ఆసలైనవారసులు లేనప్పుడు, ప్రభుత్వమువారికి తెలియపరచినను, హిందూశాస్త్రానుసారముగ వారు దత్తతచేసికొనుట; అను నీరెండు యవకాశములను మనము పొందియుండి చేపట్టవలెనేగాని యెన్నడును మరచిపోరాదు."

బుందేల్ఖండు ప్రభుత్వాధికారి (Political agent.) మాల్కముదొర తన రిపోర్టును భారత ప్రభుత్వమువారికి పంపిన సమయమందు గవర్నరుజనరలుగా రయోధ్యాప్రాంతములకు వెళ్ళియుండిరి. నాలు గైదు మాసముల కైనను వారివద్దనుండి ప్రత్యుత్తరము రానందున మహారాణి లక్ష్మీబాయి మేజరు ఎలిసుద్వారా నొక యుత్తరమును భారతసర్కారుకు పంపించెను. దాని సారాంశ మిట్లుండెను "ఈ ప్రాంతములో నాంగ్లప్రభుత్వమువారు రాజ్యమును స్థాపించుటకు పూర్వమునుండియు నా మామగారగు శివరావు భావు సర్కారు కెట్లు సహాయము చేయుచున్నదియు ఝాన్సీ చరిత్రనుబట్టి తెలియగలదు ఈసహాయమునకు బదులుగా

ప్రభుత్వమువారు మావంశముపై కృపాదృష్టిని బరపుటచే మాకు సదా కళ్యాణమే జరుగుచువచ్చెను"

"1842 లో నాభర్తయగు మహారాజా గంగాధరరావుతో కలనల్ స్లీమను సంధిచేసుకొనెను; ఆసంధితో 1817లో రామచంద్రరావుతో ప్రభుత్వము చేసికొనిన సంధిషరతులు రద్దుకాలేదు; ఆషరతు లన్నియును బూర్వము ప్రకారమే పాలింపబడునని యును, ఆషరతులవలన ఝాన్సీకి గలుగు లాభము లన్నియును ఝాన్సీరాజ్యమునకు తప్పక కలుగగలవని యును నభయహస్తమిచ్చిరి."

"శివరావుభావుయొక్క సౌజన్యప్రవర్తనను, బ్రిటిషుసర్కారుపట్ల నతనికి గల యచంచలప్రేమను, అతడు చనిపోవునపుడు ఝాన్సీరాజ్యమును రామచంద్రరావు వంశపారంపర్యహక్కులతో ననుభవింపవలెనని ప్రకటించిన యిచ్ఛను స్వీకరించియే ప్రభుత్వమువారు పైన పేర్కొనబడిన సంధి చేసికొనిరి." ఝాన్సీసర్కారువారి ప్రేమయు, విశ్వాసమును దృఢతరమగుటకు గారణము పైన పేర్కొనబడినసంధివలన స్పష్టమగుచున్నది. ఏలనన రామచంద్రరావున్ను, అతని వారసుడును, ప్రస్తుతము సింహాసనముపై నున్నవాడును నగు శివరావుభావుయును వంశపరంపరా రాజ్యమున కధికారులు; అనగా వారిమోక్షప్రాప్తికిని వారివంశము శాశ్వతముగానుండగలందులకును వారు సంతులేక దత్తతచేసికొన్నయెడల దానిని ప్రభుత్వమువారు మంజూరుచేసి రనియే యర్థము."



"హిందూశాస్త్రములు, చనిపోయినతండ్రికి పిండప్రదానములు జేయుటకును శ్రాద్ధాదిక్రియలను జరుపుటకును ఔరసపుత్రునితో సమానాధికారమునే దత్తపుత్రునికిని యిచ్చుచున్నవి. ఈవిధముగా దత్తతచేసికొను నాచారము భారతదేశమంతట ననాదిసిద్ధముగా నేర్పడియున్నది. ఈవిధి ననుసరించియే నాభర్త నవంబరు 16 వ తేదీని దివాను నరసింహారావు, లాలాహేకీమల్లు. లాలాత్రట్టీచందు మొదలగు ననేక సత్పురుషుల సమ్ముఖమున నన్ను పిలచి యిట్లుచెప్పెను. "నా శరీరస్వాస్థ్యము పూర్తిగా చెడిపోయెను; ఎట్టి యౌషధముల వలనను నాకు లాభము కన్పించుట లేదు. కనుక మన సింహాసనము నధిష్ఠించుటకు మన వంశమునకు జెందిన బాలు నెవనినైనను హిందూ శాస్త్రానుసారముగా బెంచుకొన వలెనని నాకు యిచ్ఛ గలదు."

"అప్పుడు నాభర్త రామచంద్రరావుబాబాను పిలచి వానిపుత్రులలో నొకడగు వాసుదేవరావు పుత్రుడైన ఆనందరావను నైదేండ్ల బాలుని దత్తతచేసికొన నిశ్చయించెను. అనంతరము పండితులు, విద్వాంసులు, శాస్త్రజ్ఞులు మొదలగు ననేకమంది యాశీర్వాదములతో దత్తతవిధానము జరిపింపబడెను. మరునాడు ప్రాతఃకాలమున పండిత వినాయకరావు సంకల్పము చెప్పెను. ఆనందరావు తండ్రియైన వాసుదేవరావు యథావిధిగా పుత్రదానము చేసెను. ఈపుత్రునికి దామోదర

రావు గంగాధరరావు అను నూతన నామకరణ మొసంగబడెను; ఇట్లు దత్తవిధి పూర్తిచేయబడెను."

"మహారాజు ఆజ్ఞానుసారము మేజరుఎలిసు, కప్తను మార్టిన్ గార్లకు దత్తహోమసమయమున రాజమహాలు నలంకరింపవలెనను నాహ్వానము పంపబడెను. నవంబరు 16 వ తేదీని వా రిరువురును 10 గంటలకు రాజమహాలుకు వచ్చిరి. ఆ సమయమందు నాభర్త సర్కారు వారికి పంపించిన పిటీషను చదివి వినిపింపబడెను. మేజరుఎలిసు మహారాజు యిచ్ఛానుసారముగా సమస్త విషయములను సర్కారుకు తెలియజేసెదనని వాగ్దానము చేసెను."

"నవంబరు 21 వ తేదీ సోమవారమునాడు నాభర్త మరణించెను. అతని పితృక్రియల నన్నిటిని దామోదరరావు గంగాధరరావే జరిపెను."

"ఈబాలుని నాభర్త బ్రిటిషుప్రభుత్వమువారి కృపాదృష్టికే యధీనము చేసెను. అతని రక్షణయును, పాలనాభారమును ప్రభుత్వముపైననే కలవు. నేను సర్కారువారి నిట్లు కడసారి ప్రార్థించుచున్నాను. సర్కారువా రేప్రకారము దతియా, ఓర్చా, జాలౌను రాజులు చేసికొనిన దత్తతల నన్నిటి నంగీకరించిరో ఆప్రకారమే యీదత్తతనుగూడ నంగీకరింప వేడుచున్నాను. ఝాన్సీ సంధిపత్రములలో "హమేశా "సదా" యను శబ్దము ప్రయోగింపబడెను. ఈశబ్దము పై



నుదహరింపబడిన రాజుల సంధిపత్రములలో లేనేలేదు. కనుక దత్తత చేసికొనుటకు వారందరికన్నను మాకే యెక్కువ యధికారము గలదు." ఈయుత్తరము గవర్నరుజనరలు గారికి పంపబడెను. 1854 లో డాల్హౌసీ కలకత్తాకు తిరిగి వచ్చెను; ఝాన్సీని గురించి వాదప్రతివాదములు జరిగెను; సర్కారువారి పరరాజ్యసంబంధములను చర్చించు (Foreign minister) మంత్రియైన గ్రాంటుదొర ఝాన్సీని గురించి యొక సంక్షిప్తచరిత్రను తయారు చేయించెను. ఇందులో ఝాన్సీ ప్రాచీనతను, ఝాన్సీ బ్రిటిషు ప్రభుత్వములకు గల సంబంధమును సూచించుచు ఝాన్సీరాజ్యమును బ్రిటిషురాజ్యములో గలిపివేయవలెనని నిర్భయముగా, నిర్మొగమాటముగ సమర్థింపబడెను

ఇట్లొకమూల కలకత్తాలో డాల్హౌసీ ప్రభుప్రసభలో ఝాన్సీవిచ్ఛేదనమునకు తంత్రము నడుపబడుచుండ మరియొకవంక ఝాన్సీరాజమహాలులోనివా రందరును రేయింబవళ్ళు దత్తపుత్రునిభావిదశ యేమి కానున్నదో, ముందేమి రానున్నదో యని విచారించుచుండిరి. మరల 1854 లో 16 వ ఫిబ్రివరి తేదీని మరియొక యుత్తరము ప్రభుత్వమువారి కంపబడెను. ఈసారి మాల్కమును యీయుత్తరముతో బాటొక యుత్తరము వ్రాసి ప్రభుత్వమువారికి 27 ఫిబ్రివరి తేదీని బంపించెను ఈసారి యతడు ఝాన్సీరాణీని సమర్థించుచు వ్రాసెను. కొద్ది

రోజుల క్రిందమే ఝాన్సీకి వ్యతిరేకముగా వ్రాసిన మాల్కాము మరల యిట్లు వ్రాయుట ఆశ్చర్యకరమైన విషయము. కాని ఏమిలాభము! పంటలు యెండిపోయెను! వర్షము వర్షించెను! అను సామెత ప్రకార మిది 'చావు తెలివి' యయ్యెను అతడు మొట్టమొదటనే యిట్లు వ్రాసినచో వ్యవహారము శృతిమించకుండ నుండెడిది. ఫిబ్రవరి 23 వ తేదీ మాల్కాముయొక్క యుత్తరము కలకత్తా పంపబడెను 27 వ తేదీని కలకత్తానుండి ఝాన్సీరాజ్యము నూడబెరుకవలెనను హుకుం జారీ చేయబడెను.

లక్ష్మీబాయికి గొంత ధైర్యము చేకూరెను; ఈసారి తనకు దప్పక న్యాయము జరుగుననియే యామె యెంచెను. ఆశయే మానవుని పాలిటి కల్పవృక్షముకదా! చివర కీకల్పవృక్ష మామెకు విషవృక్ష మయ్యెను! తా నొకటి దలచిన దైవము మరియొకటి తలచెను! వెంటనే మేజరుమాల్కాము ఏలిసుదొర కిట్లు యిస్తిహారను జారీ చేసెను. "1853 నవంబరు 21 వ తేదీని మహారాజా గంగాధరరావు చనిపోయెను; అతను మరణించుటకు పూర్వమే యొకబాలుని దత్తత చేసికొనెను. కాని దానిని శ్రీమాన్ గవర్నరు జనరలుగారు మంజూరు చేయలేదు. కనుక భారత ప్రభుత్వమువారి 1854 మార్చి 2 వ తేదీనాటి యాజ్ఞానుసారము ఝాన్సీరాజ్యము బ్రిటిషురాజ్యములో కలపివేయబడెను. ఇందుమూలముగా



సమస్తప్రజలకును తెలియజేయుడ మేమనగా నిప్పుడు ఝాన్సీప్రాంత మంతయు బుందేల్ఖండు ప్రభుత్వాధికారియైన మేజరు ఏలిసు అధీనము చేయబడెను. ఝాన్సీప్రాంతప్రజలందరు నిప్పుడు తాము బ్రిటిషుప్రభుత్వాధికారముక్రింద నున్నట్లు తెలిసికొని మేజరు ఏలిసుకు కప్పము కట్టుచు సంతోషసౌఖ్యముల ననుభవింతురుగాక!" ఈదుర్వార్త మహారాణి లక్ష్మీబాయి చెవిని బడుటతోడనే యామె దుఃఖాక్రాంతయై మొదలువిరిగిన చెట్టువలె నేల గూలెను; మేజరు ఏలిసు లక్ష్మీబాయి నూరడించుటకు బ్రయత్నించి "పొలిటికలు యేజంటు ఆజ్ఞానుసారముగా మీ కుచిత సన్మానము జరుగగలదు; మీధర్మనిర్వాహణమునందు మీపట్ల యుదారభావముతోనే ప్రవర్తించెదము" అనువాక్యములను నుడివి వెడలిపోయెను.

పుత్రశోకము; భర్తృవియోగము; రాజ్యనాశనము; శత్రువే మిత్రునివలె బుజ్జగింప బ్రయత్నించుట! ఆహా! లక్ష్మీబాయి కెన్నికష్టములు దాపరించెను! ఇకముం దెట్టి తుపానులు సంభవింపనున్నవో యెవ రెరుంగుదురు! లక్ష్మీబాయి కొంతసేపటికి తెలివిదెచ్చుకొని తలపంకించుచు, శోకాకులమగ్నమానసయై "కానిండు! యేమివచ్చినను వచ్చుగాక! నేను నాఝాన్సీ నిచ్చుదానను గాను" అని దృఢనిశ్చయముతో బలికెను.

ఝాన్సీరాజ్య మిట్లు మిగిలిగివేయబడెను; బ్రిటిషుప్రభుత్వమువారు రాణీలక్ష్మీబాయి కీక్రిందియేర్పాటులను గావింపవలెనని మాల్కము సూచించెను.

మహారాణి లక్ష్మీబాయికి ఝాన్సీ ఖజానానుండి గాని యామెకోరునట్టి మరెచ్చటనుంచిగాని నెలకు 5000 రూప్యముల చొప్పున నామె జీవించియున్నంతకాల మియ్యవలెను.

2 ఝాన్సీలోని రాజమహాలును మహారాణి లక్ష్మీబాయి నివసించుట కిచ్చివేయవలెను; దానిపై యామెయే ప్రభ్విగా నంగీకరింపబడును.

3 మహారాణి లక్ష్మీబాయి జీవించియున్నంతకాల మామెపై గాని యామెనౌకర్లపైగాని బ్రిటిషుసర్కారువారి కెట్టి అధికారమును లేదు.

మహారాజా గంగాధరరావు యిచ్చానుసారముగా నతని నిజధనములో ఝాన్సీరాజ్యమునకు రావలసిన బాకీ సాకీలు పోను మిగిలినదియు, సమస్తజవాహిరీ (Jewelry) యు లక్ష్మీబాయికే యిచ్చివేయబడును.

పైన వివరింపబడ్డ సూచనల నన్నింటిని డాల్ హౌసీ ప్రభువు స్వీకరించెను. కాని గంగాధరరావు నిజసంపత్తినిగూర్చియు, రాజ్యములోనున్న జవ్హారీనిగురించియు నిట్లు తీర్పు చెప్పెను. "గంగాధరరావు దత్తపుత్రునకు రాజ్యాధికారము లేకపోయినను అతని నిజసంపత్తికిని, రాజ్యములోని



జవాహిరీకిని అతడే యధికారి యగుచున్నాడు. కనుక నీసంపత్తు మహారాణి లక్ష్మీబాయి కివ్వబడదు."

ఈయాజ్ఞల ననుసరించి ఝాన్సీ పొలిటికల్ యేజంటు ఝాన్సీ ఖజానానుంచి ఆరులక్షలరూప్యములను తీసి దామోదరరావుపేర ఇంగ్లీషువారి ఖజానాలో జమకట్టించెను. దామోదరరావు మేజరు ఆగుటతోడనే యీద్రవ్య మతనికి వడ్డీతోసహా యిచ్చివేయబడును: ఝాన్సీరాజ్యములోని సమస్తజవాహిరీయును, వెండి, బంగారు నగలును "దామోదరరావు కొరకు లక్ష్మీబాయి యధీనమం దుంచబడును."

రాజ్యమే పోయినపుడు రాజ్యవైభవము మిగులుట దుర్లభముకదా! చంద్రుడే లేనపుడు చంద్రికళ యెట్లుండును! రాజారామచంద్రరావు అనంతరమునుంచియు ఝాన్సీరాజులందరును కోటలోనే నివసించుచుండిరి. ఇప్పుడు పొలిటికలు యేజెంటు ఆజ్ఞచే మహారాణి లక్ష్మీబాయి పురాతనఝాన్సీ కోటను విడిచి పట్టణములోని రాజమహాలులో నివసింపవలసి వచ్చెను! హతవిధీ! నిన్నుదూరిన లాభమేమి? నీవెంతచేయదలచితివో చేయుము, చూచెదముగాక! అనినట్లు లక్ష్మీబాయి కష్టములను దిగమ్రింగుచుండెను. బ్రిటిషుగొడ్డలి తన పనిని ప్రారంభించెను! ఇంగ్లీషు వారు ఝాన్సీసైన్యము నూడజెరికి యాంగ్లసైనికులను నియమించిరి; బంగాళాదేశపు కాల్బలములోని 12 వ పటాలమును కోటను రక్షించుటకు

నియమించిరి; అవసరమునుబట్టి యితరసహాయములకు గూడ నేర్పాట్లుచేయబడెను. అనేక శతాబ్దములనుండియు ఝాన్సీ కోటలో సేకరింపబడిన యుద్ధసామగ్రి యంతయు నాశముగావింపబడెను. పీష్వాకాలము నాటి గొప్పగొప్ప మరఫిరంగు లన్నియు నిరుపయోగము చేయబడెను. అనేక పురుషాంతరములనుండి ఝాన్సీరాజ్యమును సేవించుచున్న యోధగణము జీతములను దీసికొని ఝాన్సీకోటను విడిపోవునాడు "ఆహా! తల్లీ! ఝాన్సీ! నీకెంత గతిపట్టెను." అని భోరున యేడ్చుచు దమతమ యిండ్లకు బోయిరి.

ఇంత జరిగినను, మేజరుస్కీనును ఝాన్సీరాజ్యమునకు కమిషనరుగా నియమించినను గూడ ఝాన్సీ లక్ష్మీబాయి శ్వేతజాతివారు సత్యప్రియు లనియు, నీతివంతు లనియు, దన కింకను న్యాయము కలుగగల దనియు విశ్వసించుచుండుటచే నుమేషచంద్రబెనర్జీ యను నొక బంగాళాదేశపు వకీలును, మరియొక యూరపియనును 60,000రూప్యము లిచ్చి లండనునగరమునకు బంపి కోర్టు ఆఫ్ డైరక్టర్లకు దనసమస్యను నివేదింప నియోగించెను. వీరచ్చటకు బోయి యేమి చేసిరో యిసుమంతయు నేటివరకును వెల్లడి కాలేదు. చివరకు కోర్టు ఆఫ్ డైరక్టర్లుకూడ ఝాన్సీ రాజ్యమును దిగమ్రింగుట కంగీకరించిరి. అంతటితో బ్రిటిషు న్యాయము పూర్తియయ్యెను.



ఇక లక్ష్మీబాయి విచారమును వర్ణింప తరముగాదు. 'ఇదం బ్రాహ్మ్య మిదం క్షాత్రం' అను నార్యోక్తి ననుసరించి యీమె బ్రాహ్మణతేజమునే గాక క్షాత్రతేజమునుగూడ చిరుతప్రాయమునుండియు నలవర్చుకొనిన ట్లిదివరకే చూచి యుంటిమి. స్వరాజ్యసంపాదనాభిలాష యీమె హృదంతరాళమున రేయింబవళ్లు జాజ్వల్యమానముగా ప్రజ్వలించుచునే యుండెను. విమల, రాణీసంయుక్త, రుద్రమాదిదేవుల చరిత్రలామె కనుసన్నల మెలగుచునే యుండెను. భర్తృవిహీనయై, నిస్సహాయయై, నిరాయుధ గావింపబడిన పదునెనిమిదేండ్ల బ్రాహ్మణబాలిక యెక్కడ! సార్వభౌములను, సామ్రాజ్యములను నొకటొకటిగా స్వాహాచేయుచున్న బ్రిటిషుప్రభుత్వ మెచ్చట! లక్ష్మీబాయి బుద్ధి కుశాగ్రబుద్ధి; ఆమె యీవిషయముల నన్నిటిని గ్రహించి పొంగి పొంగి వచ్చుచున్న క్షాత్రము నాపుకొని క్షాత్రమా! సమయము వచ్చువరకు విశ్రమింపుము అని బుజ్జగించి ప్రస్తుతము, బ్రాహ్మణధర్మమునే పూనెను. ఆమె యనుదినము ప్రాతఃకాలముననే బ్రాహ్మీముహూర్తమందు మేల్కాంచి నాలుగుగంటలకే స్నానాదికములను గావించుకొని యెనిమిదిగంటలవరకును పూజాగృహమున పూజలు సల్పి రాజమందిరమును జేరి కొంతసేపు గుఱ్ఱపుస్వారీ చేయును. 11 గంటలకు తిరిగి స్నానము చేసి దానధర్మములను గావించుకొని

భోజనము చేయును. తరువాత కొంతసేపు విశ్రమించి మూడుగంటలవరకును రామకోటి వ్రాసికొనుచు రొట్టెకొరకు గోధుమపిండి యుండలు చేసికొనుచుండును. రాత్రి యెనిమిది గంటలవరకును పురాణాదికములను వినుచుండును. ఈకాలమందే ఆమె యితరులతో మాట్లాడవలసిన విషయములను మాట్లాడును. పురాణము పూర్తి యగుటతోడనే మూడవసారి స్నానముచేసి తన యిష్టదేవతాప్రార్థనను సలిపి ప్రసాదమును స్వీకరించును. తరువాత నామె శయనించును. ఇట్లామే యీకాలమందసిధారావ్రతచర్యను జరుపుచుండెను! రాజ్యవైభవమును, సమస్త రాజ్యభోగములను త్యజించి వైరాగ్యవృత్తిని స్వీకరించి, కేవల మీశ్వరారాధనయందే మునిగియుండి సనాతన హిందూధర్మానుసారముగా పూజాపునస్కారములతోను పురాణపఠనములతోను కాలము బుచ్చుచుండెను. ఇట్టిస్థితిలో లక్ష్మీబాయి తన దత్తపుత్రుడైన దామోదరరావు కుపనయనము జేయవలసివచ్చెను. కాని దామోదరరావు పేరనున్న ఆరులక్షలరూపాయిలును ప్రభుత్వఖజానాలోనే జమకట్టబడెను. అందులో నొకలక్షరూపాయిలను ఖర్చులకొరకిమ్మని రాణి కోరెను. కాని ప్రభుత్వమువారు దామోదరరావు పెద్దవాడైన తరువాత తమపై దావా తెచ్చుననియు నలుగురు పెద్దమనుష్యులను జామీ నిచ్చినగాని ధనము నీయజాలమనియు జవాబు చెప్పిరి



స్వాతంత్ర్యలక్ష్మిచే బరివేష్టింపబడి సదా యామెకైవారముల నొందుచుండిన లక్ష్మి కాపలుకులు ములుకులవలె నాటి క్రోధాంభఃకణజాలములు నేల వ్రాలెను. ఆమె చివర కల్లై చేసి యాధనముతో దామోదరరావు కుపనయనము గావించెను.

# మహారాణి ఝాన్సీ లక్ష్మీబాయి



## మూ డ వ ప్ర క ర ణ ము.



### విప్లవము

ఝాన్సీరాజ్య మాంగ్లేయుల హస్తగతమైన తరువాత రెండువత్సరములు గడచెను. లక్ష్మీబాయి వైరాగ్యవృత్తిని దిన మొక యుగముగ కాలము గడపుచుండెను. డాల్హౌసీ రాజ్యములను గలుపుకొనుటకు కాలము చాలక పరితపించుచుండెను. ఇంతలో నతడు హిందూదేశమును వీడి 1856 లో నింగ్లండు వెడలి పోయెను. కానింగు ప్రభువు గవర్నరుజనరలుగా వచ్చెను. డాల్హౌసీప్రభువు రాజనీతిచే దేశమట్టుడికిన ట్లుడికిపోవుచున్న దనుసంగతి నతడు కనిపెట్టెను. ఈ యగ్నిపర్వత మెప్పుడో విజృంభింపక మానదని యతడు గ్రహించియే భారతవర్షమునకు పయనమగుచు నిట్లు ప్రకటించెను. "నా శాసనకాలములో భారతవర్షమున సంపూర్ణశాంతి ప్రబలునుగాక యని నే నభిలషించుచున్నాను. భారతరాజకీయాకాశమండలమున నొక చిన్న మేఘుగంభీరధ్వని ప్రారంభించి యది వాయువేగమున నాకాశ మంతట నల్దిశల నొక్కమ్మడి వ్యాపించి నిరంతర ధారా ప్రవాహముగా వర్షించి



మనలను ముంచివేయు నని నే నెరుంగుదును." చివర కిదియే యథార్థ మయ్యెను.

1857 వ వత్సరము ప్రారంభించెను. భారతదేశరాజలోకమున రాజుచున్న యసంతోషాగ్నికి వాయుదేవుడు కూడ సహాయ మయ్యెను. సిపాయిలలో నొకచర్చ ప్రారంభమయ్యెను. వారు నోటితో కొరకవలసిన తూటాలకు ఆవు, పంది కొవ్వులు పూయబడెను; హిందువైనను మహమ్మదీయుడైనను సరే వీనిని నోటితో గొరకవలెను. అనగా "జాతిభ్రష్టుడు, మతభ్రష్టుడు. ధర్మభ్రష్టుడు, కావలెను;" అను నాందోళన వారిలో బయలుదేరెను. విప్లవమున కసలుకారణము కానింగుప్రభువే సూచించెను. బలవంతముగా నాంగ్లప్రభుత్వములో గలిపివేయబడిన స్వదేశ సంస్థానాధిపతులందరును మొదటినుండియు ప్రభుత్వముపై కారములు మిరియములు, నూరుచు హుంకరించుచు గాలముకొరకు వేచియుండిరి. ఇప్పుడు ప్రభుత్వ సేనలలో నున్న హిందూమహమ్మదీయ సిపాయులకే ధర్మచ్యుతి సంభవించెను; దీనిచే వారి మనస్సులు క్షోభించెను; వెంటనే విప్లవము బయలుదేరెను.

మొట్టమొదట బంగాళాదేశములోని బర్హాంపూరు పటాలము తిరుగబడి త్రోవ చూపెను. ఈవృత్తాంతము దేశమంతటను క్షణికములో పాకిపోయెను. విప్లవ మంతకంత ప్రజ్వలించి మీరటు, ఢిల్లీ, కాన్పూరు, కాశీ, అల్హాబాదు,

మొదలగున వన్నియు విప్లవకణముల నందుకొనెను. ఢిల్లీలోని యంతిమబాదుషా తిరుగ సింహాసనాసీనుడై తన సంపూర్ణాధికారమును చలాయించుచుండెను. ఫిరోజపూరు, బరేలీ, మురాదాబాదు, శాహజహాన్పూరు, లక్నో మొదలగు ననేక పట్టణములలో విప్లవము ప్రారంభమయ్యెను. బ్రిటిషు ప్రభుత్వమువారిచే రాజ్యభ్రష్టులు గాబడి శోకాకులమానసులై యున్న నానాసాహేబు, అయోధ్యనవాబు మొదలగు రాజవంశములవా రందరు నీవిప్లవకారులలో గలసిపోయి స్వరాజ్యయుద్ధమును బ్రకటించిరి.

ఈవిప్లవవార్త ఝాన్సీకి చేరెను. అచ్చట బంగాళాదేశీయుల కాల్బలము 12 వ పటాలమును, 14 వ గుఱ్ఱపు దళమును, ఒక మరఫిరంగిశాలయు నుండెను. ఈసేనలకు ముఖ్యాధికారి కప్తాను డన్లపుదొర. అతని సిపాయి లెన్నడును విప్లవములో జేరరనియే యతడు విశ్వసించుచుండెను. 18 వ మె తేదీవరకు నచ్చట విప్లవచిహ్నము లేవియును కానరాలేదు. కమిషనరుస్కీనుకూడ ప్రభుత్వమువారి కిట్లు తెలియజేసెను. "ఝాన్సీలో యుపద్రవము సంభవించుట కింతవరకు నెట్టి కారణములును గానరావు; ఇక్కడి సైనికులు చాల వినయవిధేయతలు కలవారు; వారు ఢిల్లీ, మీరటులలో జరిపించిన విప్లవసైన్యముల నసహ్యించుకొనుచున్నారు; ఇచ్చటి చిన్న చిన్న స్వదేశసంస్థానములవలన గూడ మన కెట్టి భయ



మును లేదు. ఓర్చా, ఛత్రపూరు, అజయఘురురాజు లందరును మైనరులు; దక్కిన రాజ్యములలో మనము తగిన కట్టుదిట్టములను చేసికొంటిమి, కనుక నిక్కడ మేము సురక్షితముగ నుందుమనియే నావిశ్వాసము; నే నిచ్చటి ప్రజలయందు దృఢనమ్మకము గలిగియున్నాను." అతడు మరల మె 30 వ తేదీని, జూన్ 3 వ తేదీని కూడ నిట్లే వ్రాసెను.

ప్రభుత్వమువా రెన్నికండ్లతో జూచుకొనుచున్నను జూన్ 4 వ తేదీని ఝాన్సీలో విప్లవము ప్రారంభమయ్యెను. 7 వ పటాలములోని గురుబక్షు అనునొక హవల్దారు కొంతమంది సిపాయీలను దీసికొని స్టారుఫోర్టులో బ్రవేశించి తుపాకులు, ఫిరంగులు, మందుగుండుసామాను మొదలగు యుద్ధసామగ్రి నంతను దీసికొని విప్లవజెండాను లేవనెత్తెను. కప్తాను డన్లపు యీవార్త విని మిగిలిన సేనను తీసికొని కోటను పట్టుకొనవలెనని నిశ్చయించెను, కాని కోటలోని యుద్ధసామగ్రినంతను, ఖజానాలోని ధనము నంతను విప్లవకారులు మొట్టమొదటనే జాగ్రత్త పెట్టుకొనిరి; కోటను రక్షించు పహరా యంతయు విప్లవకారులలో గలసిపోయెను. ఈ భయానక చిహ్నములను జూచి ఆంగ్లేయు లందరును డేరాలను వీడి పట్టణములోనికి బోయిరి; అక్కడనుండి కమిషనరు ఆజ్ఞప్రకారము వారందరును బిన్నపాపలతో కోటలోనికి ప్రాణరక్షణార్థమై వెడలిరి. డన్లపుదొర తమసహాయార్థమై

కొంతసైన్యమును పంపమని నోగాఁవులోనున్న సైన్యాధికారి కొక యుత్తరము వ్రాసెను. మరునాడు కప్తనుస్కీను గార్డనులు డన్లవుతో రహస్యసంభాషణలను సలిపి కోటలోనికి బోయిరి. డన్లవు జైలరునుగూడ వెంటబెట్టుకొని మిలిటరీకవాతు చేయు స్థలమునకు వెళ్ళెను. వారక్కడ చేరినతోడనే పన్నెండవ పటాలపు సిపాయిలు వారిద్దరను గుండ్లతో పేల్చివేసిరి. ఝాఁసీ సైన్యాధికారి నిట్లు చంపివేసి విప్లవకారులు మఱికొంతమంది ఆంగ్లేయులనుగూడ చావమోదిరి.

ఆంగ్లాధికారులందరును తమ ప్రాణములను దక్కించుకొనుటకు కోటలో దాగొనియుండిరి; వీరు సుమారు 50 మందివరకు నుండిరి. కమిషనరు స్కీను వీరందరును తుపాకులు, గుండ్లు, మందు మొదలైనవానిని సరఫరాచేసి తమప్రాణములను రక్షించుకొనుటకు తయారుచేసెను. కోటతలుపులను కట్టుదిట్టముగా మూసివేసిరి. విప్లవకారులు ఝాఁసీలోని దొరలుండుబసలను విధ్వంసముచేసి కోటమీదికి వచ్చిరి; కోటలోనివారు విప్లవకారుల నాటంకపరుచుటకు ప్రబలప్రయత్నములను జేసిరి. కాని విప్లవకారుల బలము హెచ్చుగానుండెను; వారితో పోరుట నిరుపయోగమని గ్రహించి మహారాణి లక్ష్మీబాయి సహాయమును కోరుట కిద్దరు దొరలు పంపబడిరి; కాని వారు దారిలో విప్లవకారుల చేతులలో బడిరి.



కమిషనరు స్కీను నాగోదు, గ్వాలియరు మొదలగుస్థలములకు సహాయముకొరకు వ్రాసెను. కాని యెచ్చటనుండియు సహాయము రాదయ్యెను! విప్లవకారులు కోటపైకురుకుటకు సిద్ధముగా నుండిరి; లోపలివారుకూడ రక్షణ కెన్నియో ప్రయత్నములను జేయుచుండిరి. లోపలికి బోవుట అసాధ్యముగ నుండెను; విప్లవకారులు గుప్తమార్గములద్వారమున లోనికి బోవలెనని చూచుచుండిరి. చివరకు గుప్తమార్గమును దెలిసికొని వారు లోపలకు బ్రవేశించిరి; విప్లవకారులు శూరత్వముతో యుద్ధము చేయుచు కోటను సమీపించుచుండిరి; కాని యింకను కోటతలుపులను పగులకొట్టుటకు సాధ్యము కాకయుండెను. గార్డనుసాహేబు లోపలినుండి కిటికీలగుండ విప్లవకారులపై గుండ్లవర్షమును గురిపించుచుండెను. చివర కొక విప్లవకారుడు గార్డనుపై గురిపెట్టి యతనిని గూల్చెను. దానితో కోటలో హాహాకారములు బయలుదేరెను. కోటలోనివారందరును హతాశులై చిందరవందర కాజొచ్చిరి. ఇంతలో వారివద్దనున్న ఆయుధసామగ్రియు మందుగుండుసామానును అంతమయ్యెను; విప్లవకారులలో ముఖ్యుడగు అహ్మదుహుస్సేను విజృంభించి కోటలో చాలభాగమును దనవశము జేసికొనెను. ఆంగ్లేయు లపుడు నిస్సహాయులై సంధిప్రయత్నములను జేసిరి.

జూన్ 7 వ తేదీ యుదయమున అహ్మదుసేను కోటగు

మ్మదువద్దకు వచ్చెను. అతడు తన ప్రతినిధియైన సులేమహమ్మదు అనునొక హకీమును పంపగా స్కీనుసాహేబుకోటతలుపును దెరచి బయటకు వచ్చి "మాకెట్టిదుఃఖమును కలుగజేయకుండ మమ్ముసాగరునకు పోనిండు" అని ప్రార్థించెను. హకీము సులేమహమ్మదు దాని కొప్పుకొని "మీరు సమస్త ఆయుధములను విడిచిపెట్టి, కోటను ఖాళీచేసి బయటకు వచ్చుచో మీకు మేమెట్టి యపకారమును గలుగజేయము." అని ఖురానుతో ప్రమాణము జేసెనట! ఆంగ్లేయులు విప్లవకారుల ప్రతినిధి చెప్పిమాటలను సత్యమని నమ్మి నిరాయుధులై కోటను విడిచి పైకివచ్చిరి. కాని విప్లవకారులుతమవాగ్దానములను గాలి కెగురగొట్టి ఘోరపాతకమున కొడిగట్టిరి; నిరాయుధులైన ఆంగ్లేయులను ఖయిదుచేసిపట్టణమంతయు త్రిప్పిరి. ఇంతలో నొక యాశ్వికుడు వచ్చి రిసాల్దారు ఆజ్ఞప్రకారము వారిని చంపివేయవలెనను సందేశము తెచ్చెను! చివరకాంగ్లేయులు భయపడినట్లే జరిగెను. విప్లవకారులు ప్రతిజ్ఞాభంగమునకు వెరువక వారినందరను వరుసగా చంపివేసిరి.

మహారాణి లక్ష్మీబాయి బ్రాహ్మణధర్మమును బూని దినములను గడపుచున్న సంగతి మన మిదివరకే వినియున్నాము. కాని యీ విషమపరిస్థితులం దామె యేమి చేసెను? ఎట్లుప్రవర్తించెను? ఈవిప్లవములో నామెకు సంబంధ మేమి కలదు? ఝాన్సీలో జరిగిన హత్యల నామె యామోదించెనా? బ్రిటిషుప్రభుత్వముపట్ల నామె యెట్లు ప్రవర్తించెను? అను విషయములే యామె చరిత్రకంతకును ప్రధానాంశములు; శిరోభూషణములు. ఆమె బ్రాహ్మణధర్మమును బూనినను స్వరాజ్య, స్వధర్మాభిలాషను వీడలేదు. కాని యెట్టి రాజకీయదృష్టి గాని లేక జేరిన విప్లవకారుల మూకవలె నామె యెట్లు ప్రవర్తింపగలదు? దూరదృష్టి కామె పెట్టినది పేరు! ఆమె జన్మతః వీరవనిత; శౌర్యరాశి ప్రతాపశాలి; ఇన్నియున్నను రాజనీతి నెరుగనిచో నివి రాణింపజాలవు. కార్యసాధనల నెరుగనిచో కార్యము లెట్లు సఫలము కాగలవు? ఆమె నీతివిశారదత్వ మిచ్చటనే కాన్పించుచున్నది. చుట్టును విప్లవకారు లలముకొని యున్నను నామె చలింపలేదు. వివేకమును వీడలేదు; ఆమె ఆత్మనిగ్రహమును బూనియుండెను; రాజ్యతంత్రోపాయములగు సామ, దాన, భేద, దండోపాయములను చతురోపాయములును నామెకు క్రొత్తవి కావు. కనుక నామె పరిస్థితుల నవలోకించుచు నావంతయు తొట్రుపడక చేతనైనంతవరకు ప్రభుత్వము వారికే సహాయము చేయుచుండెను.

ఆంగ్ల చరిత్రకారు లీమెవిషయమై యీసందర్భమున వ్రాసినవ్రాత లసత్యములు; అసందర్భములు; ప్రమాణరహితములు; నిందాభూయిష్టములు. ఆమెను గురించి మాంటుగామెరీమార్టిను మహారాణి లక్ష్మీబాయి విగ్రహారాధకురా

లు; అపరాధులను క్షమించుట యనునది ఆమెధర్మమం దెచ్చటను చెప్పబడలేదు. ఉత్తరాధికార, దత్తతవిషయములలో హిందూశాస్త్రములను మంటగలిపి ప్రభుత్వమువారు తన కపకారముజేసిరని యామె విశ్వసించి విచారగ్రస్తురాలై స్త్రీపురుషమర్యాదను విడిచి, వయస్సును మరచి సార్వభౌమప్రభుత్వముతో ఘోరయుద్ధమునకు దలపడెను. ఈకార్యములో నామె తనప్రాణములను గూడ గోల్పోవుట తథ్యమను విషయము నెరుంగకపోలేదు." అని The Indian Empire అను గ్రంథములో వ్రాసి యున్నాడు. ఇట్టి యసత్యవ్రాతల నాంగ్లచరిత్రకారులుకూడ గ్రహించుచున్నారని యత డెరుగకున్నాడు! మేలిసను "సిపాయిచరిత్ర" అను గ్రంథములో నిట్లు వ్రాసెను. "బ్రిటిషుప్రభుత్వమువా రామె క్రోధమును వాదప్రతివాదములను ఉదాసీనతతో నిర్లక్ష్యము చేసిరి. వారింతకన్నను పాడుపనికూడ చేసిరి; వారు 'గోరుచుట్టుమీద రోకలిపోటును' గూడ వేసిరి. రాజ్యమును కలుపుకొనిన తరువాత నారామెకు సంవత్సరమున కారువేలపౌనులు (90000 రూపాయలు) పింఛను నిచ్చుట కంగీకరించిరి. ఆమె మొదట దీనిని నిరాకరించి తరువాత స్వీకరించెను. అసలే తృపితమని యామె భావించుచున్న పింఛనునుండి యామె భర్త చేసిన ఋణములను తీర్చవలసినదని ప్రభుత్వమువారు చెప్పినప్పు డామెకోపమువలవిగాకుండ నుండెను. ఈయన్నికారణ



ములచేత నామె విప్లవకారులకు స్వాగత మిచ్చెను.,, ఈ విషయములందు సత్య మావంతయు లేదు. కుంభికుంభవిచ్ఛేదనయోగ్యంబు లగు నఖాంబులు గల కేసరకిశోర మాకొన్నను ఘాసంబు గ్రాసంబు సేయునే! సామ్రాజ్యముల నేలగలతల్లి యొరులపంచల నూడిగముల కొర్వనేర్చునా? లక్ష్మీబాయి యెన్నడును ప్రభుత్వమువారినుండి పింఛను తీసికొనలేదు మహారాజా గంగాధరరావు కొక్కసైసయైనను ఋణములేదు. లక్ష్మీబాయి ప్రభుత్వమువారితో యుద్ధముచేయుటకు ప్రభుత్వమువారే కారకులని మున్ముందు తెలియగలదు. అనేక సంకటపరిస్థితులలో లక్ష్మీబాయి ప్రభుత్వమువారికే సహాయము చేసెను ఝాన్సీ కమిషనరు రిపోర్టు మన కిట్టి సాక్ష్యము నే యిచ్చుచున్నది. ఝాన్సీలో విప్లవచిహ్నములు బయలుదేరుటతోడనే కప్తనుగార్డను మరికొందరిని తీసికొని ఝాన్సీ రాజమహలుకు బోయి మహారాణి నిట్లు ప్రార్థించెను, "మాకు ముందేదైన నాపద వచ్చుచో మీరు సహాయము చేయగోరుచున్నాను; ఝాన్సీ ప్రజలను సురక్షితముగా నుంచుటకు మాకు చేయూత నొసంగవలెను." శరణాగతులను రక్షించుటేకదా ఆర్యరాజనీతి! లక్ష్మీబాయి యీ ధర్మమును తలంచి యిట్లు బదులుచెప్పెను. "ఇప్పుడు నాయొద్ద నస్త్రములు గాని, శస్త్రములుగాని లేవు; యుద్ధవిశారదులగు శూరులును, వీరపురుషులును లేరు. అయినను నేను మీ కెం

తవరకు సహాయము చేయగలనో అంతవరకును జేయుటకు నా కెట్టియభ్యంతరమును లేదు.” ఈ వాగ్దానమునకు మెచ్చి ఆంగ్లాధికారు లామె కొంతమంది నూతనశస్త్రధారుల నుంచుకొనుట కంగీకరించిరి మరునాడు గార్డను మరల నొంటరిగా రాజమహలునకు వచ్చి లక్ష్మీబాయితో నిట్లు విన్నవించెను “పురుషులమైన మాకు మమ్ముగురించియెట్టివిచారమును లేదు; కాని యీవిషమపరిస్థితులలో మేము మాస్త్రీలను, పిన్నపాపలను రక్షించుకొనుట కశక్తులమై యున్నారము. కనుక మాస్త్రీలకు మీమహలులో నాశ్రయ మిప్పించ వేడుకొనుచున్నాను”

ఈమాటలను వినుటతోడనే రాణి కోమలహృదయము కృపారసపూరిత మయ్యెను. వెంటనే యామె దాని కంగీకరించెను. ఆంగ్లస్త్రీలు పిన్నపాపలతో రాజమహలునకు వచ్చిరి. కాని విప్లవకారులు దొరలుండు ప్రదేశమును తీసికొనిన తర్వాత రాజమహలునకుగూడ బ్రవేశింతురేమో యను భయముచే కమీషనరు వారందఱను కోటలోనికి గొంపోయెను. వారు కోటలోనికి బోయినప్పటికిని యామె వారికి ధైర్యమును బోధించుచు సహాయము చేయుచుండెను. ఆమె మూడు రోజులవరకును మూడేసిమణుగుల గోధుమరొట్టెను రహస్యముగ కోటలోనికి బంపుచుండెను; ఆంగ్లేయుల రక్షణార్థమై కోటలో యుద్ధశక్తిని ప్రదిట్టములను జేయించెను.



ఆమె విప్లవకారులలో జేరకపోవుటయే కాక నాంగ్లేయులకే సహాయము జేసిన ట్లింతకన్న మరియొక ప్రత్యక్ష ప్రమాణముగూడ గలదు. ఝాన్సీలో గావింపబడిన హత్యలలో హతశేషుడైన మార్టిను అను నొకదొర 1889ఆగష్టు పదవతేదీని లక్ష్మీబాయి దత్తపుత్రుడైన దామోదరరావు కిట్లు వ్రాసెను.

“Your poor mother was very unjustly and cruelly dealt with and no one knows her true case as I do. The poor thing took no part whatever in the mass-acre of the European residants of Jhansi in June 1857. On the contrary she supplied them with food for two days after they had gone into the fort—got 100 match lockmen from Kurrura, and sent them to assist us; but after being kept a day in the fort they were sent away in the evening. The then advised Major Skene and Captain Gordon to fly at once to Dattia and place themselves under the Raja's protection. But this even they would not do; and finally they were all mass- acred by our own troops—the Police Jail and cas. etc.”

అనగా “దురదృష్టవంతురాలైన మీతల్లిపట్ల ప్రభుత్వమువా రక్రమముగాను, క్రూరముగాను బ్రవర్తించిరి. ఆమెనుగూర్చిన యదార్థవిషయములు నాకు తెలిసినట్లు మరెవ్వరికిని దెలియవు. 1857 జూన్ మాసములో ఝాన్సీలో

జరిగిన యూరపియనుల హత్యసందర్భములో నామె కెంత మాత్రమును సంబంధములేదు; అంతేకాదు; ఆమె వారు కోటలోనికి వెళ్ళినతర్వాత రెండుదినములు వారి కాహారమును గూడ పంపించెను: కరూనామంచి మార్గము శస్త్రధారులైన (తుపాకులుగల) సిఫాయిలను బిలిపించి మాసహాయార్థము కోటలోనికి బంపెను. కాని వారిని దినమంతయు కోటలో నుంచుకొని రాత్రి పంపివేసిరి. తరువాత నామె తక్షణమే దతియాకు పారిపోయి యారాజు సంరక్షణలో నుండవలసినదని మేజరుస్కీనను, కప్తనుగార్డనుగార్లకు సలహా నిచ్చెను. కాని వా రీపనినైనను జేయరైరి! చివరకు పోలీసులు, జెయిలుఅధికారులు మొదలగు మనసేనయే వారిని హత్యచేసెను."

ఇంతకన్న వేరు ప్రత్యక్షప్రమాణ ముండబోదు; మార్టినుదొర 'హత్యలోనుండి తప్పించుకొనినవారిలో నొకడు. మరియొక సుప్రసిద్ధచరిత్రకారుడు కూడ నిట్లే వ్రాసెను.

"I have been informed, on good authority, that none of the Ranee's Servants were present on the occasion of the mass-acre. It seems to have been mainly the work of our own old followers. The irregular cavalry issued the bloody mandate and our gail Darogha was foremost in the butchery."

"హత్యలు జరిగినకాలములో మహారాణియొక్క సేవకు లెవ్వరునుగూడ నచ్చట లేరని నాకురూఢియైన వార్తయే



తెలిసెను. అది మనపూర్వసేవకులైనవారి పనిమాత్రమే యని స్పష్టమగుచున్నది. అశ్వికదళమువారు హత్యల నాజ్ఞాపించిరి. మన జయిలు అధికారియే యీహత్యలనగ్రేసరుడై జరిపించెను''

సూర్యరశ్మివలె సత్య మిచ్చట ప్రకాశించుచునే యున్నది. లక్ష్మీబాయి పరిస్థితుల కధిపతిగనే యుండెను. గాని వాని కామె లొంగిపోవునది కాదు.

విప్లవకారు లింతటితో నాగిపోలేదు వా రంతకంతకు పెచ్చుపెరుగుచుండిరి; వారు పట్టణమును బ్రవేశించి రాజమహాలుపైకి బోయి లక్ష్మీబాయి కిట్లు సందేశము నంపిరి "మేము ఢిల్లీకి బోవ నున్నారము; మాకు ఖర్చుల నిమిత్తము మూడులక్షల రూపాయిలు కావలసియున్నవి. ఆపైకమును నీవు మా కివ్వనిచో మే మిదిగో యిపుడే నీరాజమహాలును తుపాకులతో మట్టిపాలు చేయుచున్నారము." అని భయపెట్టిరి. ఈవార్త విని రాజమహాలులోనివా రందఱును భయభ్రాంతులు కాజొచ్చిరి. లక్ష్మీబాయి యెంతమాత్రమును తొణకలేదు; చలింపలేదు. విషమసమయములం దతిధైర్యస్థైర్యములతో మెలగుటయం దామె యతినిపుణురాలు వెంటనే విప్లవకారుల కామె నమ్రతతో నిట్టి సమాధానమంపెను. "ఇప్పుడు నారాజ్య మంతయు నాంగ్లేయుల యధీనములో నున్నది. నాయొద్ద ధన మేమియును లేదు. నే నతి

కష్టముతో దినములను గడపుచున్నాను. ఇట్టి యవస్థలో మీరు నన్ను బాధించుట మీకు శోభ నొసంగజాలదు.” ఈమధురవాక్యములచే వారు సంతృప్తిపడలేదు. ఝాన్సీలో నాంగ్లప్రభుత్వము విప్లవకారులచే నంత మొందింపబడెను; ఆంగ్లేయులు మహారాణి లక్ష్మీబాయిని నిరాయుధురాలుగా జేసిరి. ఆమె కేశరణ్యమును లేక విప్లవకారులను వదలించుకొనుటకు తన యాభరణముల నిచ్చివేసెను. అంతటితో విప్లవకారులు ఢిల్లీకి బోయిరి.

పైన వివరించినట్లు ఝాన్సీ అరాజక మయ్యెను; ఆంగ్లసామ్రాజ్యరవి ఝాన్సీలో నస్తంగతు డయ్యెను. ఆంగ్లేయుల ప్రభ యంతరించెను. విప్లవకారులు విజృంభించుచుండిరి. ఇట్టి విషమావస్థలో లక్ష్మీబాయి యేమి చేయవలెను? ప్రజలు రక్షణలేక దిక్కులేనివారివలె నల్లాడుచున్నారు. ఆమె వెంటనే పండిత గోపాలరావుభూటే, యహాసనుఆలీ, ఝాన్సీకమిషనరుయొక్క శిరస్తాదారు మొదలగు గొప్ప గొప్ప బ్రిటిషుసర్కారు అధికారులను తనయొద్దకు బిలిపించి కర్తవ్యమును గూర్చి వారిని ప్రశ్నించెను. వారిట్లు సలహా నిచ్చిరి. “సాగరులో నింతవరకును విప్లవచిహ్నములు కాన్పించుటలేదు; అక్కడనున్న ప్రభుత్వాధికారులకు ఝాన్సీవిప్లవము సంగతి తెలియపర్చవలెను; దానివలన వారు మొదటనే మేల్కొని జాగ్రతపడుదురు. సాగరులోనున్న కమిషనరును



ఝాన్సీవిషయమై యెట్టి బందోబస్తు చేయవలయునో కనుగొనవలెను.” పండిత గోపాలరా వీయంశములను గురించి సాగరుకమిషనరుకు వ్రాసెను. దీని ఫలిత మేమన సాగరులో విప్లవము లేకుండ నచ్చటి యుద్యోగస్తులు కాపాడుకొనిరి; ఝాన్సీకి ఆంగ్లాధికారి నెవ్వరినైనను పంపువరకు ఝాన్సీ ప్రాంతపాలనాభార మంతను పూర్తిగా మహారాణి లక్ష్మీబాయియే వహింపవలెనని సాగరుకమిషనరు కోరెను. ఆమె దాని కంగీకరించెను.

కాని బ్రిటిషుప్రభుత్వమువా రామె నిదివరలో రాజ్యభారమునుండి తొలగించుటచే నామెయొద్ద రాజనీతినిపుణులుగాని, శస్త్రములుగాని, సిబందిగాని లేవు; ప్రాచీనసేవకులందరును ఝాన్సీనుండి వెడలిపోయిరి. దర్బారులో విశ్వాసపాత్రులైన వారెవ్వరునులేరు. ఇట్టివిషమపరిస్థితులలో నామె ధీశక్తియు, నసమాన నీతినిపుణతయు, నామె కాశ్రయ మయ్యెను. తనదగ్గర నున్నకొలది సాధనసంపత్తితో నామె యొక నూతనసృష్టిని జేసెను. ప్రభుత్వమువారి కెప్పటికప్పుడు పరిస్థితుల నుత్తరములద్వారా తెలియజేయుచు తన మిత్రభావమును స్పష్టీకరించుచునే యుండెను; ఆంగ్లాధికారుల యాజ్ఞల ననుసరించియే తాను ఝాన్సీరాజ్యమును కట్టుదిట్టము చేయుచున్నట్లు తెలియపరచుచుండెను విప్లవానంత

రము: ఝాన్సీకమిషనరుగా వచ్చిన కప్తానుపింకు యీవిష యమై యిట్లు వ్రాయుచున్నాడు.

"It is stated on the most trustworthy authority, that at the same time, she endeavoured to keep terms with our Government, by writing to the commissioner of Jubbalapore and to others, Lammenting the massacre of our countrymen stating she was in no way concerned in it, declaring that she only held the Jhansi District till our; Government could make arrangements to reoccupy it."

"జబ్బలపూరు మొదలగు నధికారులకు తెలియజేయుచు నామె మన ప్రభుత్వముతో మిత్రత్వమునే వహించెనని చెప్పుటకు రూఢియైన, విశ్వసనీయమైన, యాధారము లున్నవి; మన దేశీయులను గావించిన హత్యల కామె యెంతయో విచారించుచు నామెకు దానితో నెట్టి సంబంధమును లేదనియు, మనప్రభుత్వము వారు ఝాన్సీని తిరుగ తమ వశము జేసికొనుటకు తగు ఏర్పాటులను జేసికొనువరకు మాత్రమే తాను ఝాన్సీపరగణాను చేపట్టితి ననియు ప్రకటించెను.

కప్తానుపింకు ప్రభుత్వమువారి గొప్పయుద్యోగియగుటచే నీవాక్యములలో నసత్యముండుట కవకాశము కాన్పించదు. ఈవాక్యములనే, స్వయముగా తన చేతులతోనే లక్ష్మీబాయి



యుత్తరము నాంగ్లేయుల కిచ్చిన మార్టినదొర సమర్థించుచున్నాడు:

"She sent Khareetas to Colonel Erkasine at Jubbalapore. to Colonel Fraser, Chief commissioner of Agra, which I handed to him with my own hands, to hear her explanation, but—No ! Jhansi had been a by word and was condemned unheard !'

"మహారాణీ లక్ష్మీబాయి జబ్బలపూరుకమీషనరైన కలనలు ఎర్కసనుకును, ఆగ్రాచీఫ్ కమిషనరైన ఫ్రేజరుకును పిటీషనులను పంపించెను. నేనే వానిని స్వయముగా నా చేతులతో వారి కిచ్చితిని. అందులో నామె యన్ని విషయములను విశదపరచెను. కాని ! ఆమె మొరను వినువారెవరు ! ఝాన్సీశబ్దము కర్ణకఠోరమయ్యెను. పల్లెత్తుమాట వినకుండగనే ఝాన్సీ దోషభూయిష్ఠమని గ్రహింపబడెను."

ఝాన్సీలో కొంతకాలమువరకు బ్రిటిషురాజ్యరవి యస్తమించెనని చెప్పియుంటిమి. వెంటనే నాలుగుమూలల నుండి శత్రువులు ఝాన్సీపై దాడివెడల నారంభించిరి. ఈ శత్రువుల నందర నోడించుటకు లక్ష్మీబాయి క్రొత్తసేనలను కూర్చుకొనవలసిన యవసరము వచ్చెను. సదాశివనారాయణ యను నొకమహారాష్ట్రుడీసమయమును కనిపెట్టి తన సేన నంతను కూర్చుకొని 1857 జూన్ 13 తేదిని ఝాన్సీకి ముప్పదిమైళ్ళ దూరములో నున్న కరూరా యనుకోటపై దాడి

కాడలెను. అతడచ్చట నున్న యింగ్లీషువారి ఠాణేదారు, తహస్సీల్దారులను జావగొట్టి కోటను తనవశము జేసికొనెను; అచ్చటనున్న ఠాకురు లందరివద్దను దౌర్జన్యముగా ధనము వసూలుచేయ నారంభించెను. ఇంతేగాక నతడతివైభవముతో రాజ్యాభిషిక్తుడై "మహారాజా సదాశివరావునారాయణ" అను బిరుదు వహించెను. తానే ఝాన్సీకి యథార్థమైన యధికారి నని యతడు ప్రకటించెను. అతడు తనపేర హుకుములను పంపించుచు గ్రామగ్రామములకు తాను రాజైనట్లు తెలియ జేయుచుండెను. అతడు రాజపురఠాణేదారైన గులాముహుస్సేను అనువానికి "నేను నిన్ను రాజపురఠాణేదారునిగ నియమించుచున్నాను నీవు గ్రామగ్రామములకు బోయి మహారాజా సదాశివరావు ఝాన్సీసింహాసనముపై నధిష్ఠించియున్నాడని తెలియజేయుము." అని యాజ్ఞాపత్రము నంపించెను. కాని ఠాణేదారు దీనిని లెక్కసెట్టలేదు. గులామహుసేనుపదవినుండి తొలగింపబడవలెననియు నతనియాస్తిని జప్తు చేయవలసినదనియు నతడు వెంటనే యాజ్ఞ చేసెను. ఈవిధముగా నాతనియత్యాచారములు మితిమీరుచుండెను. ఝాన్సీ అరాజకమయ్యెను. ఆంగ్లప్రభుత్వ మెచ్చటను గానరాదు. ఇక మహారాణి లక్ష్మీబాయి యెట్లూరకుండగలదు?

ప్రజలనురక్షించుటే తనధర్మమని లక్ష్మీబాయి పూర్తిగా నెరుగును. ఆంగ్లప్రభుత్వము ప్రజలను రక్షింపజాలకుం



డెను. వెంటనే యామె నలుదిక్కులనుండియు సేనలను గూర్చుకొని లేడికి లంఘించు సింగంబుపగిది, వానిపై నురికెను. ఆమె తనసైన్యములతో కరూరాపై నురుకుటతోడనే సదాశివరావు పలాయనుడై సింధియాసర్కారురాజ్యములో నున్న నరవర యను గ్రామములో తలదాచుకొనెను. అతడు మరల ఝాన్సీకి రావలెనని ప్రయత్నించెను. ఈసారి మహారాణి లక్ష్మీబాయి వానిని పట్టుకొని ఝాన్సీకోటలో ఖయిదుచేయించెను. ఆమె యిట్లొకశత్రువు నణచివేసెను. యుద్ధమింకను ముగియకమునుపే ఓర్ఛారాజు దివానయిన నథేఖాను అనువాడిరువదివేలమంది సైన్యముతో ఝాన్సీమీదకు యుద్ధమునకువచ్చెను. ఈసమయమందు మహారాణివద్ద చాల తక్కువసైన్య ముండెను. ఆమె యీసంగతిని మధ్యరాష్ట్రప్రభుత్వాధికారి కెరుకపరచెను. కాని మధ్యత్రోవలో నీవార్తాహరులను నథేఖాను పట్టుకొనెను. ఆమె యెట్టిసహాయమును లేకుండ నథేఖాను నెదుర్కొనెను. ఆమె స్వయముగా యుద్ధప్రయత్నములను జేయించెను. నథేఖాను సగర్వముగా నామె కిట్లు సందేశ మంపెను. "నిన్ను బ్రిటిషువారెంతయాదరముతో జూచుచున్నారో నేను నట్లే చూచుటకు సిద్ధముగ నున్నాను. ఝాన్సీకోటను పట్టణమును నాకిచ్చివేయుము." ఈమాటలను వినుటతోడనే లక్ష్మీబాయికి పట్టరానికోపము వచ్చెను; ఆమెకన్నులు చింతనిప్పులయ్యెను; ఆమెక్రోధాగ్ని

చేతనే నథేఖాను నగము చచ్చెను. ఆమె వెంటనే తనమంత్రివర్గమును బిలిచి యుద్ధప్రయత్నములను గావించెను. నథేఖాను సైన్యము చాల పెద్దదని విని కొందరామె కిట్టిపరిస్థితులలో యుద్ధముచేయక వినయపూర్వకముగా నతనికి లొంగిపోవుట మంచిదని సలహా చెప్పదొడంగిరి. ఈమాటలు వినుటతోడనే లక్ష్మీబాయి వారికై మండిపడి యిట్లనెను. "మీమానుష జీవితముల గాలనా! నేనబలనైనను నాధైర్యసాహసములపై నాధారపడి నాకర్తవ్యమును పరిత్యజింపనొల్లను. మీరు పురుషులైయుండియు కూడ నిట్టియమానుషవాక్యములను బలుకుటకు మీకు నోరెట్లువచ్చెనో కదా! ఈయసారసంసారమందు తనువు నిత్యముకాదు. మనమందరము నెప్పుడో యొకప్పుడు చచ్చువారమే కాని శాశ్వతముగా నుండువారము కాము! రాజ్యధర్మమును నిర్వహింపవలసిన సమయము వచ్చినపుడు కర్తవ్యయజ్ఞమందు మన మనువుల నర్పించి మానుషధర్మమును నెరవేర్చినచో నిహపరలోకఖ్యాతికి కారణమగును. యుద్ధములో పరాఙ్ముఖత యనునది నానిఘంటువునం దెచ్చటను లేదు" భారతరాజనీతి నింతకన్న సూక్ష్మముగా నెవరు బోధింపగలరు? ఇవియే శ్రీకృష్ణుని వాక్యములు. ములుకులవంటి యీమాటలను విని వారందరును లజ్జావనతవదనులై శస్త్రములను బూని యుద్ధరంగమున కురికిరి. లక్ష్మీబాయి నథేఖానుకిట్లు కబురుపంపెను. "నేనిప్పుడు బ్రిటిషు



సర్కారు ఆజ్ఞచే యీరాజ్యమునంతను కట్టుదిట్టము చేయుచున్నాను. నీవంటి వీరపురుషులు నావంటియబలపై కురుకుట యుచితము కాదు. నీమౌర్ఖ్యమును విడవేని నీవొక్కవిషయమును మాత్రము జ్ఞాపకముంచుకొమ్ము! నేను పరమపరాక్రమశాలియగు శివరావుభావుయొక్క కోడలను అను సంగతిని గ్రహించుము." నథేఖాను రాజ్యకాంక్షచే నున్మత్తుడైయుండెను. లక్ష్మీబాయి యుద్ధము చేయనున్నదను వార్తనువినియు తను క్రోధోద్దీపితుడై యామెకోటపైకి సేనలనంపెను. లక్ష్మీబాయి ఝాన్సీలోనున్న గొప్పగొప్ప ఠాకురులను, జాగీరుదారులను బిలిపించి రాజమహాలులో గొప్పదర్బారు చేయించెను. దివాను జవాహరుసింహు, దివాను దిలీపుసింహు, దివాను రఘునాథసింహు మొదలగు ప్రాచీనసరదారు లందరును వచ్చి లక్ష్మీబాయికి ప్రణమిల్లిరి. వెంటనే యుద్ధప్రయత్నములు గావింపబడెను. లక్ష్మీబాయి బ్రిటిషుప్రభుత్వమువారిచే నాశము గావింపబడిన కోటలోని పాతఫిరంగులను బాగుచేయించి బురుజులపై బెట్టించెను. గుండ్లు తయారుచేయుట కొరకు కార్ఖానా వెంటనే ఏర్పాటు చేయబడెను; బుందేల్ఖండులోని ఠాకురులును సరదారులును దమతమ సైన్యములతో వచ్చిరి. ప్రాతఃకాలమందు మహారాణి దివాను జవాహరుసింహును బిలచి రణకంకణమును చేతికిగట్టి సేనాపతిగా నియమించెను. లక్ష్మీబాయికూడ యోధవేషమును ధరించి శిరోవేష్టనమును

జుట్టి, పటకాను తనకత్తిని వ్రేలకట్టి, కంఠసీమను ముత్యాల హారమును ధరించి కోటయొక్క ప్రధానబురుజులపై కెక్కి పీష్వాకాలమునాటి ప్రాచీనజెండాను, బ్రిటిషుప్రభుత్వమువా రిచ్చినయూనియనుజాకును పైకెత్తించెను. నథేఖాను సైన్యము కోటకు దక్షిణముగా రాజొచ్చెను. వెంటనేకోటపైనుండి గుండ్లవర్షము కురియనారంభించెను; ఆగుండ్లను దాటివచ్చిన వారు మహారాణియొక్క ప్రధానసేనానులలో నొకడగు గులాంగౌస్ఖానుకు బలియగుచుండిరి. నథేఖాను సైన్యము చెల్లాచెదరు కాజొచ్చెను. నథేఖానునకు విజయముచేకూరునట్లు లేదు అతడు రాత్రివేళ కోటయొక్క ఓర్ఛాద్వారమువద్ద నాలుగు తుపాకుల నమర్చి సేనను నాలుగుభాగములుగా జేసి లక్ష్మీబాయి సేనపైకి వచ్చెను. ఇది కొంతకష్టమును కలుగజేసెను. ఓర్ఛాద్వారముపై గుండ్లవర్షము కురియుటచే నచ్చటకొంత జంకుపుట్టెను. వెంటనే లక్ష్మీబాయి స్వయముగా నచ్చటకు బోయి సిపాయిలను హెచ్చరించెను; లక్ష్మీబాయిని చూచి వారు ద్విగుణీకృతోత్సాహముతో పోరివిజయలక్ష్మిని జేపట్టిరి. నథేఖాను రణభూమిని విడిచి పలాయనమయ్యెను.

ఇట్లు ఝాన్సీ నాక్రమింపవలెనని వచ్చిన రెండవ శత్రువుకూడ నాశమొందెను. ఝాన్సీప్రాంతమంతయు రక్షింపబడెను. ఆమె యీవిషయముల నన్నిటిని హేమిల్టనుకు తెలియజేసెను. ఈవిషయములను గురించి మార్టిను యిట్లు వ్రాయుచున్నాడు.



"After the mutinous troops had quitted Jhansi she certainly took possession of her country when the two states, Dattia and Teheree, who could easily have protected our people, but would not as much as raise a finger to help us, though the Orcha boundary was not more than a mile and a half from Jhansi parade grounds, and that of Dattia only six miles—with large bodies of armed men on their respective frontier watching the doings of our troops. Imagining that the Ranee being unprepared and that they would with ease wrest her country from her hands, they attacked her with their combined forces and were from time to time, thrashed back by that gallant lady."

"విప్లవకారులు ఝాన్సీని విడిచివెళ్ళినతరువాత నామె ఝాన్సీప్రాంతమును తనయధీనము చేసికొనెననుటలో సందేహములేదు, దతియా, టెహిరీ, యను స్టేటులు ఝాన్సీ కవాతుస్థలమున కొకటిన్నరమైళ్ళలో నొకటియు, ఆరుమైళ్ళలో నొకటియు నుండి గొప్పగొప్ప సైన్యవనిహాములను తమసరిహద్దులందు సమకూర్చుకొనియుగూడ మనప్రజలను రక్షించుటకొకయంగుళమైనను ముందుకు రాక మనసైన్యములు జరుపుయత్యాచారములను జూచుచు నూరకుండిరి. విప్లవకారులు రాణి యసహాయురాలై యున్నదనియు, నామె దేశమును సునాయాసముగా లాగుకొనవచ్చుననియు దలంచి తమసైన్యముల నన్నిటి నేకముజేసికొని యామెపై బడిరి; కాని యా

వీరవనిత వారి నందరను మాటిమాటికి నోడించి తరుమగొట్టెను."

ఈయసమానసేవకు బ్రిటిషు ప్రభుత్వము వారు చూపిన ప్రతిఫలమును మానవులు మరచినను చరిత్ర మరువజాలదు ! అన్నముపెట్టినచేతినే కరచిన చందమాయెను ! ముందు రాబోవుచరిత్ర యంతయు దీనినే రుజువు చేయగలదు.

### మహారాణి లక్ష్మీబాయి పరిపాలన.

స్త్రీయోహినామ ఖల్వేతాని సర్గాదేవ పండితాః
పురుషాణాంతు పాండిత్యం శాస్త్రైరేవోపదిశ్యతే॥

మహారాణి లక్ష్మీబాయి పదిమాసములవరకు నతిచాకచక్యముతో ఝాన్సీరాజ్యమును బాలించెను; రాజులేక నల్లాడుచున్న ప్రజలకు రక్షణ నొసంగెను; అనేక సైన్యములను గూర్చుకొని శాంతిని కాపాడెను. ఝాన్సీచరిత్రలో నీసమయము రామరాజ్యముగా భావింపబడెను. రాజ్యభారము మహారాణిపై పడనంతవరకు నామె గుణగణము లేవియు నంతగా వెల్లడి కాలేదు. కాని రాజ్యభారము మీదపడినపుడే యామె యద్భుతసద్గుణసంపత్తి బహిర్గత మయ్యెను ఆమెయొక్క రాజ్యతంత్రప్రవీణత, ప్రజావాత్సల్యత, న్యాయకుశలత, స్వధర్మపరాయణత, గుణగ్రహణ పారీణత, దయాసత్యశౌచములు; విశుద్ధజీవితము, యిక నెన్నిగుణములను జెప్పగలము -- ఇవన్నియు నీపదిమాసములలోను



ప్రజల కపరిమితానందమును, జూపరుల కత్యాశ్చర్యమును కలుగజేయుచుండెను. ఝాన్సీలో మరల నొక్కసారి ప్రాచీన వైభవము తాండవమాడెను. ప్రజలు సంతోషస్వాంతులైరి; నూతన పరిశ్రమ లెన్నియో పల్లవించెను. రాణి సార్థకరాణి యయ్యెను. బ్రాహ్మణధర్మమును వీడి క్షాత్రధర్మమును వహించుటతోడనే యామె దినచర్యకూడ తదనుగుణముగనే మారిపోయెను. "ఆమె ప్రాతఃకాలమున నయిదుగంటలకు నిద్దుర మేల్కాంచి స్నానాదికములను గావించుకొని సుందరమై, స్వచ్ఛమైన సఫేనుచీరను ధరించి పార్థివపూజ సలుపును. ఆసమయమందు గాయకశిఖామణులు గానము చేయుచుందురు; పౌరాణికులు పురాణములను జదువుచుందురు. తరువాత సరదారులును, ఆశ్రితులును ప్రణామములను జేయుటకు వత్తురు. మహారాణి ప్రతికార్యమును బ్రత్యేకదృష్టితో జూచుచునే యుండెను, సరదారులలో నెవ్వరైన నొకటి రెండు రోజులు రాకపోయినచో వెంటనే యామె కనుగొని వానిని బ్రశ్నించును. తరువాత నామెభోజనము చేయును. భోజనానంతరము కొంతసేపు విశ్రమించును; లేదా నజరానా తెచ్చిన వస్తువులలో నేదో యొక మంచి వస్తువును దీసికొని తక్కిన వానిని బీదలకు పంచిపెట్టును. తరువాత మూడుగంటలకు కచేరీ చేయును ; అచ్చట సాయంత్రమువరకును రాజకీయవ్యవహారములను, న్యాయపరిపాలనను తానే స్వయముగా

జూచుకొనును." ఆమె దుస్తులను గురించి (వీరానీ, యను గ్రంథములో నొక గ్రంథకర్త యిట్లు వ్రాసియున్నాడు. "ఆమె స్త్రీవేషమును ధరించినను సామాన్య స్త్రీ దుస్తులనే వేయును గాని రాజఠీవి జూపి యెరుగదు; ఆమె తల కొక యెఱ్ఱపట్టు ముఖమలు టోపి ధరించును; దానిచుట్టును ముత్యముల సరములును, జవాహిరియు నలంకరింపబడి యుండును; అధమపక్ష మొకలక్ష రూప్యములు విలువగల యొక చిన్న రత్నఖచితమాల యామె కంఠసీమ నలంకరించును. వక్షస్థలశోభను తెలియజేయు నొక కంచుకము నడుము వరకు నుండును ఒకబంగారు పట్టు పటకా యామె నడుమునకు బిగించియుండును ఈపటకాలో వెండి మలామాయును, మిరుమిట్లు గొలుపు నగిషీయును గల రెండు డమస్కసు పిస్తోలు లమర్చియుండును. కాని సమీపముననే యొక కైజారు వ్రేలాడుచుండును; ధగధగమని మెఱయు దాని ధారాగ్రము విషమున ముంచబడి యుండును; ఒక చిన్న వ్రేటుతో నది ప్రాణమును నాశము జేయును. ఆమె మామూలు చీరకు బదులొక పాయిజామాను ధరించును." ఆమె యొక్కొకప్పుడు స్త్రీ వేషముతోనే కచేరీకి బోవుచుండును ఆసమయమునం దామె తెల్లని దోవతియును, రవికయును ధరించును. ఆమె కంఠసీమ నొక ముత్యాలహారమును, (వేలి కొక వజ్రపుటుంగరమును ధరించును. ఇవితప్ప యామె త



క్కిన సర్వాభరణములను బరిత్యజించెను. దర్బారులో నామె యెవరికిని గానరాదు. ఆమెకు బ్రత్యేకముగా వేరొక మందిర ముండును; మందిరద్వారమువద్ద నిద్దరు ద్వారపాలకులు బంగారు పొన్నుకర్రలతో నిలచియుందురు. మహారాణిసమీపమున దివాను లక్ష్మణరావు కాగితము, కలము, సిరాబుడ్డి వగైరాలతో కూర్చొని యామె చెప్పినదంతయు వ్రాయుచుండును. లక్ష్మీబాయిబుద్ధి కుశాగ్రబుద్ధియని యిదివరకే గ్రహించియుంటిమి. ఆమెయొద్దకు వచ్చు విషయముల నామె శ్రద్ధతో బరీక్షించుచు తానే స్వయముగా తీర్పు చెప్పును. ఆమె తీర్పుల నతిత్వరితముగ చెప్పుచుండ లేఖకులు వ్రాయజాలకపోవుచుందురు. ఆమె కత్తి నెంత సునాయాసముగా ఝుళిపింపగలదో కలమునుగూడ నట్లే సవ్యసాచివలె నుపయోగించుచు నొకప్పుడు తీర్పులను తానే వ్రాయుచుండును. ఆమె న్యాయదీక్షతకు ప్రజలందరును ప్రసన్నులగుచుండిరి. ఈవిషయమై పైలరుదొర యిట్లు చెప్పుచున్నాడు. "మహారాష్ట్ర బ్రాహ్మణజాతి స్త్రీయైన మహారాణి లక్ష్మీబాయి తర్దాలో నుండుట కిచ్చగింపదు. ఆమె ప్రతిదినమును తనభర్త సింహాసనముపై గూర్చొనును; రిపోర్టులను, ఆర్డిలను స్వయముగా వినును; ఆజ్ఞలను జారీచేయుచుండును. ఆమె తనపదవికి తగిన యోగ్యతతోను, ధైర్యస్థైర్యములతోను, నిశ్చయబుద్ధితోను వ్యవహరించుచుండును."

ఆమె దానధర్మముల నతిశ్రద్ధాభక్తులతో చేయుచుండును. ఆమె యెప్పుడును దనయిలువేల్పయిన శ్రీమహాలక్ష్మీదేవిని సేవించుచుండును. ఆమె శ్రీమహాలక్ష్మీదేవి మందిరమునకు బోవునపుడు దారిలో గాచికొనియుండు బిచ్చగాండ్రందఱకును దానధర్మములు చేయుచు వారిని సంతుష్టిపరచుచుండును. ఆమె దానధర్మములను గురించి యనేక కథలు గలవు. ఒకనాడామె శ్రీమహాలక్ష్మిని దర్శించి దక్షిణద్వారముగుండ వచ్చుచుండెను; ఆసమయమందు వెయ్యిమంది బిచ్చగాండ్రు త్రోవలో నిలచి గోలపెట్టుచుండిరి. అప్పుడామె దివాను లక్ష్మణరావును పిలచి యీ గోల యేమని ప్రశ్నించెను. లక్ష్మణరావు వారు బిచ్చగాండ్రనియు, నీ శీతకాలమందు వస్త్రహీనులగుటచే జలిబాధ తాగజాలక గోలపెట్టుచున్నారనియు, మహారాణి సహాయమును వేడుకొనుచున్నారనియు, జెప్పెను. ఈదైన్యకథనమును వినుటతోడనే లక్ష్మీబాయి హృదయము కరిగిపోయెను. ఆమె వెంటనే పట్టణములోనున్న బిచ్చగాండ్ర నందరను బిలిపించి షడ్రసోపేతముగ భోజనము నిడి ప్రతివానికి నొక్కొక్క దూదికోటు, టోపి, కంబళి మొదలగువాని నిప్పించెను. ఆమె శాసనకాలమందు బిచ్చగాండ్రెవరును క్షోభించి యెరుగరు. ఆశ్వారోహణమునందును, అశ్వపరీక్షయందును, మహారాణి యసమాన ప్రజ్ఞ సంపాదించెను. ఆమె ప్రావీణ్యతను జూచి గొప్పగొప్ప గుఱ్ఱ



ములను బరీక్షింప వలసినచ్చినప్పు డామెయొద్దకే తీసికొని పోవుచుండెడివారు. ఒకనాడొక గొప్ప షాహుకారు రెండు గుఱ్ఱములను తీసికొని వచ్చెను. ఆమె వానిని చూచుటతోడనే యొకదానివెల వెయ్యిరూపాయిలనియు, మరియొకదాని వెల పాతికరూపాయిలనియు జెప్పెను. ఇది విని ప్రజలందరు నాశ్చర్యపడి దీనికి గారణ మేమని యడిగిరి. రెండవ గుఱ్ఱమునకు ఛాతిమీద మచ్చయున్నదని యామె బదులుచెప్పెను. షాహుకారు మహారాణి యశ్వపరీక్షాకౌశలమునకు జాల మెచ్చుకొనెను. ఆమె యతిదయార్ద్రహృదయురాలు. యుద్ధములో గాయములు తగిలినవారి నామె స్వయముగా చూచుచుండును; వారిని తన చేతులతో తట్టి బుజ్జగించుచు మందు పట్టీలు వగైరాల నేర్పాటుచేసి జాగ్రతతో గనిపెట్టుచుండును. ఈకారణముచేతనే ప్రజలామె నొక మాతవలె పూజించుచుండెడువారు. మాతకొరకు పుత్రు లెట్టిత్యాగమునైనను జేయుటలో నాశ్చర్య మేమి కలదు! కాని ఝాన్సీ ప్రజ లిట్లు సౌఖ్యపడుటకు భగవంతు డోర్వజాలక పోయెను కాబోలును! ఝాన్సీరాణి చేసినమేలుకు ప్రభుత్వమువారా మెరాజ్యము నామె కియ్యకపోవుటయే గాక నామెపై యుద్ధమును బ్రకటించిరి. బ్రిటిషున్యాయమం దామెకు గల విశ్వాస మంతటితో నంతరించెను. ఆమె యనేక కమీషనరులకు బంపిన పిటిషనులు నిష్ఫలమయ్యెను. గవర్నరు జనర

లుకు బంపిన పిటిషను బూడిదపాలయ్యెను; హేమిల్టను మధ్య భారతదేశములో ననేక సంవత్సరముల నుండి పొలిటికల్ యేజంటుగా నుండియు ఝాన్సీరాణి హృదయమును గ్రహింపడాయెను. మిత్రుడే శత్రువయ్యెను. లక్ష్మీబాయి తాను సంపాదించుకొనిన స్వరాజ్యము నెట్టి శత్రువుకైనను జంకి విడుచునట్టి భీరువు కాదు! క్షాత్రతేజము నెరుగని సామాన్యయబల కాదు! రాజనీతి నెరుగని రాణివాసపు స్త్రీ కాదు! సామ, దాన, భేదములు నిరుపయోగము లయినపుడామె దండమునే బూనవలసి వచ్చెను. ఆమె యింతవరకును విశ్రమింపజేసిన క్షాత్రమును మేల్కొల్పెను. బ్రిటిషుప్రభుత్వముతో పాటు ఆమెయు రణరంగమున ఉరికెను.



# మహారాణి ఝాన్సీ లక్ష్మీబాయి



## నాల్గవ ప్రకరణము.



### ఝాన్సీయుద్ధము.

ప్రభుత్వమువారు ఝాన్సీరాణి నెట్లైన నోడించవలెనని పాశ్చాత్యరణరంగములందు పేరొందిన యుద్ధకళావిశారదుడగు సర్ హూగ్ రోజునకు సైన్యాధిపత్యము నిచ్చి తమ ప్రచండసైన్యములను ఝాన్సీపైకి బంపిరి. ఇరువదిలక్షల రూప్యములు మాత్రమే వచ్చు నొకయబల యొకప్రక్క; నొక మహాసామ్రాజ్యము నేలుచు ననేక సామ్రాజ్యముల గూలదీసిన ప్రభుత్వము మరియొక వంక; పదిమాసములే పరిపాలనానుభవము గలిగి పోయిన రాజ్యము నప్పుడే సంపాదించుకొనిన రాణి మరియొక వైపున; శతాబ్దములనుండి రాజ్యపాలనాభారమునం దారితేరిన సామ్రాజ్యము మరియొక వైపున; నిరాయుధురాలు గావింపబడి శస్త్రముల నప్పుడే ప్రోగుజేసుకొనుచున్న స్త్రీయొకవైపున; యూరప్పులోని నవీనాస్త్రశస్త్రసంపద నంతను దిగుమతి చేసికొనిన జగజెట్టీ లొకవంక; ఇట్లసమయుద్ధము ప్రారంభమయ్యెను.

సర్ హ్యూగ్రోజు నింగ్లండునుండి పిలిపించిరి అతడు 1857 సెప్టెంబరులో బొంబాయిరేవులో దిగెను; తోడనే యతడు బుందేల్ఖండు పొలిటికలు ఏజంటు హేమిల్టను, కమాండరిన్‌చీఫ్ బేలుదొరల సలహాలతో ఝాన్సీపై యుద్ధముకు తగిన బందోబస్తు చేసెను; అతడు సైన్యమును రెండుభాగములుగా విభజించి యొకదానిని జబ్బలుపూరులోను మరియొకదానిని, మవులోను కేంద్రీకరించెను. వీటికి బ్రిగేడియరు జనరల్ విట్లాకు, సర్ హ్యూగ్రోజు లాధిపత్యమును వహించిరి. సర్ హ్యూగ్రోజు తనసైన్యమును మరల రెండు భాగములుగా విభజించెను. ఒకభాగములో బొంబాయి అశ్వదళము 14 వ లైటు డ్రిగూన్సు హైదరాబాదు సైన్యములోని రెండు అశ్వికదళములు, 86 వ పటాలములోని రెండుభాగములు, బొంబాయి దేశీయకాల్బలముయొక్క 25 వ పటాలము మూడు మరఫిరంగులు గలవు రెండవ భాగములో బొంబాయి అశ్వికదళములోని ముఖ్యభాగము, హైదరాబాదు సైన్యములోని యొక అశ్వికదళము; మూడవ బొంబాయి యూరపియను పటాలము, 24 బొంబాయి దేశీయకాల్బలము, హైదరాబాదు సైన్యములోని యొక కాల్బలపటాలము భోపాళసైన్యము, మద్రాసు సయిపర్సు కంపెనీయును గలవు; ఈసైన్యములో నొకభాగము మవులోను, రెండవభాగము సీహోరులోను నుంచబడెను. ఈసైన్యమంతకును సర్ హ్యూగ్రోజు సర్వాధి



కారి. 1858 జనవరి 6 వ తారీఖున హేమిల్టను, హ్యూగ్రోజులిద్దరును గలసి సీహోరు మార్గమున బయలుదేరిరి; త్రోవలో భోపాళబేగము పంపించిన సైన్యము వీరికి తోడయ్యెను. ఈసైన్యములను దీసికొని వీరు సాగరుమీదుగా రహట్‌గడుకు వచ్చిరి. అక్కడ మహమ్మదీయులతో పోరు సలుపవలసి వచ్చెను; వారితో ఘోరయుద్ధము జరిగెను. చివరకు ముసల్మానులు పారిపోయిరి; అక్కడనుండి రోజు విప్లవకారులలో జేరిన వానపురరాజు నోడించి ముందుకు సాగెను; అక్కడనుండి సాగరుకోటపై కురికి యచ్చటనున్న విప్లవకారుల నోడించి యాంగ్లఖయిదీలను విడిపించెను; తరువాత 25 మైళ్ళ దూరములో నున్న గఢాకోటకు రోజు తన సైన్యములను తరలించెను. ఈకోట 51, 52 పటాలములకు జెందిన బంగాళావిప్లవకారుల చేతులలో నుండెను. చివరకు రోజు దీనిని కూడ స్వాధీనము జేసికొనెను. ఈవిధముగా నర్మద కుత్తరతీరప్రదేశ మంతయు నాంగ్లేయుల హస్తగత మగుటతోడనే రోజు తనసేనలను బుందేల్ఖండువైపుకు బట్టించెను. బుందేల్ఖండులో విప్లవకారులకు ముఖ్యస్థానము ఝాన్సీ యని యతడు నిశ్చయించుకొనెను. కమాండరన్‌ఛీఫ్ సర్ కాలిన్ కాంబెలు కూడ ఝాన్సీని వశపరచుకొనిన గాని యుత్తరహిందూస్థానమంతయు వశపడజాలదని సలహా యిచ్చెను.

కాని ఝాన్సీ చేరుట సులభము కాదు మార్గమధ్య

మున విప్లవకారు లనేకమంది యుండిరి. వీరందరును సేనలతో సిద్ధముగ నుండిరి. శాహగఢ, మదనపురము, వానపురము మొదలగు రాజులతో సర్ హ్యూరోజు యుద్ధముచేసి వారిరాజ్యములను బ్రిటిషురాజ్యములో కలిపివేసెను. ఈవిధముగా విజయపరంపరల నొందుచు రోజు దొర 17 మార్చి 1858 నాటికి బేత్వానది సమీపమునకు వచ్చెను. ఆనాడే వారు ప్రాచీనదుర్గమగు సుప్రసిద్ధ చందేరీకోటను విప్లవకారుల చేతులలోనుండి లాగుకొనిరి. ఈవిజయమువలన సర్ హ్యూరోజు కపరిమితోత్సాహము కలిగెను. అప్పు డతడు సేనలను ఝాన్సీవైపుకు మరలించి మార్చి 19 వ తేదీకి ఝాన్సీకి 14 మైళ్ళదూరములోనున్న చంచనపురమను గ్రామము చేరెను. మరునాడు కొన్ని తుపాకులను, అశ్వికులను యిచ్చి రోజుదొర ఝాన్సీ రస్తాను బరిశోధించుటకు కొంతమందిని బంపెను. మరునాడు రోజు సేనలతో నచ్చుటకు బోవ నిశ్చయించుకొనెను.

ఇంతలో గవర్నరు జనరలు వద్దనుంచి యొక వార్త వచ్చెను. అందులో నిట్లుండెను. బుందేల్ఖండు ప్రాంతమందున్న చర్ఖారీరాజైన రత్నసింహుడు మన కత్యంతమిత్రుడు. అతని రాజ్యముపైకి యతాత్యాతోపె యురుకుచున్నాడు. అతనిని రక్షించుట అతిజరూరు కనుక నీసమయమునందు మొట్టమొదట మీ రతనిని సంకటాపన్నునుండి తప్పించి తరువాత ఝాన్సీ



మీదకు పోవలెను. ఈయాజ్ఞను వినటతోడనే రోజుదొర విచారగ్రస్తు డయ్యెను; అక్కడకు ఝాన్సీ 14 మైళ్ళలో నుండెను. చర్ఖారీ 80 మైళ్ళలో నుండెను. గవర్నరుజనరలుగారి యాజ్ఞ నుల్లంఘించుటయా? లేక ఝాన్సీని వదలుకొని చర్ఖారీకి బోవుటయా? ఈసమయమందు ఝాన్సీని విడిచిపెట్టుట రాజనీతి కాదు. తరువాత ఝాన్సీపైకి బోవుట దుర్లభమగును. అప్పుడు పొలిటికలు ఏజెంటు హేమిల్టను భారముసంతయు తనపై వేసుకొని మొట్టమొదట ఝాన్సీమీదికే పోవ నిశ్చయించుకొనెను. అతడు వెంటనే గవర్నరు జనరలు కిట్లు జాబు వ్రాసెను. "మేము చర్ఖారీకి బోవుచో ఝాన్సీని పట్టుకొనుట దుర్లభమగును. ఇంతేకాక కాల్పీని పట్టుకొనుటకు మేముచేసిన ప్రయత్నములన్నియుగూడ భంగమైపోవును. కాల్పీనిపట్టుకొనుట సర్ హ్యూరోజు కవశ్యకర్తవ్యము. చర్ఖారీరాజుకు సహాయము చేయుట మాకోరికయే యైనను నీసమయమందు సేన లచ్చుటకు దీసికొనిపోవుట యసంభవము. మనము ఝాన్సీపైకి దండు వెడలినచో చర్ఖారీలో నున్న విప్లవకారులందరును యిచ్చటికే వత్తురని రోజుదొర విశ్వాసము. ఝాన్సీ మనపరమైనచో విప్లవకారులందరును చెల్లాచెదరై పోవుదురు. చివర కే మహారాణి యీవిప్లవకారులందరకు బ్రధాననాయకురాలై

రాణించుచున్నదో యామె నామధేయము కలుగగలదు.

ఈప్రకారము నిశ్చయించుకొని రోజుదొర తనసేనను దీసికొని మార్చి 20 తేది 7 గంటలకు ఝాన్సీ సమీపమునకు బోయెను. మహారాణికూడ సమరసన్నాహములను గావించుచుండెను. ఆంగ్లసైన్యము లపుడే ఝాన్సీని సమీపించుచుండెను. ఇంతలో ఝాన్సీరాణి కొకపత్రము కూడ దొరకెనని కొందరు చెప్పుదురు. అందులో నిట్లున్నది "*పేష్వ దివాను లక్ష్మణరావు, లాలాభావుబక్షు, మోరోపంతు* తాంబె మొదలగువారితో నాయుధరహితముగా మమ్ము కలిసికొమ్ము."

భారతవీరవనితల కింతకంటె నాత్మహత్య వేరొండు యుండజాలదు ! యుద్ధమును బ్రకటించి శత్రువు మీదకు వచ్చుటయు, నత డాయుధములను విసర్జించి తనకు మోకరింపమని యాజ్ఞాపించుటయు మానధనులగు భారతరాజకన్యలట్లు చేయుటయు భారతచరిత్రలో నెచ్చటను కనివిని యెరుగము ! ఇది లక్ష్మీబాయికి మరింత రోషమును గలిగించెను. లక్ష్మీబాయి విప్లవకారులకు నాయకురాలనియు నామెను బట్టుకొని ఖైదుచేయవలెననియే ఆంగ్లేయులు వచ్చుచున్నారనియుమరియొకవార్త తీసికొనిరాబడెను. లక్ష్మీబాయి ఆంగ్లేయులవలన ఖైదీగా గొంపోబడునట ! ఆహా ఎట్టిసాహసము!



లను' అని వఖేఖాను కామె పంపిన రణదుందుభి నామె యిం [illegible] నలకన్యమ పరాక్రమ కంఠమున ప్ర[illegible] డుట దురూహ్యము కాదే ! చివరవరకు నామె కాంగ్లప్రభుత్వముపట్ల విశ్వాసమే యుండెడిది. కనుక నామె యనవకాశముగా యుద్ధప్రయత్నములు జేయవలసివచ్చెను. కాని పరీక్షసమయము మేతెంచినపుడు లక్ష్మీబాయి యొంతమాత్రమును వెనుదీయునది కాదు. అబలయైనను లక్ష్మీబాయి ధైర్య, స్థైర్య, పరాక్రమ, ఆత్మగౌర వాత్మసంయమాదిసహసద్గుణ [illegible]జము లామె కెప్పుడు ననేకవేల సైన్యములబలము నిచ్చుచుండెను. వెంటనే యామె తన రాజకులోచిత ధర్మమగు వీరక్రీడ కుపక్రమించెను. ఝాన్సీకోట పట్టణమునకు బశ్చిమముగానున్న యొక చిన్నపర్వతముపై గట్టబడెను. అది యతి ప్రాచీనమై దుర్భేద్యమైన కోటలలో నొకటి. కోటకు నాలుగుప్రక్కల నెత్తైన రాతిగోడలు కట్టబడెను. ఈగోడలు పదునారు మొదలిరువదడుగులవరకును వెడల్పుగా నుండెను. యుద్ధసమయమందీగోడలమీద నతిసునాయాసముగా నొకస్థలమునుండి మరియొకస్థలమున కెంతపెద్దఫిరంగులనైనను దీసుకొనిపోవచ్చును.

ఫిరంగుల నమర్చుటకీగోడలపై పెద్దపెద్దబురుజులుండెను. ఇందులో గరగజమను నొకబురుజు యెనుబదడుగులపొ

డుగును, నంతేవెడల్పును నేబదడుగుల యెత్తును గలిగియుండెను. దానినలువైపులను నాల్గుఫిరంగు లమర్చబడి యుండెను. మఱియు కోటపై నచ్చటచ్చట నేబదియొక ఫిరంగు లమర్చబడెను. ఒక్కసారిగ నసంఖ్యాకులను సంహరింపగల ఘనగర్జము, భవానీశంకరు, నాల్దారు మొదలగునామములతో నొప్పునట్టి ఫిరంగు లిందులో నెన్నియోగలవు. కోటలో మహారాణి కొఱకు ప్రత్యేకముగా నొకవిశాలమహాలు గలదు. కొంత మంది సరదారులుగూడ నివసించుటకు విశాలభవనములు గలవు, కోటచుట్టు నగాధమైన కందక మొకటి యుండెను. దీనిని దాటకుండ కోటలోని కెవరును బోజాలరు. ఈవిధముగా కోటయంతయు స్వాభావికముగా దుర్భేద్యమై యుండెను. లక్ష్మీబాయి తన ధీశక్తిచేతను, ప్రజలపరిశ్రమచేతను, మరింత కట్టుదిట్టముచేసి దీనినిసదా రక్షించుచుండెను. కోటయొక్క నైరృతకోణమునకు దక్షిణముగను, వాయువ్యమూలకుత్తరపశ్చిమములుగనున్న పట్టణమునంతను రక్షించుటకు మంచివైశాల్యమును, యెత్తును గల దుర్భేద్యమైన గోడలుండెను. వానిపైనగూడ ఫిరంగు లమర్చబడెను. పట్టణవైశాల్యము సుమారు నాలుగున్నర మైళ్ళుండెను.

త్వరలో సైన్యములు సమకూర్చబడెను లక్ష్మీబాయికి తన ప్రాచీన వంశపౌరుషమును నిలువబెట్టవలెనను పట్టుదల కలిగెను. ప్రబలపరాక్రమశాలియగు శివరావుభావుకోడ



లును’ అని నథేఖాను కామె పంపిన రణదుందుభి నామె యింకను మఱచిపోలేదు. ఆమె శివరావుసేనలకన్నను పరాక్రమవంతులును, రణకుశలుడును నగు బుందేలీలను, అఫ్గనుసేనలను సమకూర్చెను. కాని తక్కినసేనమాత్ర మంతమంచిది కాదు. వారికి తగినంత శిక్షణము లేదు. వారు కేవల మాంగ్లేయులపై ద్వేషముచేతను, స్వలాభాపేక్షచేతను, దోచుకొనవలెననెడి యుద్దేశ్యముచేతను జేరిన విప్లవకారులమూక గాని మరొండు కాదు. అయినను “క్రియాసిద్ధిస్సత్వే, భవతిమహతాంనోపకరణే” అను రీతిని నామె యిట్టిసేననే తీసికొని, వారి ననేకభాగములక్రింద విభజించి విశ్వాసపాత్రులగు ఠాకురులను, బుందేలీలను నొక్కొకభాగమునకు నియమించి యుద్ధమున కాజ్ఞాపించెను. ఆమెకూడ స్వయముగా సేనల నన్నిటిని జూచుకొనుచు తగిన బందోబస్తులను వెంటవెంటనే గావించుకొనుచుండెను.

“బురుజులు కట్టుట, గుండ్లువగైరాల నందిచ్చుట, మొదలగు యుద్ధసన్నాహము నంతను స్త్రీలు చేయుచుండిరి” అని సర్ హ్యూగ్రోజు వ్రాయుచున్నాడు. అతనితోకూడ రణరంగమునందున్న డాక్టరు లో యిట్లువ్రాసెను. “మేమచ్చటకు జేరినతరువాతగూడ వారు కోట దక్షిణద్వారమునుండి కొంతదూరమువఱకును గోడలపై మూడుఫిరంగులకు బురుజుల నత్యంతతత్పరులై కట్టుచుండుటను మేము కన్నులార జూచి

ళిమి. వారు తేనెటీగలవలె కార్యనిమగ్నులై యుండిరి. నేనిం
తకు బూర్వ మెప్పుడును హిందూస్థానీయు లిట్టి చాకచక్య
ముతో బనిచేయుటను జూచియుండలేను. వారిబురుజుల నతి
త్వరితముగాను సరియైన యింజనీరింగు నిపుణతతోను తయారు
చేయగలిగిరి." ఇట్టి విపక్ష, ప్రత్యక్ష, నిష్పక్షసాక్ష్యములుండ
మన మిక లక్ష్మీబాయి యుద్ధకళావిశారదత్వము నంతగా వ
ర్ణింప నవసరము లేదు ఇక నాంగ్లసేనల విజృంభణము ప్ర
చండముగా నుండెను. మార్చి 21 తేదీని ఆంగ్లసేనాధిపతి
యైన రోజుదొర ఝాన్సీకోటను పట్టణమును, దుర్భిణీయం
త్రముతో బరీక్షించుచుండెను. అత డట్లు యుద్ధము సేయుటకు
యోగ్యస్థానము నారసి యచ్చట తన సేనలను, ఫిరంగులను
గూర్చెను. ఆతడు పట్టణములో నున్నవారికిని; కోటలోని
వారికిని, సహాయసంపత్తులను జేయుట కవకాశము లేకుం
డ మార్గముల నన్నిటిని తనయధీనము జేసికొనెను పట్టణము
యొక్క తలుపుల నన్నిటినిగూడ నతడు తనరక్షణములో నుం
చుకొనెను. ఈసమయమందే బ్రిగేడియరు స్టువర్టు సేన చందే
రీనుండి యతని సహాయార్థమై వచ్చెను. ఈసేనవలన రోజు
దొరకు మరింత ధైర్యము గలిగెను. ఆంగ్లసేనలు విడిసినచోట
వారి రక్షణార్థమై గొప్పగొప్ప కందకములు త్రవ్వించబడెను.
ఒకస్దలమునుండి మరియొకస్థలముకు తంతితీగె లమర్చబడెను
ఒకయెత్తైన పర్వతముమీద దుర్భిణీయంత్ర మొకటి స్థాపింప



బడెను దీనిసహాయమువలన ఝాన్సీకోటలో నెచ్చటెచ్చట
నేమిజరుగుచున్నదియు దెలిసిపోవుచుండెను; అచ్చట నొక
తంతికార్యాలయము కూడ నిర్మింపబడెను. ఇట్లాంగ్లేయుల
సైనికనివహ మంతయు పాశ్చాత్య యుద్ధవిద్యానుసారము
గను, నవీనాస్త్రశస్త్రాదిపరికరములతోడను సన్నద్ధమై రణ
కౌతూహలముతో గేక లిడుచుండెను.

మార్చి 23 వ తేదీని యుద్ధమారంభమయ్యెను. ఝా
న్సీసమీపమున నున్న మైదానములను చిన్నచిన్న పర్వతము
లను ఆంగ్లసేన లాక్రమించుకొని యుండెను. రోజుదొరహు
కుముల ననుసరించి వారు ఝాన్సీకోటపై గుండ్లవర్షమును
గురిపింప నారంభించిరి. కాని ఝాన్సీకోటపైనున్న లక్ష్మి
యూరకుండలేదు. కోటపైనుండి వచ్చు గుండ్లవర్షము ముం
దర నాంగ్లసేనలు తాళజాలకపోయెను. ఆరాత్రి మూడవ
యూరపియనుపటాలము ముందుకుబోయి ఝాన్సీపట్టణము
కు మూడువందలగజముల దూరములో నొకయున్నతస్థాన
ముపై దమఫిరంగుల నమర్చిరి. ప్రాతఃకాల మగుటతోడనే
కోటపైనుండి గుండ్లవర్షము మరల ప్రారంభమయ్యెను. ఘన
గర్జమను ఫిరంగినుండి యగ్నివర్షము ప్రారంభమగుటతోడనే
ఆంగ్లసేనల జోరు కట్టుబడెను. ఈఫిరంగియొక్క చిత్రమేమన
దీనినుండి వచ్చు గుండ్లవర్షముతో పాటు దిశలనన్నిటిని గప్పి
వేయు ధూమము బయల్వెడలును. దానిచే శత్రుసైన్యము

కొంతటి మోసమో సంభవించుచుండెను. ఈగుండ్లు శత్రుసేననంతను తుములముజేసి విపరీతనష్టమును కలుగజేసెను.

మార్చి 24 వ తేదీని ఆంగ్లసేనలు తిరుగ నాల్గుఫిరంగుల నమర్చి కోటకు దక్షిణభాగముపై గురిపెట్టి కొట్టనారంభించెను. ఆభయంకరఫిరంగులనుండి కోటపైనను, పట్టణముపైనను అగ్నివర్షమే కురిసెను. ఇరువదినాల్గు, యిరువదియెనిమిది పౌండరుల ఫిరంగుగుండ్లు ఝాన్సీపట్టణగోడలపై కూడబడుచుండెను. ఈభీషణాగ్నిప్రవాహముచే ఝాన్సీకోటపైనున్న వీరు లనేకమంది మడసిరి. కోటపైనున్న ఫిరంగులధ్వని యాగిపోయెను! గోడ జంకనారంభించెను! కాని యంతమాత్రముచే నాంగ్లేయుల కేమియు లాభములేకపోయెను. పట్టణమావంతయు జలింపలేదు. ఇరువక్షములవారు నినుమడించిన పౌరుషముతో బోరుచుండిరి. ఇంతలో నొక మాతృద్రోహి ఆంగ్లేయులకు ఝాన్సీపట్టణమర్మమును వెల్లడించెను; పశ్చిమదిక్కున ఫిరంగుల నమర్చి పేల్చుచో పట్టణమునకవి యెక్కుడు హానిచేయుననియు, జయము నిశ్చయమనియు నతడు జెప్పెను. ఈరహస్యము తెలియుటతోడనే ఆంగ్లసేనలతిత్వరితముగా పశ్చిమదిక్కున ఫిరంగుల నమర్చి యగ్నికందుకములను పట్టణముపై గురిపింప నారంభించిరి. అవి పడినచోట్లనెల్ల ననేకమందిని సంహరించుచు మరికొందరను శకలాంగులను జేయుచు జాల హాని కలుగజేయజొ



చ్చెను. పట్టణమంతటను హాహాకారములు బయలుదేరెను. పట్టణములోని మార్గములన్నియును గట్టుపడెను. ఈవిపత్తుకు మహారాణి చాల చింతించి దీనికి గారణములనారయుచు వెంటనే తనసిపాయిలను, యోధులను, హెచ్చరించుచు, వారి సహాయమున కింక ననేకమందిని బంపి యాంగ్లఫిరంగులనోరడంచెను. ప్రజలు మరల నిర్భయులైరి; తరువాత నామె పట్టణములో నీయనర్థముచే దీనులయిన వారికిని, అనాథలకును, అన్నదానము జేసెను, ఇంకను నిరాశ్రయులైనవారికి సదావర్తి నిప్పించెను. మార్చి 25 వ తేదీని రోజుదొర తన సేనలో కొంతభాగమును కోటకు దక్షిణభాగమున నిలిపెను. ఇదివరకు విప్లవకారుల నోడించిన సిపాయి లిందులో ననేకమంది గలరు; ఈబ్రిగేడు కోటపై కతితీవ్రముగా పరుగెత్తనారంభించెను. కాని యేమియు లాభము లేకపోయెను! మరునాడు 26 వ తేదిని రోజుదొరతిరుగ వీరిసహాయార్థము మరికొంతమందిని బంపెను. ఉభయపక్షములవారు నతితీవ్రముగా యుద్ధము జేయదొడంగిరి. రణరంగము తుములమయ్యెను. 12గంటల వేళ కోటపైని దక్షిణబురుజుమీది ఫిరంగులు కట్టుపడెను. ఆంగ్లేయులు గురిపించు గుండ్లబారి కచ్చట నెవ్వరును నిల్వలేకపోవుచుండిరి. ఎవ్వరైనను నిలువ సాహసించుచో నాంగ్లఫిరంగులు వానిని కూలవేయుచుండెను. ఇది కోటలో గొంత యలజడికి గారణమయ్యెను. ఇంతలో లక్ష్మీబాయి పశ్చిమబురుజు

మీఁదనున్న వారిని రాలించెను. వీరు దుర్భిణీయంత్రము తోఁ జూచుచు నాంగ్లేయులపై నగ్నివర్షమును గురిపించుటతోడనే ఆంగ్లయోధులు విగతప్రాణులైరి. ఆంగ్లఫిరంగులు మూలబడుటతోడనే కోటలోని మొదటిఫిరంగి మరల విజృంభించెను. లక్ష్మీబాయి యీవార్తవినిగులాంగౌసుఖాను అను తనసుప్రసిద్ధఫిరంగిపాలకుని కొకరజితకంకణమును బహుమతి నొసంగెను. ఈవిధముగా మార్చి 31 వ తేదీవరకును హోరాహోరీ యుద్ధము జరుగుచునేయుండెను. ఉభయపక్షసేనయు నొకరి కొకరు తీసిపోవుటలేదు. ఆంగ్లసైనికు లందరును పాశ్చాత్య యుద్ధకళావిశారదులు! ఆజ్ఞాధురంధరులు; వారికి సైనికశిక్షణ ముండెను; ఆజ్ఞల నెప్పటికప్పుడు తూచా తప్పకుండ బాలించుటలో వారారితేరిరి. సేనాపతులు కర్తవ్యపాలనాదక్షులు; యుద్ధనిపుణులు; మహారాణి లక్ష్మీబాయి శూరశిఖామణి; ధైర్యస్థైర్యములందు హిమగిరి; కాని యామె సేనలలో మాత్ర మెట్టిక్రమమును లేదు. కేవలము దోపిడీకొరకే వచ్చినవా రందులో చాలమంది యుండిరి. సేనాపతులలోగూడ నెన్నియో లోటులుండెను. వ్యూహముల నేర్పరచుట; ఆజ్ఞలను పాలించుట యనునవి వారెరుగరు. ఇట్టి విపరీతపరిస్థితులలో మహారాణి శౌర్యపరాక్రమములను, యుద్ధనైపుణ్యతయు వృథ యగుచుండెను. అయిన నామె తనబుద్ధిబలముచేతను, బాహుబలముచేతను పాశ్చాత్యవీరుల పీచ మడచుచుండెను. యుద్ధకళావిశారదులైన యూరపియనులుగూడ నామె యద్భుతశౌర్యమును జూచి నివ్వెరపడుచుండిరి. కోటపై నెచ్చటజూచినను తానెయై లక్ష్మీబాయి రణలక్ష్మీవలె తాండవకేళి సలుపుచుండెను. భారతయోధు లందరునుగూడిన మహాభారతయుద్ధము పదునెనిమిదిరోజులు జరిగెను. ఒక్కలక్ష్మీబాయి ప్రపంచశత్రుసైన్యముతో నెట్టిసహాయమును లేకుండ పన్నెండురోజులు యుద్ధము చేసెను. ఈవిషయమై డాక్టరు "లో" యిట్లు వ్రాయుచున్నాడు.



" During the midday heat scarcely a shop was fired by the enemy; but about 3-30 every evening they reopened upon us with considerable spirit. Round shot of various sizes bounced over our heads, and matchlock balls whizzed like pail about us. From this hour till sunset was always a panderous time, and our poor fellows were severely tried. The " garden battery" and guns on the fortgate pestered us a good deal. Near the former battery we could see scores of the enemy among the trees sauntering about as though they were superintending a quiet everyday matter of business although our shell occasionally dropped in the midst of them.

The breaching and shelling were continued with unabated spirit on the 3oth and 31st and the enemy kept up a fearful fire upon us. Notwith-

standing the damage done to their fort works upon the wall, their vigilance and determination to resist abated not one iota; on the contrary, their danger appeared to add to their courage."

"మధ్యాహ్నకాలమందు శత్రువులు మాపై నెప్పుడును గుండ్లను గురిపెట్టి యెరుగరు; కాని ప్రతిసాయంత్రము మూడున్నరగంటలకు వారు మాపైన నతితీవ్రముగా నగ్నిజ్వాలలను బంపుచుండిరి. మాశిరములపై భయంకరధ్వనితో నగ్నికందుకములు వచ్చిపడుచుండెను. వడగండ్లవానవలె మాచుట్టు నొకవిధమైన తుపాకిగుండ్లు రివ్వురివ్వుమనుచు గురియుచుండెను. ఈగంటనుండి సాయంత్రమువరకును మాకు యమసదనము గాన్పించుచుండెడిది; మాసిపాయిల కిప్పుడు ప్రాణసంకట మగుచుండెను. కోటద్వారముపైనున్న "ఆరామతువారులు" మమ్మెంతయో బాధించుచుండెను. ఆయారామసీములోని చెట్లక్రింద వందలకొలది మనుష్యులు, మాఫిరంగిగుండ్లచేతను బోయిపడుచున్నను, తమ కిది యతిసామాన్యమైన నిత్యకృత్యమో యనునట్లు నిర్లక్ష్యముగా బోవుచుండిరి. 30, 31 తేదీలలో ఫిరంగులతితీవ్రముగా గురిపింపబడి కోట భిన్నభిన్న మగుచుండెను; అయినను శత్రువులు మమ్మగ్నిహోత్రునికి బలియిచ్చుచుండిరి. కోటయు తదితరయుద్ధసన్నాహములు నొకపంక భంగ మొందుచున్నను వారు లేశమైనను చెక్కుచెదరక, పిరుదీయక, కార్యతత్పరులై మమ్మెదుర్చుచునే



యుండిరి; అపాయ మంతకంతకు వారికి మొక్కవోని ధైర్యమునే చేకూర్చుచుండెను."

ఈవిషయమును గురించియే మహారాణి యుద్యోగులలో నొక డిట్లు వ్రాసెను. "రాత్రిసమయమందు కోటలోను పట్టణములోను గొప్పగొప్ప ఫిరంగిగుండ్లు వచ్చి పడుచుండెను. ఆదృశ్యమాతయు చాల భయంకరముగ నుండెను. వందలకొలది ఫిరంగిగుండ్లు ఒక్కొక్కటి చాల శేరులు బలువు కలవి యాకాశమండలమున నెగురుచు ప్రజలలో హాహాకారములను బుట్టించుచుండెను; చూచువారి కవి యెప్పుడు తమ శిరములపై బడునో యనుభయము కలుగుచుండెడిది. రాత్రిందివము లీవిధముగా పట్టణవాసులు మృత్యుభయముతో దిన మొకయుగముగా నెట్లో గడుపుచుండిరి, ఒక్కొకపుడు మహారాణికి జయము గల్గుచు నాంగ్లఫిరంగులు నిర్వీర్యమగుచుండెను; మరియొకప్పు డాంగ్లేయులు జయించుచు మహారాణి ఫిరంగులు నిర్వీర్యమగుచుండెను; ఏడవనాటి సాయంత్రము పశ్చిమదిక్కున నున్న తుపాకులు కట్టుపడెను. అచ్చట నొక్కడును నిలువజాలక పోవుచుండిరి. ఆంగ్లఫిరంగి దెబ్బలచే కోటలోని బురుజు కాలిపోయెను; అప్పు డంధకారబంధురమై నిశీదమందు కంబళ్ళు కప్పుకొని కొందరు యోధు లారాత్రియే తెల్లవారకమునుపే బురుజులను కట్టివేసిరి; తిరుగ కోటలోని ఫిరంగులు మ్రోగ నారంభించెను.

అందువలన నాంగ్లసేనలకు యమసదనము సమీపమయ్యెను. ఎనిమిదవనాటి ప్రాతఃకాలమున మరల నాంగ్లసేనలు కోటపై గుండ్లను కురిపించెను. ఆంగ్లేయులు దుర్భిణీయంత్రముతో కోటలోను, పట్టణములోను, నెచ్చ టెచ్చట నేయోధు లుండిరో, యెట్టి యుద్ధప్రయత్నములు జరుపబడుచున్నవో మొదలగు రహస్యములను తెలిసికొనుచుండిరి కోటలో నొక చిన్న కోనేరుండుటను, అచ్చటకు నీళ్ళకొరకు ప్రజలు బోవుచుండుటను వారు తెలిసికొనిరి; వెంటనే వారు తమ ఫిరంగుల నావైపుకు ద్రిప్పి మారణకర్మ నారంభించిరి. నీళ్ళకొరకు వచ్చినవారిలో జాలమంది చనిపోయిరి: అనేకమంది భయభ్రాంతులై యటునిటు పరుగిడ నారంభించిరి; స్నానపానములకు నీరు దొరకక కోటలోనివారు తల్లడపడ జొచ్చిరి; భోజనాదినిత్యకృత్యము లాగిపోయెను. ఈసంగతి రాణి లక్ష్మీబాయి విని తోడనే పశ్చిమదక్షిణబురుజులపైనున్న ఫిరంగులను డెప్పించి శత్రుఫిరంగుల నోరడంచెను. అప్పుడు మరల ప్రజలు కోనేరుకు బోయి నీరు దెచ్చుకొని భోజనములను సలిపిరి; కాని యింతలో మరల భీభత్సము బయలుదేరెను. నలుప్రక్కలను ధూమము లావరించి కారుచీకటి క్రమ్మెను; అగ్నిజ్వాలాప్రపుంజములు చెలరేగెను. మహారాణీ మహాలు సమీపమున నున్న మైదానములోని గుండ్లకార్ఖానాకు నిప్పంటుకొనటయే యీవిపత్తునకు కారణము. దీనివలన చాలమంది చనిపోయిరి; ఇంక ననేకులు గాయపడిరి.



ఎనిమిదవరోజు యుద్ధము చాల భయంకరరూపమును దాల్చెను! ఉభయసేనలు నక్కడక్కడ పోరుచుండెను. ఫిరంగులు, తుపాకులు, మొదలగువానిధ్వనిచే నాకాశమండలము చిల్లులువడుచుండెను. పట్టణములో వెయ్యిమందిమనుష్యులు చనిపోయిరి. కొంతమంది ప్రాణరక్షణార్థమై రహస్యస్థలములలో దాగొనుచుండిరి. పట్టణగోడలపై నున్న సిఫాయిలును, ఫిరంగులను పేల్చు శూరులును జాలమంది చనిపోయిరి, వారిస్థానము లెప్పటికప్పుడు భర్తీచేయబడుచుండెను. నూతనసిపాయి లతిచురుకుగా బనిచేయుచుండిరి ఈయుద్ధసన్నాహము నెప్పటికప్పుడు మహారాణియే గావించుచుండెను. ఎచ్చట నేమాత్రము జంకుపుట్టిన నామెయే స్వయముగా బోయి సేనలను బలపరచుచుండెను. ఈకారణముచే నామె సేన లత్యుత్సాహముతో ఘోరయుద్ధమును జేయుచుండెను. ఆంగ్లేయు లెంతటిశూరులైనను 31 తేదీవరకు కోటలోని కడుగు పెట్టజాలకుండిరి.’’

మహారాణి లక్ష్మీబాయి యింగ్లీషువారితో యుద్ధము చేయుటకు తప్పనిసరియైన వెంటనే రావుసాహెబు పీష్వాకు సహాయార్థమై యొకజాబు వ్రాసి పంపెను. పీష్వా తన సేనాపతి యగు తాంత్యాతోపె నిరువదివేల సైన్యముతో బంపెను. తాంత్యాతోపె కాల్పినుండి బయల్వెడలి ఝాన్సీప్రాంతముకు వచ్చుసరికి బ్రిటిషువారికిని ఝాన్సీకిని రణయుద్ధము జరు

గుచుండెను. రోజుదొర కీవార్త తంతిద్వారా తెలియుటతో డనే యతడు నిర్ఘాంతపోయెను: "ఇట్టి విషమపరిస్థితులలో నేమిచేయవలయును." అని యతడు విచారించుచుండెను. తాంత్యాతోపె ఝాన్సీతో గలసినచో నిక నాంగ్లేయులకాశలేదు. ఆంగ్లసేన లెక్కువగా లేవు; ఉన్నవారందరును కోటను ముట్టడించుటకే సరిపోవుచుండ క్రొత్తశత్రువు నెదుర్చుట కష్టముగా నుండెను. "ఈసహాయముతో మహారాణి మాలోనొక్కరినిగూడ ప్రాణములతో బారిపోనీయక బలిపుచ్చుకొనును. ఇట్టిస్థితిలో నపజయమే యదార్థము" అని రోజుదొర చింతించుచుండెను. కాని యతడు మహాశూరుడు; బహుచతురుడు; మహాబుద్ధిశాలి; అతడు తనసేనను రెండుభాగములుగ విభజించెను; 31 తేది రాత్రిసమయమం దతడు కొందరుశూరులను గుప్తమార్గమున బంపి కాల్పీనుండి వచ్చు రస్తాలో నిలువబెట్టెను. 24 పౌండర్లఫిరంగుల నిచ్చి ఓర్ఛామార్గమున గొంతమంది సైనికులను నిలువబెట్టెను. పట్టణములోనివారు బయటకు రాకుండ జేసెను. రాత్రియంతయు గోటపై గుండ్ల వర్షము కురియుచునే యుండెను. ఆంగ్లసేన తగ్గిపోయినసంగతి కోటలోనివారికి తెలియనే తెలియదు. ఈవిధముగా సర్ హ్యూరోజు రెండుసేనలతోను బోరాడనారంభించెను. తాంత్యాతోపె బహుపరాక్రమశాలి; 1858 లో జరిగిన స్వాతంత్ర్య యుద్ధవీరులలో నతిముఖ్యపురుషుడు; నానాసాహెబు స్వాతం



త్ర్యయుద్ధమును బ్రకటించుటతోడనే తాంత్యాతోపె వానికి నాయకుడై యనేకయుద్ధరంగములలో ప్రభుత్వమువారితో హోరాహోరీయుద్ధమునకుడికొనెను. తాంత్యాతోపె పేరు యూరపంతటను మారుమ్రోగసాగెను. ఇతనినిగూర్చి "డైలీన్యూసు" అనునొక పాశ్చాత్యపత్రిక యిట్లు వ్రాసెను. "తాంత్యా మహారాష్ట్రజాతి బ్రాహ్మణుడు. అత డుత్తమకులజుడు కాడు. అతడు దోపిడీచేయుట, బందిపోటులు వేయుట మొదలగువాటియందు ప్రావీణ్యత సంపాదించెను. అతడు చాల బుద్ధిమంతుడు; కాని చదువను వ్రాయను రాదు. అతడు యుద్ధకళానిపుణుడు; ఈకారణముచే నతని నందరును సన్మానించుచుండిరి. అతడు మహాబలశాలి; అతని శౌర్యపరాక్రమాదుల కాశ్చర్యపడుచు సైనికులందరు నతనిని జూచుటతోడనే యతని వశమైపోవుచుందురు, అతడు నలుబది వత్సరముల లోపువాడు; అతిసాహసుడు; నిర్భయుడు; అతని ముఖకాంతి శౌర్య, తేజస్సులచే నలరారుచుండును. ఆ నేత్రద్వయ మిందీవరకాంతులను గ్రక్కుచుండును; అతడు మామూలువస్త్రములనే ధరించును. అతని నెల్లప్పుడును పాతికముప్పదిమంది యంగరక్షకులు కాపాడుచుందురు. అతడెల్లపుడు నశ్వారూఢుడై యుండును; అప్పుడప్పుడు పల్లకి నెక్కిపోవుచుండును; అతడు నానాసాహెబు ప్రతినిధి నని చెప్పుకొనుచుండును" మరియొక ఆంగ్లగ్రంథకారు డతనిని హిందూ గారి బాల్డియని ప్రశంసించెను.

ఏప్రిల్ ఒకటవ తేదీ నాంగ్లేయులకును తాంత్యాతోపెకును యుద్ధ మారంభమయ్యెను; కాని పీష్వాపంపిన యీ సేనకాన్పూరులో కప్తాను విండ్హాము నోడించితి మను విజయగర్వముతో నైమరచి యుండిరి. ఆంగ్లసేన లతిస్వల్పముగా నున్నవనియు, తా మసంఖ్యాకముగా నున్నార మనియు, నింగ్లీషుసేనలు తమ్ము జూచుటతోడనే సహజముగా పారిపోవు ననియు, వా రూటలాడుచుండిరి. తాంత్యాతోపె స్వంతసేన యున్నిటికంటెను చివర బేత్వానదియొడ్డున నుండెను; చర్ఖారీరాజు నోడించితి మను దుర్భ్రమతో తలతిరిగి వా రుండిరి. వా రాంగ్లేయుల యుక్తినావంతయు గ్రహింపరైరి! పీష్వాసేనలో నొకభాగము కోటలోనివారికి సహాయము జేయుట కతితీవ్రతతో ముందుకు బోయెను; కాని వా రాంగ్లేయుల సరిహద్దులోనికి బోవుటతోడనే కప్తాను లైటుఫుటు గుఱ్ఱపుదళము దక్షిణము నుంచియు, కప్తాను ఫ్రైటీజాను పటాలమొకప్రక్క నుంచియు, మరియొక ప్రక్కనుండి రోజు దొరపటాలమును వారిని ముట్టడవేసెను. పీష్వాసైన్య మీ భయంకరదృశ్యమును జూచి భయభ్రాంతులై యటు నిటు పరువిడజొచ్చిరి; తాంత్యాతోపె ఫిరంగులుమాత్ర మాంగ్లేయులపై నగ్నివర్షమును గురిపించెను కాని లాభములేకపోయెను. రెండువైపులనుండి ఆంగ్లపటాలములు, ఫిరంగులు, గుఱ్ఱపుదళములు, విజృంభించి మీదపడుటతోడనే పీష్వాసైన్యము



ప్రక్కబలము జూప నారంభించెను. చివరకు తాంత్యాతోపె సైన్యముకూడ నేమియు చేయజాలకపోయెను; ఆంగ్లసేనలు వారిపైబడి వారిని తరుమగొట్టెను. అనాయాసముగా వారి యుద్ధసామగ్రి యంతయు నాంగ్లేయుల వశమైపోయెను. ఇందువలన నాంగ్లసేనలకు మరింత బలము చేకూరెను.

లక్ష్మీబాయి యాశలన్నియు నడియాశలయ్యెను; పీష్వాసహాయమువలన విజయము ప్రాప్తించు నని యామె తలంచుచుండెను. ఈ యాశలన్నియు నాశనమగుటయే గాక పీష్వాసైన్యములోని యుద్ధసామగ్రి శత్రువుల చేతులలో బడుటచే ఝాన్సీకి మరింతకష్టము సంభవించెను. పదిరోజులనుండి యొంటిగా హోరాహోరీయుద్ధము జేయుచున్న ఝాన్సీసైన్యము లలసిపోయెను; అనేక యుద్ధభూములలో నఖండవిజయములను బడసిన తాంత్యాతోపె యిప్పు డోడిపోవుట విధికృతము కాబోలును!

సర్ హ్యూరోజు యీవిధముగా తాంత్యాతోపె నోడించి ఝాన్సీకోటను బట్టుకొనుటకు గృతనిశ్చయు డయ్యెను. పన్నెండు రోజులనుండి యాంగ్లసేనలు కోటపై శతఘ్నులను గురిపించుచున్నను మహారాణి నిరుపమాన పరాక్రమముచే శత్రువుల కది సాధ్యము గాకయుండెను. ఈసారి రోజుదొర యొక క్రొత్తవ్యూహమును బన్నెను. అతడు సేననంతను మూడుభాగములుగ విభజించి మూడువైపులనుండి కోటను

ముట్టడించెను. మేజరుగాలు పశ్చిమదిక్కున సైన్యాధిపత్యము వహించెను. దక్షిణదిక్కున లెఫ్టినెంటు కలనల్ లిడెల్, కప్తను రాబిన్‌సన్, బ్రిగేడియరుస్టువర్టు లుండిరి; లెఫ్టినెంటు కలనల్ లోడ్, మేజరుస్టువర్టులు మఱియొకవైపున నుండిరి. ఈసేనయంతయు రహస్యముగా తయ్యారై తమ తమ నియమిత స్థానముల నాక్రమించిరి. మొదటిభాగము నిచ్చెనలతో కోటగోడల నెక్కి లోపలికి దిగవలె నని ప్రయత్నించుచుండిరి. కోటపహరా యీసంగతి గ్రహించుటతోడనే భయసూచకవాద్యములను, మ్రోగించి కోటలోనివారిని మేల్కొలిపిరి. కోటలో నున్నవారిగతి దుఃఖదాయకముగ నుండెను. యుద్ధము ప్రారంభమైనది మొదలు వారగ్నివర్షములో దపించుచుండిరి; కోటగోడలు చాలవరకు కూలిపోయెను; అనేకమంది వీరులు యుద్ధములో మరణించిరి; పీష్వాసేన ఓడిపోయెనను సంగతి వినుటతోడనే వారికి మఱింత నిరాశ జనించెను. ఇట్టి నిరాశ, ఉదాసీనతయొక్క మూల భాధించుచున్నను లక్ష్మీబాయి తన ధైర్యనిశ్చయములను వీడలేదు. ఆమె సరదారులను, అధికారులను, సిపాయిలను, బిలిపించి వారి నిట్లు ప్రోత్సహించెను. "నేటివరకును మీ రేయేయుద్ధరంగములలో జయపరంపరలను గాంచిరో వానిని పీష్వాసైన్యసహాయము లేకుండగనే మీ బలపరాక్రమములచేతనే మీరు సంపాదించిరి. నేటివరకును మీరు



జూపించిన ధైర్య, పరాక్రమ స్వాభిమానములనే నేడును బ్రకటించి మీజీవితములను సార్థకము జేసికొనుడు; రణకంకణములను ధరించి యుద్ధమునకు దలపడుడు. ఝాన్సీరక్షణము మీచేతులలోనే యున్నది. మీరు పీష్వాసహాయము నావంతయు నపేక్షింప వలదు" ఆమె యీప్రకారము వారినందరను ప్రోత్సహించి వారిలో ముఖ్యమైన సరదారు లందరకును స్వర్ణకంకణములను, వస్త్రాలంకారములను బ్రసాదించెను. ఈయుత్తేజకరములగు వాక్యములను విని ఝాన్సీకొఱకును, లక్ష్మీబాయికొఱకును, దేశమాతకొఱకును దామెన్నిసారులైనను జనిపోవుటకు సిద్ధముగ నున్నారమని శూరులైన బుందేలీలును, ఠాకురులును, మహారాష్ట్రులును, మసల్మానులును యుద్ధమునకు దిగుగ సిద్ధమయిరి; సుప్రసిద్ధఫిరంగి వేట్రుకాడగు గులాంగౌస్‌ఖాను పెద్ద పెద్ద ఫిరంగులను కోటపై నమర్చి యగ్నిగోళముల నాంగ్లేయులపై గుప్పింప నారంభించెను. కువర్ ఖుదాబక్షు మొదలగు ననేక సరదారులుగూడ తమ తమ స్థానములనుండి శత్రుసంహారమునకు గడంగిరి. రాణీ లక్ష్మీబాయి సంగ్రామదేవతవలె కోటయంతటను దిరుగుచు సమరసన్నాహములను స్వయముగా గావింపుచుండెను. ఆ రాత్రి భయంకరసంగ్రామము జరిగెను ఆంగ్లఫిరంగులనుండి వచ్చు నగ్నిగోళములు కోటగోడలను భేదించుచుండెను. రాజమహాలునకుగూడ జాలనష్టము కలిగెను; అందులోనున్న

గణేశవిగ్రహము ముక్కముక్కలై పోయెను; నలుగురు చని
పోయిరి; మహాలులోని వారు హా హా కారములను జేయదొడ
గిరి; ఏమి చేయుటకును దోచక వారిలో ధైర్యము నశించు
చుండెను. కాని లక్ష్మీబాయి మాత్ర మావంతయు జలింప
లేదు; ఆమె శత్రుసంహారక్రియాకౌతూహలమును జూపు
తన ఖడ్గరాజమును నడుమునకు వ్రేలగట్టి ప్రతిఫిరంగిదగ్గరకు
ను బోయి సరదారుల కుత్తేజమును గలిగించుచుండెను. మ
హారాణి గంభీర, ధైర్యవచనములచే ఝాన్సీసైన్యము తిరుగ
ఘోరయుద్ధమును జేయ నారంభించెను.

ఆంగ్లేయులపై కోటగోడలపైనుండియు పట్టణగోడల
పైనుండియు, నగ్నిగోళములు నిరంతరాయముగా వర్షిపడు
చుండెను. ఆకాశమండల మగ్నిమండల మయ్యెను. తుపాకి
గుండ్లదెబ్బలు, ఫిరంగిగుండ్లవర్షము, నితరానేక శస్త్రాస్త్ర
ప్రహారణములు, శత్రుసైన్యము నురుమాడుచుండెను. ఇట్టి
స్థితిలో లెప్టినెంటు మికల్ జాన్, లెప్టినెంటు బేగ్స్, లెప్టినెం
టు బాక్సు మొదలగు నాంగ్లేయులు కొందరు ప్రాణములను
త్యజించి కోటగోడలు కెగబ్రాకవలెనని నిచ్చెనలలో బ్రయ
త్నించుచుండిరి. కాని లోపలనున్న శూరుల ప్రతాపాగ్నికి
వారొక్క నిముషమైనను దాళజాలక పోవుచుండిరి. పట్టణ
గోడలు, ముఖ్యబురుజులు మొదలగున వతిసాహసముతో
గాపాడబడుచుండెను. ఇంతలో లెప్టినెంటు సిక్, మికల్ జాన్



మొదలగు శూరు లగ్నిమండలమును ఛేదించుకొనుచు పట్ట
ణగోడల నెక్కి తమసేనలను గూడ బిలువనారంభించిరి. కాని
వాయువేగముతో రెండుఫిరంగు లాయిద్దరుశూరులను చూర్ణ
ము జేసెను; తరువాత లెప్టినెంటు బోనస్, బాక్సులు వచ్చిరి.
వారును వెంటనే యమసదనమున కంపబడిరి. దక్షిణతట్టున
లెప్టినెంటుడిక్ పరాభవము నొందుటతోడనే బ్రిక్ మన్, బ్రి
గేడియరుస్టువర్టు, కలనల్ లోథ్ మొదలగువారు యిరువదియైదు
అరువదిమూడు నెంబరు కాల్బలముల సహాయముతో ఓర్చా
వైపునన్న ఝాన్సీపట్టణమును వశపర్చుకొనిరి. ఈస్థితి
జూచి మహారాణి సైన్యము మరింతధైర్యము దెచ్చుకొని
ప్రాణములపై మోహమును విడిచి యాంగ్లసేనను నరికి
వేయజొచ్చెను; కాని ఆంగ్లసేనలు మిడుతలదండువలె వచ్చి
పడుచుండెను. చివరకు వారా ప్రాంతమును వశపర్చు
కొనిరి.

ఈవార్త వినుటతోడనే దక్షిణపువైపున నున్న ఆంగ్లే
యులుకూడ తిరుగ ధైర్యము తెచ్చుకొని కాశికోకలు బిగించి
కోటగోడలపైకి విజృంభింప నారంభించిరి; కోటగోడలకు
నిచ్చెనలు వేయబడెను. గోడలను రక్షించుచున్న బుందేలీ
లందరు నొక్కుమ్మడి వారిపైబడి వారిలో ననేకమంది నంత
మొందించిరి; కాని వారుకూడ కోటను చివరవరకును గా
పాడజాలకపోయిరి కొలదికాలములో వెయ్యిమంది యాంగ్లే

యులు కోటగోడలపై గాన్పించిరి ఈవిజయములో దూలా
జీయను నొక బుందేలీ యాంగ్లేయుల కెంతయో సహాయము
జేసెను; అతని రాజభక్తికి మెచ్చి యింగ్లీషువారు రెండుగ్రా
మముల నతనికి జాగీరుగా నిచ్చిరట!

ఓర్ఛాదర్వాజా కూలిపోవుటతోడనే సర్ హ్యూగ్రోజు ఝాన్సీసేనల నచ్చటనుండి పారద్రోలెను; అత డాబురుజుపై తన యధికారముద్ర చెలాయించెను. అచ్చటనుండి పట్టణములోనికి బోయి రాజమహాలును బట్టుకొనవలెనని యతడు నిశ్చయించుకొనెను.

మహారాణి కోటపైనున్న బురుజుల నన్నిటి స్వయముగా జూచుచు సైనికులను బ్రోత్సహించుచుండెను. పట్టణముయొక్క దక్షిణద్వారమును శత్రువు లాక్రమించి శత్రుసైన్యము పట్టణమున బ్రవేశించి రనువార్త వినుటతోడనే లక్ష్మీబాయి క్షణము దుఃఖితురాలయ్యెను; ఆమె కొంతసేపు కర్తవ్యమును గూర్చి చింతించుచు, తల వంకించుచు నూరకుండెను. పన్నెండురోజులు ఘోరయుద్ధము జరిగినను, చివరకు శత్రువే జయించెను. ఆమె కోటగోడలపై నిలచి పట్టణముయొక్క దక్షిణభాగమును బరీక్షించిచూచెను. వెయ్యిమంది తెల్లసిపాయిలు పట్టణమును బ్రవేశించిరి; పట్టణవాసులు హాహాకారములను జేయుచుండిరి. ఈదృశ్యమును జూచుటతోడనే యామె మనస్సు క్షోభించెను! వదనకమలము మ్లాన



మయ్యెను! నేత్రద్వయమునుండి రజతబిందువులు రాలెను! కాని యామె ధైర్యము నెంతమాత్రమును వీడక యిట్లు చింతింపదొడగెను. 'ఈశరీర మనిత్యము! దీని నేనాడైనను వీడక తప్పదు! భీరుత్వమును జూపుట కాపురుషలక్షణము! రణరంగమున బ్రాణముల నర్పించి వీరశయనము నలంకరింపవలెను! లేదా జయలక్ష్మిని జేపట్టవలెను! యుద్ధమున వెన్నిచ్చిపారువాడు మూఢుడు! గతిలేనివాడు! రణక్షేత్రమున వసువుల నర్పించువాడు వీరస్వర్గము నలంకరించి ముక్తుడగును. జయాపజయములు, కీర్త్యపకీర్తులు, లాభనష్టములు దైవాధీనములు. కార్యసిద్ధియైనను గాకున్నను పురుషకారమును జూపుటే మానవలక్షణము.''

హతోవా ప్రాప్స్యసే స్వర్గం। జిత్వావా భోక్ష్యసేమహీం।
తస్మాదుత్తిష్ఠకౌంతేయ । యుద్ధాయకృతనిశ్చయః
సుఖదుఃఖే సమేకృత్వా । లాభాలాభౌ జయాజయౌ।
తతోయుద్ధాయయుజ్యస్వ । నైవంపాప మవాప్స్యసి॥

అను గీతావాక్యసార మీసమయమం దామెకు జ్ఞప్తికి వచ్చెను. వెంటనే లక్ష్మీబాయి శౌర్యమును వహించి యుద్ధమునకు దలపడెను. చిరకాలమునుండి మహారాణియొద్ద 1500 మంది అఫ్ఘనులు సేవజేయుచుండిరి. ఆమె వారిని దీసికొని నడుమునకు కాశికోక బిగించి యామిషముపై కురుకు సింహపుపిల్లవలె కోటగోడలను లంఘించి పట్టణ దక్షిణద్వా

రమువైపు కురుకుచుబోయెను. దక్షిణద్వారమును భేదించి పట్టణమును బ్రవేశించిన తెల్లసిపాయిలతో నామె ఘోర సంగ్రామమును జరిపెను. ఆమె దక్షిణహస్తమున కరవాలమును బూని తన యశ్వరాజము నధిరోహించి వాయువేగమున బోవుచుండ వెనుక నాఫ్ఘనుసేన వచ్చుచుండెను. ఆఫ్ఘను సేనలోని యోధులు తమకు దొరకిన తెల్లసిపాయల నందరిని కరవాలముల నరకివేయుచుండిరి. కత్తియుద్ధమున నాఫ్ఘనులతో బోరి జయించుట దుర్లభమని యాంగ్లేయులు పిక్కబలమును జూపింపసాగిరి. వారు వెంటనే యిండ్లపై కెక్కి మహారాణి సైన్యముపై తుపాకులను కాల్చుచుండిరి. వెనుక ప్రక్కనుండి యాంగ్లసైన్యము లింకను తండోపతండములుగా పట్టణములోనికి వచ్చి పడుచుండెను. వారుకూడ మహారాణి సైన్యముతో తల్వారుయుద్ధమునకు తలపడలేక దూరమునందియే తుపాకిగుండ్లవర్షమును గురిపించుచుండిరి. ఇట్లిరుప్రక్కలనుండియు మహారాణి సైన్యముపై గుండ్లవర్షము గురియుచుండెను. ఇంతలో నొక వృద్ధసరదారు మహారాణిని సమీపించి చేతులు జోడించి యిట్లు ప్రార్థించెను. "మన మింకను ముందుకుబోయి శత్రువుల గుండ్ల కాహుతియగుట మంచిది కాదు. తెల్లసిపాయలు యిండ్లపై కెక్కి తుపాకులను మనపై వేల్చుచున్నారు వీరుగాక వెయ్యిమంది తెల్లసిపాయలు పట్టణమున బ్రవేశించియున్నారు. పట్టణద్వారము లన్నియు దెరువబడియున్నవి. ఇట్టిస్థితిలో నిచ్చట మనము పోరుసలుపు టెంతమాత్రము లాభదాయకము గాజాలదు. మనము కోటలోనికిబోయి భావికర్తవ్యమునుగూర్చి విచారించు టింతకంటె శ్రేయస్కరము" మహారాణి యీవృద్ధునివాక్యములను వినితన సేనతో మరల కోటకు మరలెను.



ఇక నాంగ్లేయులు నాలుగుమార్గములనుండియు పట్టణమును బ్రవేశించి హననకర్మను ప్రారంభించిరి; వారు కనబడిన భారతీయుల నందరను ఖడ్గమునకుగాని, గుండుదెబ్బలకుగాని బలివేయ ప్రారంభించిరి. ఐదుయేండ్ల బాలునిమొదలు తొంబదియేండ్ల ముసలివరకును వారెవరిని విడచిపెట్టలేదు, పట్టణమంతయు 'విజనము' గావింపబడెను. పట్టణమున కొకమూల నిప్పంటించిరి; నగరవాసులందరు దిక్కులేక నల్లాడుచుండిరి. పట్టణమంతయు రోదనములతో నిండిపోయెను. కొంతమంది పురుషనామధారులు స్త్రీవేషములను ధరించి తమప్రాణములను దక్కించుకొనిరి; అనేకులు హతప్రాణులైరి. చాలమంది పట్టణమధ్యమున నొక తోటలో జేరిరి. తెల్లసిపాయిలచ్చటకు వచ్చుటతోడనే వారు చేతులుజోడించి దీనములై యిట్లు ప్రార్థించిరి. "మే మీపట్టణవాసులము; మేము యుద్ధముచేయువారము కాము; విప్లవకారులము కాము, మేము నిరపరాధులమైన ప్రజలము మీరు కృపాపూర్ణులై మాకు ప్రాణదానమును జేయ ప్రార్థించుచున్నాము"

ఈదీనవచనములకు కరగి యొక ఆంగ్లోద్యోగి వారి కభయహస్తము నిచ్చెను ఆతోటకు నాల్గువైపులను కాపలా యుంచబడెను. పైనుండి లోపలికిని లోపలినుండి పైకిని బోవుటకు వీలులేకుండ చేయబడెను. మరియొకవంక తెల్లసిపాయిలు ప్రజల యిండ్లలోనికి దూరి దొరకినవారిని చంపివేసిరి. వారిధనమునంతను జిత్తము వచ్చినట్లు కొల్లగొనిరి. యజమానులు తమంతతాము ధనసంపత్తునంతను దెచ్చి సమర్పించుచో ప్రాణములతో నుండవచ్చును; లేదా ఖడ్గమో, తుపాకియో వారి నంతమొందించును; మరియొక చిత్రవధకూడ గలదు. గుడ్డను మెడకుజుట్టి వ్రేలాడదీయుట! ఎవడైన తన ధనమునంత నిచ్చివేసి ప్రాణములను దక్కించుకొని బయట పడి తిరుగ మరియొకసిపాయి చేతిలో బడినచో నొక్క కత్తి వ్రేటుతో నతనిశిర మెగురగొట్టబడుచుండెను.

శిశువులును, స్త్రీలును, మాత్రము రక్షింపబడిరి. కాని చాలమంది కులవనిత లీఘోరములనుజూచి మానహాని కలుగునను భయముచే నాత్మహత్యలను జేసికొనిరి. చాలాచోట్ల పతివ్రతలెందరో తమభర్తల నాంగ్లసిపాయిలు గుండ్లతో గాల్చునపుడు తామే వారికి ముందుగానిలచి తమ ప్రాణములను విడుచుచు కొద్దినిమిషములైనను తమభర్తల ప్రాణములను గాపాడుచు ధన్యలగుచుండిరి. ఈవిధముగా నా దినమంతయు ఝాన్సీపట్టణములో నిరాటంకముగా నరహత్య



లెప్టినెంటుబేగ్రి కోటను ముట్టడించెను. కోటలో నంతయు నిశ్శబ్దముగా నుండెను. అచ్చట మనుష్యజాడ యెచ్చటను గాన్పించుటలేదు. యుద్ధము లేకుండగనే కోట ఆంగ్లేయుల హస్తగతమయ్యెను. కోటపై బ్రిటిషుజండా యెగురవేయబడెను. మహారాణితో కోటనువీడివచ్చిన చిన్నసేన పట్టణద్వారముకు వచ్చుటతోడనే సర్కారుసేనతో యుద్ధముచేయవలసివచ్చెను. ఉభయసేనలు నొకరికొకరు తీసిపోకుండ ఘోర యుద్ధమును జేసెను. మహారాణి ఆఫ్ఘనుదళమును, సరదారులును, ప్రాణములపై నాశనువీడి యుద్ధముచేసిరి. చివర కందరును యుద్ధములో చనిపోయిరి. మోరోపంతు రాణివెనుక నొక యేనుగపై చాలధనమును దీసికొనిపారిపోవుచు దతియా చేరెను. దతియారాజు అతనిని పట్టుకొని ధనమునంతను జప్తుచేసి వానినాంగ్లేయులకు నప్పగించెను. అతడు ఝాన్సీ తీసికొనిపోబడెను. హేమిల్టను, సర్ హ్యూరోజుల ఆజ్ఞప్రకార మతడు పట్టపగలు రెండుగంటలకు రాజమహాలువద్ద నురితీయబడెను. ఆహా! ఝాన్సీరాజ్యము నేలిన మహారాణితండ్రికి జివర కెట్టి దుర్మరణము వాటిల్లెను!

ఝాన్సీదోపిడీ—"విజయము"

మహారాణి లక్ష్మీబాయి ఝాన్సీ విడచి వెళ్లుటతోడనే ఆంగ్లేయులు కోటను నగరమును తమవశము జేసికొనిరి; ఆంగ్లసేనలు ఝాన్సీలో జరిపిన యత్యాచారములు ఝాన్సీ ము

న్నెన్నడును గనివిని యెఱుగదు. తెల్లసిపాయిలు ఝాన్సీపురవాసులను వందలకొలది సునాయాసముగా దయాదాక్షిణ్యశూన్యముగ గుండ్లతో నెగురగొట్ట నారంభించిరి. దయాదాక్షిణ్యములను వారు థేమ్సునదిలోనే విడచిపెట్టిరి. ఝాన్సీలో నిప్పుడు యుద్ధముచేయు వీరు లెవ్వరును లేరు; కనుక తెల్లసిపాయిలు కనుపించిన నిరపరాధులును, నిరాయుధులును నగు పురవాసులనందరను గుండ్లవర్షముచే జంపివేసిరి; ఝాన్సీప్రజల దురవస్థను వర్ణింప తరముగాదు! ఒకప్రక్క నగ్నిహోత్రుడు పట్టణమునంతను భస్మీపటముల జేయుచుండెను; మరియొకవంక నాంగ్లసిపాయిలు మానవజీవితముల క్షణభంగురతను తెలియజేయుటకు వచ్చిన యమదూతలవలె ప్రాణముల నాహుతిగొనుచుండిరి. ఇంకొకతట్టున నాంగ్లసిపాయిలు ఝాన్సీపట్టణప్రాచీనవైభవమునంతను కొల్లగొనుచుండిరి. దోపిడీలు, నరహత్యలు, అగ్నిహోత్రప్రవలు-ఇవియే యెచ్చటజూచినను కాన్పించుచుండెను. పట్టణమంతయు శ్మశానసదృశ మయ్యెను. శవములు కుప్పలుకుప్పలుగా రోడ్లమీద పడుచుండెను. గాఢమైనగాయములు తగిలినవా రచ్చటనే కూలబడి మూల్గుచు ప్రాణములను విసర్జించుచుండిరి; తిండిలేక నల్లాడుచున్న దరిద్రులు వీధులవెంట బిచ్చముకొరకు రోదనము చేయుచుండిరి.

ఏనుగులు, గుఱ్ఱములు, లొట్టిపిట్టలు మొదలగుజంతు



వు లన్నియు యజమానులులేక చెల్లాచెదరై గంతులువేయుచుండెను. మనుష్యులకు రక్షణ లేకయుండెను; కొందరు గడ్డిమేటిలలో దాగొనిరి. ఆంగ్లసిపాయి లది కనిపెట్టి వానిని తగులబెట్టిరి. మరికొందరు నూతులలో దాగియుండిరి; కాని యచ్చటకూడ వారికి రక్షణ లేకపోయెను.

ఈవిధముగా ఝాన్సీలో మూడుదినములు యమదూతలు రాజ్యముచేసి "విజనము" గావించిరి. ఆంగ్లసైన్యము తమశౌర్యపరాక్రమములకు ప్రతిఫలముగా ఝాన్సీని కొల్లగొనుట కాజ్ఞ బడసిరి; కాని సైనికు లంతకుపూర్వమే దోచుకొనుట కారంభించిరి. బంగారము, వెండి, నానావిధజవాహిరి మొదలగు సమస్తవైభవము నెవరికిదొరికినది వారు లక్షలకొలది దోచుకొనుచుండిరి. మూడవదినమున రాజమహాలును దోచుకొనువంతు వచ్చెను. రాజమహాలులో ననేకపురుషాంతరములనుండి సేకరింపబడిన సంపత్తు కలదు. పీష్వాలకు బుందేలీరాజులు సమర్పించిన యమూల్యములగు రత్నములును, పన్నా రాజ్యమునుండి తీసికొనబడిన యప్రిలిమాన వజ్రవైడూర్యములును యుండెను. సర్కారుసేన రాజమహాలులో బ్రవేశించి దోచుకొనుటకు వీలున్నంతవరకు దోచుకొని మిగిలినవానిని ధ్వంసము చేసెను. ఈయన్నింటినిమించిన దారుణము మరియొకటి జరిగెను. ఝాన్సీలో నత్యంతప్రాచీనగ్రంథాలయ మొకటి యుండెను. ఇందులో

హస్తలిఖిత ప్రాచీన గ్రంథములు లక్షలకొలది యుండెను. ఝాన్సీయొక్క ప్రథమసుబేదారు రఘునాథరావు మొదలు మహారాజా గంగాధరరావు వరకు నున్న రాజు లందరును ప్రాచీనగ్రంథములను సంగ్రహించుట కనేకవేలరూప్యములను వెచ్చించిరి. నాలుగు వేదములును, భాష్యములును, సర్వశాస్త్రములును, వాని భాష్యములును, స్మృతులును, వాని టీకయు, నన్నిపురాణములును నందుండెను. ఇట్టిధర్మశాస్త్రములు మాత్రమేకాక వైద్య, జ్యోతిష, నాటకాలంకార గ్రంథరాజములు మొదలగునవియు, బహువ్యయప్రయాసలతో, సంగ్రహింపబడెను. ఝాన్సీ చుట్టుప్రక్కల నాలుగైదువందలమైళ్ల దూరములో నెచ్చటేని యొక యపూర్వ ప్రాచీన గ్రంథముగాని, నవీన గ్రంథముగాని, కలదను సమాచారము తెలిసినచో వెంటనే లేఖకు లచ్చటకు బంపబడుచుండిరి. వారు నకళ్లు వ్రాసి తెచ్చుచుండెడివారు. ఈ పుస్తకాలయములో నున్న పుస్తకములను జూచుకొనుట కప్పుడప్పుడు కాశీనుండికూడ పండితులు పోవుచుండిరి.

ఇట్లతి వ్యయప్రయాసలతో జేకూర్పబడిన యీపుస్తకాలయ మొక్క త్రుటికాలములో నాంగ్లశూరశిఖామణులచే ధ్వంసము గావింపబడెను! ఆపుస్తకములలో గూడ ఝాన్సీసైన్యము దూరియుండెనని యాంగ్లేయులు తలంచిరి కాబోలును! ఝాన్సీలో దోచుకొనబడిన వజ్ర,వైడూర్య, మరకతమాణిక్యములను, వెండికుర్చీలను, నానావిధ వైభవమును పునస్సృష్టించుకొనవచ్చును! కాని యీప్రాచీనహస్తలిఖిత గ్రంథ సంపత్తును దిరుగ సేకరించుట యెవరితరమును గాదు!



కోట కొల్లగొనబడెను; పట్టణము శ్మశానవాటిక చేయబడెను; రాజమహలు భస్మము చేయబడెను; పురాతన పుస్తకాలయము బుగ్గిచేయబడెను; ఇది చాలక నాంగ్లసేనలు మహాలక్ష్మీదేవి మందిరమును జేరి యందలో నన్న సర్వభూషణములను దోచుకొనిరి; పిదప నది చూర్ణీకృతము గావింపబడెను.

మూడురోజు లాంగ్లసిపాయిలిల్లు తృప్తితీర దోచుకొనిరి. నాల్గవదినమున మద్రాసుపటాలములు శేషించిన రాగి, యిత్తడి కంచు మొదలగు లోహపాత్రలను దోచుకొనిరి; వీరితరువాత హైదరాబాదు పటాలములు వస్త్రములను దుస్తులను దోచుకొనిరి; ఇతరులు తమకు దొరకినవానితో సంతృప్తి పొందిరి. ఈవిధముగా ఝాన్సీలో "యమసప్తాహము' ప్రదర్శింపబడెను.

ఎనిమిదవరోజున పట్టణములో దండోరా వేయబడెను. శాంతి ప్రకటింపబడెను; హతశేషులైన ప్రజల కభయహస్త మొసగబడెను; రోడ్లప్రక్క కుప్పకుప్పలుగా బడి యంత్యక్రియలు జరుపబడెను. వెయ్యిమంది మనుష్య

లచే రోడ్డు లన్నియు దుడిప్పింపబడెను. అగ్నిహోత్రుని పరముచేయబడిన పేటల నప్పుడు నీటితో జల్లార్ప నారంభించిరి. ఏనుగులు, గుఱ్ఱములు, లొట్టిపిట్టలు, దున్నపోతులు, మొదలగు నానావిధ జంతుజాల కంకాళము లన్నింటిని పోగుచేసి పట్టణ బాహ్యప్రదేశమున నొక పెద్ద కందకమును త్రవ్వి యందులో పూడ్చివేసిరి. ఈవిధముగా ప్రభుత్వము వారు పట్టణ శౌచకర్మము యథావిధిగా జరిపిరి.

పట్టణమువెలుపల నాంగ్లేయు లుండు రాజవీధులలో దోచుకొనబడిన సామాను ప్రతిరోజున వేలము వేయబడుచుండెను. యుద్ధమున నుపయోగించు ఆయుధసామాగ్రిని, గుఱ్ఱములు, యేనుగులు మొదలగువానిని సింధియా సర్కారు కొనివేసెను. ఇతరరాజు లనేకమంది తమకు కావలసిన తదితరసామానను వేలములో పాడుకొనిరి. ఈవిధముగా ఝాన్సీ ప్రాచీనరాజ్యవైభవ మంతయు తరలిపోయెను! బ్రిటిషుప్రభుత్వమువారి కశేషధనము జిక్కెను

బౌకరు

మహారాణి లక్ష్మీబాయి ఝాన్సీకోటను వీడిన మరునాడు ఏప్రిల్ 5 వ తేదీని భాండేర అను గ్రామము చేరెను. అచ్చట నామె ప్రాతఃకాలముననే లేచి స్నానాదికములను గావించుకొని ప్రియపుత్రుండగు దామోదర వు కాహార; పానీయముల నిడి కాల్పి పయనమగుటకు సిద్ధమగుచుండెను.



ఇంతలోనే లెప్టినెంటు బౌకరు ససైన్యముగా మహావేగమున నాగ్రామసమీపమున కరుదెంచెను. ఈవిషమసమయమందు మహారాణివద్ద నొక్కఖడ్గము తప్ప మరే ఆయుధము గాని సైన్యము గాని లేదు. ఆమె వెంటనే కుమారుని వీపుకు గట్టుకొని, కరవాలము నొరనుండి యూడబెరికి హస్తమున ధరించి తనయశ్వరాజము నధిరోహించి యుద్ధమునకు సన్నద్ధమయ్యెను. ఆంగ్లయాశ్వికదళ మామెపై నురుక నుత్సహించుచు మృగశాబకమును వేటాడు వేటకుక్కవలె నతివేగమున నేతెంచుచుండిరి. లెప్టినెంటు బౌకరు మహాశూరుడు; అనుభవశాలి; యుద్ధనిపుణుడు; ఆంగ్లప్రతాపమును జూపి లక్ష్మీబాయిని పట్టుకొన వచ్చిన పురుషసింహము; లక్ష్మీబాయి యంతఃపురకాంత; అబల; ఇరువదిమూడు వత్సరముల బ్రాహ్మణబాలిక. ఇక నామెకు జయము చేకూరుటెట్లు! కాని లక్ష్మీబాయి క్ట్రి శంకయే కలుగలేదు.

శ్లో॥ సంగ్రామే సుభటేంద్రాణాం కవీనాం కవిమండలే
దీప్తిర్వా దీప్తిహానిర్వా ముహూర్తా దేవజాయతే॥

సంగ్రామమందు యుద్ధవిశారదునియొక్కయు, కవిమండలమందు కవీశ్వరునియొక్కయు నిపుణతగాని దాని యభావము గాని యొక్కనిముషములోనే తెలియగలదు. బౌకరు అతిరయమున నామెను దాక నుత్సహించుచు మీదకు వచ్చెను. లక్ష్మీబాయి ధగధగ మెరయు తన కరవాలము నొక్కసారి

ఝళిపించెను; తోడనే బాకరు వ్రేట్లువడిన శరీరముతో నేల గూలెను. అంతటితో యుద్ధము ముగిసెను. లక్ష్మీబాయి వాయువేగమున కాల్పీమార్గమును బట్టెను. బాకరు సేనతో వచ్చినతోవను విచారగమనమున ఝాన్సీకి మరలెను. లక్ష్మీబాయి పగలంతయు గుఱ్ఱము నొక్కరీతిగా బరువెత్తించుచు రాత్రి పన్నెండుగంటలకు కాల్పి చేరెను. శభాష్! లక్ష్మీ! పౌరుషలక్ష్మీ! నీధైర్యస్థైర్యలావంవ్రితారాక్కముక భారత చరిత్రలో సువర్ణాక్షరములతో లిఖింపబడెను.

లక్ష్మీ, రాణివాసమున సమస్తైశ్వర్యముల ననుభవించి నలక్ష్మి, ఆహారపానీయములు లేకుండ వీపుకు బుత్రుని కట్టుకొని యిరువదినాలుగు గంటలలో నూటరెండుమైళ్లు గుఱ్ఱముపై స్వారీచేయుచు దోవలో గలిగిన యంతరాయముల నవలీలగా దాటించుకొనుచు దన గమ్యస్థానమును జేరెను! తనపైనున్న పవిత్రస్వాతంత్ర్యభారమును కాల్పిగ్రామమున జేర్చి పాప మాయశ్వరాజము దన ప్రాణములను విడచెను! ఆహా! చరిత్ర యిట్టి దేశభక్తిగల యశ్వరాజము నెట్లు మరువగలదు!



# మహారాణి ఝాన్సీ లక్ష్మీబాయి



## ఆఱవపరిచ్ఛేదము.

### కాల్పియుద్ధము.

కాల్పి యమునానదియొడ్డున నున్న యొక ప్రాచీనపట్టణము. అచ్చట నొక్క ప్రాచీనకోట యుండెను. ఆంగ్లేయులీపట్టణమును పాలించుచుండిరి. 1857 లో విప్లవము ప్రారంభమగుటతోడనే యిదికూడ విప్లవకారుల చేతులలో బడెను. ఇది బుందేల్ఖండుకు మధ్య నుండుటచేతను, కాల్పికోట చాల బలమైన దగుటచేతను నానాసాహేబు సోదరుడైన రావుసాహేబు తన సైన్యములను తీసికొని కాల్పిని స్వాధీనము చేసికొని యచ్చట ననేకవేల సైన్యమును జేకూర్చెను; యుద్ధసామగ్రికూడ జాలవరకు పోగుచేయబడెను.

లక్ష్మీబాయి కాల్పి చేరినతోడనే రావుసాహేబామెను యథోచితముగా సత్కరించి యామె విడిదెకు మంచి యేర్పాటులు గావించెను. మరునాడు మహారాణి పీష్వాను గలుసుకొని తనఖడ్గము నాతని మ్రోల నుంచి కన్నీరుగారుచుండ సవినయముగా నిట్లు బలికెను. 'మీ పూర్వులీయన మూన ఖడ్గరాజమును మా కిచ్చియుండిరి. మీ పూర్వపుణ్య

వశమున మాపూర్వులును నేనును గూడ శత్రుసంహారకర్మలందు దీని నుచితోపయోగమునకు దెచ్చి మాధర్మమును నెరవేర్చితిమి; కాని యిపుడు నాకు మీసహాయకృపావిశేషములు లేకపోవుటచే నే నల్లారుముద్దుగా జూచుకొనిన మీఖడ్గమును మీకు సమర్పించుకొనుచున్నాను" అని యుక్తియుక్తముగా బలికెను. ఈమృదువచనములను వినుటతోడనే రావుసాహేబు ఝాంసీయుద్ధములో నతని సేన లామె కెట్టి సహాయమును జేయజాలనందుల కెంతయో విచారించుచు నిట్లు బదులు పలికెను. "నీవు ఝాంసీ సుబేదారుల ప్రాచీన కీర్తి ననుసరించి నేటివరకును శౌర్య ప్రతాపములను బ్రకటించితివి. ప్రబలశత్రువులగు నాంగ్లేయుల ప్రచండసేన కావంతయును జంకక వారితో నొంటరిగా ననేక రోజులు ఘోరయుద్ధమును సల్పితివి. నేడు ప్రపంచమంతయు నీశౌర్యమును, యుద్ధకళావిశారదత్వమును, పరాక్రమమును వేనోళ్ళ గొనియాడుచున్నది. నీవంటి శూరులు, నీవంటి యాత్మగౌరవధనులు నాసేనలకు నాయకత్వమును వహించుచో నా యుద్దేశ్య మతిశీఘ్రముగనే సఫలము కాగలదు. మాపూర్వుల కాలములో సింధియా, హోల్కారు గయక్వారు, బుందేలీల మొదలగు ననేకసరదారులు స్వదేశ, స్వధర్మ రక్షణార్థము తమతమ ప్రాణముల నర్పించుటకు గూడ సదా సిద్ధముగ నుండెడివారు. ఈకారణముచేతనే మహారాష్ట్రజెండా అటక్



వరకు నెగురుచుండెడిది. ఈసమయమందు గూడ నాకు నీవంటి శూరుల సహాయము మున్నచో దిరుగ నా వెనుకటి కాలము రాగలదు. కనుక నీఖడ్గరాజమును స్వీకరించి తిరుగ నాకు యథాప్రకారముగనే సహాయము చేయగోరుచున్నాను."

రావుసాహే బిట్లు పలుకుటతోడనే మహారాణి ఖడ్గమును దీసికొని యొరలో నుంచెను.

మహారాణి పీష్వాయాజ్ఞను బడసి మరల సంగ్రామప్రయత్నములను గావింప నిశ్చయించుకొనెను. రాణీ లక్ష్మీబాయి కాల్పీచేరి పీష్వాసైన్యములనుతయారుచేయుచున్నదను వార్త తెలియుటతోడనే బాందానవాబు, వానపురరాజు యితరజమీందారులుమొదలగు వారందరును దమతమసేనలనుగూడ రావుసాహేబు సహాయార్థము పంపించిరి. ఈవిధముగా కాల్పీలో లక్ష్మీబాయివలన నూతనోత్తేజము గలిగెను; బహువిధసమరసన్నాహములు గావింపబడుచుండెను.

లక్ష్మీబాయి కాల్పీలో జేరెనను వార్తఝాంసీకోటలో ప్రతిధ్వనింపగనే రోజుదొరగుండెలు ఝల్లుమనెను. కాల్పీలో యుద్ధప్రయత్నములు జరుగుచుండ తెలిసికొని యతడు ఝాంసీకోటను రక్షించుకొనుటకు సర్వప్రయత్నములను గావించి కాల్పీపైకి బోవుటకు నిశ్చయించెను. అతడు తన సేనలను భిన్నభిన్నభాగములుగా విభజించి మేజరుగాల్ మేజరు

ఆర్ మొదలగు వీరులను ముఖ్యాధికారులుగ నియమించి ఏప్రియల్ 25 వ తేదీని కాల్పిని ముట్టడించుట కాజ్ఞనిచ్చెను.

మహారాణి లక్ష్మీబాయి పేష్వాసైన్యమును తయారుచేయుచున్నదనియు నామె తిరుగ ఝాన్సీని పట్టుకొనుటకు కృతనిశ్చయురాలై యున్నదనియు, తాత్యాతోపె, వానపురరాజు, బాందానవాబు మొదలగువా రప్పుడే సేనలతో కోంచ్ గ్రామమువరకు వచ్చిరనియు రోజుదొరకు తెలిసెను. వెంటనే యతడు మేజరుగాల్‌కు కొంత సైన్యము నిచ్చి కోంచ్ గ్రామము పంపించెను. అచ్చట నయిదువందలమంది విప్లవకారు లుండిరి. ఇరుపక్షముల మధ్యను ఘోరయుద్ధము జరిగెను. చివరకు విప్లవకారు లోడిపోయిరి; కోట ఆంగ్లేయులచేతుల లోబడెను. ఈసేన బేత్వానదిని సమీపించుసరికి మేజరు ఆర్ సేనకూడ దీనిని కలిసికొనెను. వానపుర, శాహాఘరు రాజులు విప్లవకారుల సహాయార్థము సేనలను కోంచ్ గ్రామము పంపిరి. కాని వా రచ్చటకు జేరకుండగనే మేజరు ఆర్ వారితో దలపడెను. కోటరాగ్రామమువద్ద యుద్ధము జరిగెను. ఆంగ్లేయు లోడిపోయిరి. విప్లవకారులు కోంచ్ గ్రామముజేరి తాత్యాతోపెను గలిసికొనిరి. ఇంగ్లీషు సేనలుగూడ కోంచ్ గ్రామము చేరెను. దారిలో వారు లోహారీకోటను బట్టుకొనిరి. ఇది కోంచ్ గ్రామముకు పదిమైళ్ళదూరములో నుండెను. ఈకోటలోనుండ యాంగ్లేయులు గోంచ్ గ్రామముపై కురుకుట చాల సునాయాసముగా నుండెను.



అక్కడనుండి కోంచ్ గ్రామముపైకి రోజుదొర సేనలను బంపించెను. విప్లవకారులు తమసేనల కగ్రభాగమందే యెక్కువ కట్టుదిట్టములను జేయుచుండిరను సంగతి గ్రహించి యతడు వానివెనుకభాగముపై బడుటకు దనసేనల నాజ్ఞాపించెను. కోంచ్‌కు పదునాల్గుమైళ్ళదూరములో నాంగ్లసేనలను నిలిపి నగపురము, చుమేరే మొదలగు గ్రామములలో నొక్కొక్కభాగమునుంచి రోజు యుద్ధమునకు తయారయ్యెను. విప్లవకారుల సైన్యము కోంచ్ గ్రామములో కొద్దిగానుండెను. తాత్యాతోపె వానపురరాజులు గ్వాలియరునుండివచ్చు సేనల కెదురుచూచుచుండిరి. ఆంగ్లసేనలు వచ్చుచున్నవను వార్త వారికి తెలియుటతోడనే వారు తుపాకుల నొక్కసారిగా పేల్చుట ప్రారంభించిరి. రోజుదొర తనసేనలను విభజించి యనేక స్థానములం దుంచుటచే నివన్నియును వృథయయ్యెను. ఆంగ్లసేనలు నాలుగుమూలలనుండియు తుపాకులను గాల్చుట మొదలిడిరి. దీనితో విప్లవకారుల అశ్వికదళము చిందరవందరయై రణభూమినుండి పరుగెత్త నారంభించెను. విప్లవకారు లొక్కప్రక్కనే కట్టుదిట్టముచేసిరి; నలువైపులనుండియు నాంగ్లేయులు ముట్టడించుటతోడనే వారు మైదానముమీద పరుగిడ నారంభించిరి. పన్నెండుగంటలకు కోంచ్ గ్రామము నాంగ్లేయులు ముట్టడించిరి. తాత్యాతోపె, వానపురరాజు మొదలైనవా రాంగ్లేయుల నోడించుట కనేకప్రియ

త్నములను చేసిరి; చివరకు వారు విఫలమనోరథులై సేనలను దీసికొని కాల్పీకి బోయిరి. విప్లవకారుల ఫిరంగులు, గుండ్లు తుపాకులు, మొదలగు యుద్ధసామగ్రియంతయు నాంగ్లేయుల వశమయ్యెను.

మహారాణి లక్ష్మీబాయి కీయుద్ధముతో సంబంధమేమియును లేదు. రావుసాహేబు, బాందానవాబులే యీ యుద్ధమున కాధిపత్యమును వహించి నడిపించిరి. కాని వారైనను తగిన బందోబస్తును గావింపకపోవుటచే సైన్యమంతయు చిందరవందర యయ్యెను.

రోజుదొర కోంచ్ గ్రామమును పట్టుకొనినతరువాత కాల్పీపైకి బోవ నిశ్చయించెను. త్రోవలో నతనికి విప్లవకారులనేక కష్టములను గలిగించుచుండిరి. అతడసామాన్యప్రజ్ఞగలవాడు; యుద్ధచతురుడు. ఆటంకముల నన్నింటిని ఛేదించుకొనుచు నతడు కాల్పీ సమీపించెను. ఈసమయమున నతనికి కమాండరిన్‌చీఫ్ డెబ్బదియేడవ పటాలములోని రెండుభాగములను, ఒకసిక్కుపటాలమును, ఒంటెలదళమును పంపించెను. ఇట్లు సర్ హాగ్రోజు తన సేనలతో కాల్పీ జేరి శత్రుబలమును దుర్బలస్థానమునుండి ముట్టడింపజూచుచుండెను.

లక్ష్మీబాయి పరిస్థితు లన్నింటిని జక్కగా గమనించుచుండెను. కోంచ్ గ్రామములో విప్లవకారు లోడిపోయి కాల్పీకి పారివచ్చుటతోడనే యామె రావుసాహేబుతో నిట్లు



చెప్పెను. "కోంచ్ యుద్ధములో మీరు గావించిన సమరసన్నాహము లేవియును బాగుండలేదు. ఈసమయమందైనను మీరు సరియైన కట్టుదిట్టములను గావించినగాని లాభము లేదు. సరియైన శిక్షణము, కట్టుబాటులు లేని సేన యెన్నటికిని జయింపనేరదు. యోగ్యమైన వ్యవస్థ యుండబట్టియే ఆంగ్లేయులు విజయు లగుచున్నారు. ఆంగ్లసైన్యములోని సేనాపతు లందరును దమతమ పనులందును యితర పనులందును గూడ బహుకుశలురు. వారి సిపాయిలు యుద్ధకళాప్రవీణులు. ఆజ్ఞల నుల్లంఘించనివారు; వారి సర్వసైన్యములకు నొక్కడే సర్వాధికారి కలడు. ఆతని యాజ్ఞల ననుసరించియే సమరసన్నాహ మంతయు జరుగుచుండును. మీరెంతకాలము మీసేనలను స్యవస్థపాలుచేయుచు కేవల మొకమూకవలె నుంచుదురో అంతకాలము మీరాంగ్లేయులను జయింపజాలరు. మీరు మొట్టమొదట యుద్ధప్రదేశమును బరీక్షించుకొని ఫిరంగులు వగైరాలను స్థాపించుటకు వేదికలను నిర్మించుకొనవలెను. అచ్చట బుద్ధిశాలురును కార్యకుశలురును నగు వీరులనే నియమించవలెను."

రావుసాహేబు కీసలహా కొంతవరకు నచ్చెను గాని యతనిలో స్వాభిమాన, యీర్ష్యాపిశాచములు ప్రవేశించెను. విప్లవకారులలో నేమి ఆంగ్లేయులలో నేమి రణప్రౌఢులగు వారిలో లక్ష్మీబాయిని మించినవా రెవరును లేరని యత

డెరుగకపోలేదు; అయిననేమి! సర్వసైన్యాధిపత్యము నొక స్త్రీకిచ్చుచో దన ప్రతిష్ఠకు భంగము వచ్చు నను దురభిమాన పిశాచగ్రస్తుడగుటచే నతడే సర్వసైన్యాధిపత్యమును వహించి ముఖప్రీతికొరకు లక్ష్మీబాయి నెట్లయిన సంతోష పెట్టవలెనని రెండువందలయేబది గుఱ్ఱపుదళము నామెకు స్వాతంత్ర్యముగా నిచ్చి యమునానదియొడ్డున నుండ నియమించెను. ఒకప్రక్కను బాందానవాబు సేనను, మరియొక ప్రక్కను రోహిల్ఖండునుంచి వచ్చిన రోహిలాలను, బంగాళాదేశపు కాల్బలమును నియమించెను. ఆంగ్లేయులు వచ్చు మార్గమున బుందేలీ లుంచబడిరి. పెద్దపెద్ద ఫిరంగులు వేదికలపై నమర్చబడెను. లక్ష్మీబాయి తన చిన్నసేనను తీసికొని వారి నందరను రణశూరులనుగా తయారుచేసి యుత్తరతీరమును సంరక్షించుటకు బూనుకొనెను.

ఏప్రిల్ 15 వ తేదిని ఆంగ్లసేనలు కాల్పి సమీపించుచుండెను. విప్లవకారులు వారిపై దుముకుటకు సిద్ధముగా నుండిరి. గ్వాలియరునుంచి వచ్చిన విప్లవసేన తోడనే 25 వ పటాలపు కాల్బలముతో డీకొని యుద్ధము చేసెను. ఆంగ్లేయులు చాలమంది మరణించిరి. అనేకులకు గాయములు తగిలెను. ఇంతమాత్రముచే నాంగ్లేయుల కెట్టి గొప్పనష్టమును వాటిల్లలేదు. ఆంగ్లసేనలు తండోపతండములుగా మిడుతల దండువలె వచ్చి పడుచుండెను.



కాని గ్వాలియరుసేన కింకటితో తల తిరిగిపోయెను. తమ కేమియు భయములేదనియు, జయము నిశ్చయమనియు వారు పొంగిపోవుచు మైమరచి భంగును పూర్తిగా సేవించుచుండిరి.

16 వ తేదీని మేజరు ఆర్ సేనలు విప్లవకారులతో దలపడెను. కొంతమంది ఆంగ్లేయులు చనిపోయిరి; మరికొందరకు గాయములు తగిలెను. ఇంతలో సర్ హాగ్రోజు తన సైన్యముతో దయాపురమను గ్రామము చేరెను. అచ్చట సేనలను విడుచుటకు చాల బాగుండెను. అతడు వెంటనే విప్లవకారులతో యుద్ధ మొనర్చి వారినోడించెను. ఈయుద్ధములో చాలమంది విప్లవకారులు హతులైరి; తక్కినవారు వెనుకకు మరలిరి. మేజరు ఆర్ సేనకూడ విప్లవకారులపై బడి చాలమందిని సంహరించెను.

రోజుదొర యకాయకీని కాల్పికి బోవలెనను నిశ్చయమును మార్చుకొనెను. కాల్పిమార్గ మతిభయంకరముగా నుండెను. అతడు గలావలీ గ్రామము చాల బాగుండుటచే నచ్చట తన డేరాను స్థాపించెను. కోంచ్ గ్రామములో జరిగిన పరాభవమునకు విప్లవకారు లెంతయో క్రోధోద్దీపితులై "యీసారి ఆంగ్లేయులను బూర్తిగా చిత్తుచేసెదము లేదా మేము మాప్రాణములను యుద్ధభూమిలో సమర్పించెదము." అని యుత్తరకుమార ప్రజ్ఞలనుజేసిరి. బ్రిగేడియరుస్టు

న్స్టే, లెఫ్టినెంటు కలనల్ రాబర్ట్సన్, లెఫ్టినెంటు గార్డను మొదలగు నాంగ్లసేనానాయకు లొకవంక విప్లవకారులను చావగొట్టుచు కాల్పిమీదకు బోవుచుండిరి. విప్లవకారులు తమ స్థానము విడి ముందుకువచ్చి యావేశముతో యుద్ధము చేయసాగిరి. దీనివలన విప్లవసైన్యములకు రక్షణస్థానములేక పోయెను. ఈసమయమును కనిపెట్టి ఆంగ్లేయులు తమ తుపాకులను బారుచేసిరి, విప్లవకారు లెంతశౌర్యముతో యుద్ధము చేసినను లాభము లేకపోయెను. వారి కధికనష్టము కలిగెను. వారు నేలవిడిచి సాముచేసిన ట్లయ్యెను. కాల్పి సేనయొక్క యగ్రభాగమున కపజయము కలుగుటతోడనే విప్లవకారులు భయభ్రాంతులు కాజొచ్చిరి; బాందానవాబు, రావుసాహేబు పీష్వా మొదలగువారు పారిపోవలెనని యోచించుచుండిరి. రణలక్ష్మి తమమధ్యనున్నదని యైనను వారు గుర్తింపరైరి! ఈసంగతివిని లక్ష్మీబాయి పురుషుడైన రావుసాహేబునకు ధైర్యముచెప్పి "మీరిట్లు భయభ్రాంతులగుట కవసరములేదు! నాయుద్ధకౌశలమునుగూడ కొంచెము పరీక్షింపగోరుచున్నాను" అని చెప్పుచు దన యశ్వరాజము నధిరోహించి తన చిన్నసైన్యమును వెంటబెట్టుకొని ముందుకురికెను.

ఆమె విద్యుల్లతవలె మెరయు ఖడ్గరాజమును ఝళిపించుచు నాంగ్లసేనల దక్షిణపార్శ్వముపై వాయువేగమున నురి



కిపడెను. ఈభయంకర తేజమును జూచుటతోడనే ఆంగ్లసేన లొక్కసారిగా వెనుకకు మరలెను. గొప్పగొప్ప ఆంగ్లశూరులు ఖడ్గప్రహారములచే నేలగూల నారంభించిరి. వైరిపక్షీయుల ఫిరంగు లన్నియు నొక్కసారి కట్టుపడెను; ఫిరంగిఫిరంగివాలకు లెచ్చటివా రచ్చట కొయ్యబొమ్మలవలె నిశ్చేష్టులై నిలచిపోయిరి. ఇంతేకాదు! మహారాణి ఆంగ్లఫిరంగులదాటి యిరువది యడుగులవరకు నభిమన్యునివగిది విరోధిసైన్యములను ఛేదించుకొనుచు పోయి శత్రుసంహారమును జేయుచుండెను. మహారాణియొక్క యీ యసామాన్యప్రతాపమును జూచి మిగిలినకాల్పి సేనలుగూడ ధైర్యమునువహించి శత్రువుపై బడెను. ఇరుపక్షములవారును భయంకరయుద్ధమును సాగించిరి. మహారాణి తన యశ్వరాజమును వాయువేగమున బరువెత్తించుచు, దన యద్భుతహస్తనైపుణ్యముచే శత్రువు నడుమాడుచు శత్రుఫిరంగులను దాటినపు డావీరశ్రీని, ఆ యావేశతేజమును, ఆశౌర్యలక్ష్మిని జూచి పీష్వాయొక్క యితరసేనానాయకులుగూడ నాంగ్లేయులపై నురికిరి. విప్లవకారులు జొన్నచేనుపై కురుకు మిడుతలదండువలె నొక్కసారిగా నాంగ్లసేనపై బడిరి. ఆసమయమున జరిగిన ఘోరసంగ్రామమువలన విప్లవకారుల విజయ మరచేతిలో నున్నట్లు కాన్పించెను. మహారాణి దంతములతో కళ్ళెమును కరచిపట్టి యశ్వరాజము నతిరయమున బరువెత్తించుచు సవ్యసాచియె

రెండుచేతులతోను దళతళమెరయు కరవాలము నాకాశమండలమున దీప్పించు సాహావరంగమున హననకర్మతో దాండవమాడుచుండ ప్రత్యక్ష కాళికావతారమువలె మూర్తీభవించెను. ఆయుగ్రస్వరూపమును జూచియే శత్రుసేనలు సగము చచ్చుచుండెను. ఈయుద్ధములో నాంగ్లవీరుల పీచ మడంచ బడెను; ఫిరంగులవద్ద చావగా మిగిలిన ఆంగ్లఫిరంగి వ్రేటుకాండ్రు హతవీర్యులై పరువిడనారంభించిరి. గుఱ్ఱములపైనున్న ఫిరంగులన్నియు చెల్లాచెదరైపోయెను. ఆంగ్లసేనలో హాహాకారములు బయలుదేరెను. ఇట్లుండ బ్రిగేడియరుస్టువర్టు తనగుఱ్ఱమును పరుగెత్తించుకొనుచు వచ్చి ఫిరంగివ్రేటుకాండ్ర ననేకవిధముల యుత్సాహపరచెను. వారు కొంత ధైర్యమును దెచ్చుకొని మరల ఫిరంగులను పేల్చనారంభించిరి. లక్ష్మీబాయి పీష్వాసేనను తీసికొని యతివేగముతో నాంగ్లసేనలపై బడెననియు తమఫిరంగిలన్నియు కట్టుబడెననియు వినుటతోడనే సర్ హ్యూగ్రోజుగుండెలు పీచుపీచుమనుచుండెను. వెంటనే యతడు ఒంటెలదళమును తీసికొని తానే దానికి సైన్యాధిపతియై యతివేగమున వచ్చి కాల్పీసేనపై బడెను. విప్లవసేనలు చాలకాల మాంగ్లసేనతో ఘోరయుద్ధము జరిపెను. ఇంతలో వారిపై నెనుబదియారు, యిరువదియైదు నెంబరు పటాలములలోని శూరులుగూడ వచ్చిపడుటతోడనే విప్లవకారులు చిందర వందర కాజొచ్చిరి. సర్ హ్యూగ్రోజు యొ



క్క ఒంటెలదళము పైనుండి గుండ్లవర్ష మతితీవ్రముగా విప్లవకారుల నొప్పించెను. కాల్పీసేనలు పారిపోవజొచ్చెను. లక్ష్మీబాయి తనసేనలను దీసికొని ఆంగ్లేయుల ఫిరంగుల నణచివేసి వారిని వెనుకకు గొట్టుట కనేక ప్రయత్నములను జేసెను. కాని పీష్వాసేనలసాహస ముడుగుటచే నామెతో రాజాలకయామె కెట్టి సహాయమును వారు జేయరైరి? ఆమె యొక్కతె యెంతసేపు ముందుకు పోగలదు? దానివలన లాభమేమియు లేదని యామె కూడ నిరాశ చేసుకొని పీష్వాడేరాకు మరలెను. కాల్పీసేనలు పారిపోవుటను జూచి రోజుదొర తనసైన్యములతో నాలుగువైపులను వారిని ముట్టడింప నారంభించెను; విజయోత్సాహముచే నాంగ్లసేనలు శత్రుసంహారమునందు తమ కసిదీర్చుకొనుచుండిరి. వారికి దొరికినవారి నందరను చావగొట్టిరి. వెయ్యిమంది విప్లవకారులు భయభ్రాంతులై యమునానదిలో బడిరి. పీష్వాసేన యెంత యున్ననేమి! వారి కేశిక్షయును లేదు. కనుకనే సుశిక్షితులైన సర్ హ్యూగ్రోజు తనసేనలతో వారిని సునాయాసముగా నోడించెను.

విప్లవకారులను యుద్ధస్థలమునుండి తరిమివేసి కాల్పీలో బ్రిటీషుజెండా నెగురవేయుటకు సర్ హ్యూగ్రోజు నిశ్చయించి బ్రిగేడియరుస్టువర్టును యమునానదియొడ్డునుంచిరమ్మని నియమించి తాను స్వయముగా కాల్పీ చేరెను. ఆంగ్లేయులు పట్టణములో స్వేచ్ఛగా ప్రవేశించిరి. విప్లవకారులు కొం

తసేపు పోరాడి పారిపోయిరి. బాందానవాబు రావుసాహేబు పీష్వా, లక్ష్మీబాయి మొదలగువారతి చమత్కారముగా నంతకుమునుపే కోటను విడిచిపోయిరి. ఆంగ్లేయులు కోటను యుద్ధమక్కరలేకుండగనేస్వాధీనముచేసికొనిరి. రావుసాహేబు తాత్యాతోపె మొదలగువారు సంవత్సరము పొడుగునను కష్టపడి సంపాదించిన యుద్ధసామగ్రియంతయు నాంగ్లేయుల వశమయ్యెను; ఒక్కసారి 60000 పౌనులమందు ఆంగ్లేయులకు కాల్పీకోటలో లభించెను. దీనిని బట్టి ఫిరంగులు, తుపాకులు, కత్తులు మొదలగున వెన్ని వారికి దొరకెనో మనమూహించుకొనవచ్చును. యథార్థమైనశిక్ష లేకపోవుటయే విప్లవసేన లోడిపోవుటకు కారణమని దీనివలన పూర్తిగా స్పష్టమగుచున్నది.

సర్ హ్యూరోజు అనేకకష్టములను సహించి కాల్పీయుద్ధములో జయించినందులకు గవర్నరుజనరల్ కానింగు వాని నిట్లభినందించెను. “నేటివరకును మీరు గాంచుచున్న జయపరంపరలలోని విజయ మతిప్రాముఖ్యమైనది. ఈవిజయమునకు నేను మిమ్ములను మీతో పని చేసిన శూరులగు సైనికులను నెక్కువగా నభినందించు చున్నాను.” ఈ ప్రకారముగా సర్ హ్యూరోజు మధ్యభారతదేశములో విప్లవకారుల నందర నణచివేసి బ్రిటీషుజెండా నెత్తించెను. తరువాత కమాండరిన్ ఛీఫ్ కాంబెల్ తన స్వాధీనములో నున్న సేనలను రెండుభాగములు చేసి ఝాన్సీగ్వాలియరులను బందోబస్తు చేయుటకు బంపించెను. హ్యూరోజు యుద్ధము మొదలయినది లగాయితు కఠిన పరిశ్రమ చేయుచుండుటచే నలసిపోయి సెలవుదీసికొని బొంబాయికి పయనమయ్యెను.





# మహారాణి ఝాన్సీ లక్ష్మీబాయి

## ఏడవ ప్రకరణము.



### గ్వాలియరుయుద్ధము—లక్ష్మీబాయి వీరశయ్య.

కాల్పిలో బ్రిటిషుజెండా యెగురవేయబడెను. రావుసాహేబుయుద్ధములోచనిపోగా మిగిలిన సేనలతోపారిపోయిగ్వాలియరుకు నలువదియారుమైళ్ళదూరములో నున్న గోపాలపుర మను గ్రామమును జేరెను. లక్ష్మీబాయికూడ నతనితోడనే యుండెను. పీష్వాసేనానియగు తాత్యాతోపె క్రోంచ్ గ్రామములో నోడిపోయినతరువాత నతనిముసలితండ్రిని కలుసుకొనవలెనని చర్ఖీయను గ్రామముకు బోయెనట. కాల్పిపరాభవమును వినుటతోడనే యతడత్యాతురతతో బరువెత్తుకొని వచ్చి గోపాలపురములో పీష్వాను కలుసుకొనెను. బాందా నవాబుకూడ పరుగెత్తుకొనుచు వచ్చి గోపాలపురము జేరెను.

రావుసాహేబు, బాందానవాబు, తాత్యాతోపెలుముగ్గురునుగలసి ముందుచేయవలసిన కర్తవ్యమును గురించి తెన్నుగానక యేమి చేయుటకును దోచక దీర్ఘాలోచనలను సలుపుచుండిరి. 1857 జూనునెల మొదలు ఉత్తరహిందూస్థానమం దెచ్చటజూచినను, సాగరు, కాల్పి, ఝాన్సీ, ఆగ్రా, లక్నో,



కాన్పూరు, మొదలగు ననేకస్థలములందు విప్లవజెండా యెగురుచుండెను. కాని యిపుడు 1858 లో తిరుగ నాంగ్లసామ్రాజ్యము ప్రతిష్ఠింపబడెను. ఎచ్చట జూచినను యూనియన్‌జాక్ పతాకమే యెగురుచుండెను. విప్లవకారుల సైన్యములు చాలవరకు యుద్ధములో చనిపోయెను. మిగిలినవన్నియు చెల్లాచెదరై పోయెను. వారికోటలు, వారిపట్టణములు వారిధనము, వారిఫిరంగులు, మందుగుండుసామాగ్రియంతయు నాంగ్లేయులవశమైపోయెను. ఇందువలన శత్రుసేలలంతకంతకు బలపడుచుండెను. యుద్ధముచేయుటకా ఆయుధములు లేవు; ధనము లేదు; సైన్యము లేదు; ఊరకొనుటకా వీలు లేదు; ఆంగ్లేయు లొకవంక తరుముకొనివచ్చుచుండిరి. ఇట్టిసంకటసమయములో నేమియును దోచక రేయింబవళ్ళు నైనవే రొక్కనబడిన విప్లవనాయకులు ముగ్గురును గ్రాహాగ్రస్తగజేంద్రముభంగి “నీవేతప్ప నితఃపరం బెరుంగ దీనుని గావవే” యనుచందమున చింతానిమగ్నులై యుండిరి.

కాని వారిపక్క నున్న సింగపుగోదమ మేల్కొనియే యుండెను. రాణీలక్ష్మీబాయి హృదయమునుండి పొంగిపొంగి తేజరిల్లుచుండిన క్షాత్రతేజ మామెకు దప్ప మరెవ్వారికి దృగ్గోచరము కాగలదు !

ఆమె జయాపజయములను వెనువక సమయము దొరికినపుడెల్ల నాంగ్లేయులతో యుద్ధముచేయుటకే దృఢనిశ్చయము

రాలై యుండెను. వీరశిరోమణివలె మరియొకసారి రణరంగమునకరిగి తన యద్వితీయశౌర్యలక్ష్మిని బ్రదర్శించి విజయలక్ష్మిని బడయవలెనని లక్ష్మి సదా తపించుచు కాలముకొరకు వేచియుండెను.

రావుసాహెబు పీష్వాచింతాక్రాంతుడై యున్నాడను సంగతి యామెకు దెలియుటతోడనే నామె రావుసాహెబు డేరాకు స్వయముగా బోయి యతని నిట్లుపశమింపజేసెను.

“నేటివరకును శౌర్యమును జూపిన మనవీరు లందరు నేదోయొక యభేద్యమైన కోట నాశ్రయముగా దీసికొనియే యిట్లుచేసిరి. ముసల్మానుల నోడించి హిందూసామ్రాజ్యము నస్థాపించిన ఛత్రపతి శ్రీశివాజీమహారాజుగూడ సింహగఢ, రాయగఢ, తోరణ మొదలగు కోటలను బట్టుకొనెను. మొట్టమొదటనే యత డాత్మరక్షణకును, యుద్ధముచేయుటకును యోగ్యమగు ప్రచండదుర్గములను దనవశము చేసికొనెను. తరువాత నతని పరాక్రమమును శౌర్యమును జూపి సామ్రాజ్యమును స్థాపించెను. కనుక నీప్రాచీనయనుభవమును బట్టికూడ కోటలేకుండ మనము యుద్ధముచేయుట వృథయని ధృవమగుచున్నది. ఝాంసీ కాల్పిలవంటి యసామాన్యదుర్గములు మనచేతులలో నుండుటచేతనే మన మింతకాల మాంగ్లేయులతో ఘోరయుద్ధమును చేయగలిగితిమి. మనదురదృష్టముచే నిప్పు డవి మనచేతులలోనుండి జారిపోయినవి. కనుక



మన మిప్పు డొక ప్రచండదుర్గమును బట్టుకొనుట ముఖ్యావసరము. మన మిప్పు డెచ్చటకు పారిపోయినను ఆంగ్లసేనలు మనలను దరిమి నాశముజేయువరకు నూరకుండవు. ఏమి జరిగినను జరుగుగాక! మన మెట్టిఫలమును గురించియు ధ్యానింపక నిప్పు డేదోయొక కోటను పట్టుకొనవలెను. దానిని మద్దతుగా దీసికొని యాంగ్లేయులతో బోరివిజయమును సంపాదింపవలెను. ఇదియే మన మిపుడు చేయవలసిన కర్తవ్యము.” లక్ష్మీబాయి చెప్పిన యీసలహా వారికందరకును క్రొత్తశక్తిని గలిగించెను. వారు దాని నామోదించియే కోటను పట్టుకొనుట యోగ్యమను విషయమును మరల నామెనే యడిగిరి. “ఈసమయమున ఝాంసీలేక కాల్పికోటలను బట్టుకొన యత్నించుట శత్రుసమ్ముఖమున బడుటతప్ప మరొండు కానేరదు. గ్వాలియరుకోట ముట్టడించి సింధియాసర్కారుయొక్కయు నతని సైన్యముయొక్కయు సహాయమును దీసికొనవలెను; అచ్చటి రాతికోట నాశ్రయముగా జేసికొనుచో మనము కొంతకాలము యుద్ధము సాగింపవచ్చును; విజయమును పొందగలమను యభిలాషగూడ నప్పుడు మనకు బూర్తిగా కలుగగలదు.” అని యామె ప్రత్యుత్తర మిచ్చెను. ఆమె యొసగిన నీయద్భుతసలహానుగురించి కలనల్ మేలిసన్ యిట్లు వ్రాయుచున్నాడు.

"The situation then seemed desperate to the rebel chiebtairs. But desperate situation suggest desperate remedies; and a remedy which, on first inspection might well seem desperate, did occur to the fertile brain of one of the confiderates. To which one it is not certainly known. But, judging the leading group of conspirators by their anteeidents Rao Saheb, the Naob of Banda, Tantia Tope and the Rani of Jehnsi—we may at once dismiss the two first from consideration. They possessed neither the chrracter nar the genius to conceive a plain so vast and so daring. Of the two who remain, we may dismiss Tantia Tope. Not that he was incapable of forming the design, but—we have his memoirs and in those he takes to himself no credit for the most successful act with which his career is associated. The fourth conspirator possessed the genius, the daring, the despair nec essary far the conception of grate deeds. She was urged on by hatred, by desire of vengeance, by a blood—stained conscicnce, by a deteamination to strike hard whilst there was yet a chance. She could recognise the possibilities before her, she could hope even that if the first blow were successful the fortunes of the compaign might be changed, she possessed and exercised unbounded influence over one at least of her companions—the Rao Sahaib. The conjecture then almost amounts to



certainly that the desperate remedy which the confiderates decied to execute at Gopalpur was suggested and pressed upon her comrades by the daring Ranee of jhansi."

" విప్లవనాయకులకు పరిస్థితులన్నియు జాల విషమముగన, అపాయకరముగను గాన్పించెను. కాని ప్రతిఅపాయమునకు నేదోయొక యుపాయము తట్టుచుండును; అట్లే యత్యంతసాహసముగా గోచరించునట్టి యొకయుపాయము నా విప్లవనాయకులలో నొకరు కనిపెట్టెను. దాని నెవరుకనిపెట్టిరో దృఢముగా తెలియదు; కాని యావిప్లవనాయకులగు పీష్వా, బాందానవాబు, తాత్యాతోపె, లక్ష్మీబాయిల నలువురిపూర్వచరిత్రలనుబట్టి పరిశోధించినచో మనము రావుసాహేబుపీష్వా, బాందానవాబుల శక్తిసామర్థ్యములను గురించి యాలోచింప నవసరమేలేదు; అట్టిసాహసము, అట్టి దూరదృష్టి, అట్టినిపుణతగల పథకమును గనిపెట్టుటకు గావలసిన ధీశక్తిగాని, శీలముగాని వారిలో లేదు. ఇక మిగిలిన తాత్యాతోపెలక్ష్మీబాయిలలో తాత్యాతోపెనుగూడమనయ విడిచిపెట్టవచ్చును. అతని కట్టి ధైర్యసాహసములు లేకపోలేదు; కాని యతని జీవితములో నతనికి గలిగిన జయపరంపరలలో నత్యంత ప్రధానమైన యీ విషయమై యతడు తనను గురించి వ్రాసికొనిన స్మరణములలో నెచ్చటను తానే దానిని నిర్వహించినట్టు చెప్పకొనియుండలేదు ఇక ఝాన్సీ రక్ష్మీబాయి

కే మహాత్కార్యములకు గావలసిన ధీశక్తి, ధైర్య, సాహసములు, ఆశాపాశములను ఛేదించుట, మొదలగు నద్భుతశక్తులు చెల్లును; ద్వేషము, పగదీర్చుకొనుట శత్రు రక్తమును జుఱ్ఱుకొనవలెనను కోరిక. జయించుట కేమాత్ర మవకాశమున్నను, సన్నెట వేరిటు వేయవలెనను నిచ్చ మొదలగువానిచే నామె యీకార్యమునకు బ్రోత్సహింపబడెను; జయించుట కానుకుగల యవకాశముల నామె గుర్తింపగలిగెను. ఆమె యనుకొనినట్లు మొదటిదెబ్బ 'గూబగుయ్యి మనునట్లు' తగులునెడల యదృష్టము మారిపోవచ్చుననికూడ నామె తలచెను. తనస్నేహితులలో నొకడగు రావుసాహెబు పీష్వాపై నామె కపారమైన పలుకుబడి గలదు. ఆమె చెప్పినట్లతడు నడుచుచుండును. విప్లవకారులు గోపాలపురములో చేయనిశ్చయించుకొనిన సాహసకార్యమును ధైర్యస్థైర్యరాశియగు లక్ష్మీబాయియే యోచించి తనస్నేహితుల సందర నొప్పించెనను నూహ సత్యమేయనుట కెట్టిసందేహమును లేదు" రావుసాహేబుపీష్వా, తాత్యాతోపి క్రీయుక్తికి మహారాణి ననేకవిధముల ప్రశంసింపజొచ్చిరి. వారిరువురు నామె సలహాను బూర్తిగా నామోదించిరి. తాత్యాతోపె యిదివరలో ననేకసారులు గ్వాలియరు రహస్యముగా వెళ్ళి యచ్చటి దర్బారుయొక్కయు సేనలయొక్కయు మనోగతమును గ్రహించియేయుండును. ఈవార్తవినుటతోడనే పీష్వాసైన్యము



లోని సరదారులకుకూడ కొంత జయాభిలాష జనించెను. ఈవిధముగా మహారాణి సలహాననుసరించి గ్వాలియరుకోటను పట్టుకొనవలెనను కృతనిశ్చయముతో వారందరును గ్వాలియరునకు దండువెడలిరి.

గ్వాలియరు మహారాజు పేరు జయాజీరావుసింధియా. ఈ జయాజీరావు యింగ్లీషువారిచే నోడింపబడి వారి రెసిడెంటు యాజ్ఞానువర్తియై మెలగుచు పేరుకు రాజ్యమును తానే జేయుచుండెను. ఇతడు బహుబుద్ధిమంతుడు; పరాక్రమవంతుడు. మీరటు, ఢిల్లీ మొదలగు ప్రదేశములలో విప్లవము బయలుదేరుటతోడనే సింధియాసర్కారు సేనలలో గూడనలజడి బయలుదేరెను. ఇతని సైన్యము 10000మంది యుండెను. వీరందరునుకూడ బ్రిటిషు ప్రభుత్వముపై తిరుగబాటు చేయ నుత్సహించుచుండిరి కాని జయాజీరావీసంగతికనిపెట్టి తనసైన్యములో చాల భాగమును లెఫ్టినెంటు గవర్నరు సహాయముకొరకు ఆగ్రా పంపించెను. మరికొంత భాగము నిటావా ప్రాంతమునకు బంపెను. జయాజీరావు యింగ్లీషువారి కత్యంతస్నేహితుడు అతని దివాను దినకరరావు రాజకీయ ధురంధరుడు. వీరిరువురును గ్వాలియరులో విప్లవము రాకుండ ననేకప్రయత్నములను జేయుచుండిరి. చివరకు జూను 14 వ తేదీని సిపాయిలు తిరుగబాటుచేసి యాంగ్లేయుల భవనముల నంటించి మేజరుబ్లేకు, షెరీఫ్, కప్తాను,

హాకిన్సు, స్టువర్టు మొదలగు నధికారులను చావగొట్టిరి. కప్తను, మేక్ఫరుసన్ రెసడెన్సీలో నున్న ఆంగ్లస్త్రీలను, పురుషులను, పిల్లలను, పెద్దసైన్యముతో ఆగ్రాకు బంపివేసెను. ఈసందర్భములో జయాజీరావు ప్రభుత్వమువారికి చాల సహాయము చేసెను. ఇంతేకాక విప్లవనాయకులు నోడించి వారిప్రయత్నములను విఫలము గావించెను. విప్లవకారులు సింధియాసర్కారును తమకు నాయకత్వము వహింపవలసినదనియు తన రాజ్యము తనకు సునాయాసముగా గాగలదనియు నెన్నిసారులు చెప్పినను వినక తన ప్రభుభక్తిని బ్రకటించెను. అతడు విప్లవకారుల కెంతమాత్రము నవకాశ మీయలేదు. సేన యంతయు నాంగ్లేయులకు విరోధులుగనే యున్నను జయాజీరావు, మంత్రి దినకరరావుమాత్రమే వారిప్రయత్నములను సాగనియలేదు. కాని సైన్యము మరియు విప్లవముకొరకు కెదురుచూచుచుండిరి. ఇట్టిసమయములో నొకటి రెండుసారులు తాత్యాతోపె గ్వాలియరు రహస్యముగా బోయియుండెను. అచ్చటి సరదారులందరును "సమయము వచ్చినప్పుడు మీకు సహాయము జేయుటకు మేము సంసిద్ధులమై యున్నాము" అని వాగ్దానము చేసి యుండిరి.

ఈవిధముగా గ్వాలియరులో నొక అగ్నిపర్వతము లోలోన ప్రజ్వలించుచు సమయముకొరకు నిరీక్షించుచుండెను. వంగోత్రిజు విప్లవము నొకప్రక్క నులివివేసినను మరి



యొకప్రక్కనది రాజుచునే యున్నది. అయోధ్యప్రాంతమున నున్న రోహిలాలు, కాల్పినుండి పారిపోయివచ్చిన రావుసాహెబు సేన, సింధియాసర్కారుసేన, యీమూడును గలసినచో బ్రిటీషుప్రభుత్వ మెచ్చట నుండెడిదో మనము చెప్పజాలము! కనుకనే గ్వాలియరు రెసిడెంటు మేక్ఫరుసను గ్వాలియరులో కూడ నొక యాంగ్లసైన్యము నుంచవలసినదని గవర్నరుజనరలుకు జాబు వ్రాసెను. ఆసేన వచ్చులోపలనే గోపాలపురములో గ్వాలియరుపై దూకుటకు నిశ్చయింపబడి పీష్వాసైన్యము సింధియా ప్రభుత్వములోని అమున గ్రామము వరకును వచ్చెను. తాత్యాతోపె యెంతకుబూర్వము గ్వాలియరు వెడలి దర్బారులోని ముఖ్యుల నందరను కలుసుకొనినట్లు మనము వినియే యుంటిమి. పీష్వాసైన్యమును వారందరు నాహ్వానించుచునే యుండిరి. రావుసాహెబుపీష్వా జయాజీరావు కిట్లొక జాబు వ్రాసి పంపెను. "నేను నీవద్దకు స్నేహభావముతోనే వచ్చుచున్నాను. నీవు మన పూర్వపు బాంధవ్యమును స్మరించుకొని నాకీసమయమున సహాయము చేయవలెను. అప్పుడు నేను దక్షిణమునకు పోగలుగుదును." కాని యీయుత్తరమునకు సరియైన సమాధానము నీయక దీనిని రెసిడెంటుకు తెలియజేసి మంత్రియైన దినకరరావు అకటా వికటముగా సంచరించెను. కాని పీష్వా సింధియా తన పూర్వులకు నౌకరనియు, తప్పక సహాయము చేయు

సనియు దలంచి మే 27 వ తేదీని ఆమనగ్రామములో బ్రవేశించెను. కాని సింధియాయొక్క సుబేదారు కాల్బలమును, ఆశ్వికదళమును తీసికొని యతని మార్గమును నిరోధించెను. రావుసాహేబుపీష్వా తనహోదాను చూపుచు నతని నిట్లు ప్రశ్నించెను. "నన్ను నిరోధించుటకు నీ వెవ్వడవు? సింధియా దినకరరావులకు నే నేమి తెలియజేసితిని? వారి యంతర మేమి? నా యంతరమేమి? నన్ను వా రెట్లు నిరోధించ గలరు? నేను రావుపంతు ప్రధానపీష్వానని నీవు గుర్తెరుంగవలెను. నేను స్వరాజ్య, స్వధర్మముల కొరకు రణకంకణమును ధరించియున్నాను. సింధియాయొక్క పూర్వులు మాకు చాకిరీ చేసిరి. మేమే యతని కీరాజ్యము నిచ్చితిమి. సింధియా సేన యంతయు మాలో కలసిపోయెను. ఆసైన్యాధికారుల నుండి నావద్ద కాహ్వానపత్రములు వచ్చెను. తాత్యాతోపె ముందుగా గ్వాలియరుకు బోయి యధికారుల నందరను గలుసుకొని వారి మనోగతములను దెలిసికొని వచ్చెను. కనుక మే మిప్పుడు తయారై వచ్చితిమి.

మాతో యుద్ధము చేయవలెనని నీ కేమైనను కోరిక గలదా?" రావుసాహేబు పీష్వాయొక్క యీ గంభీరవచనములను విని యా సుబేదారు మాట్లాడజాలకపోయెను! పైగా పీష్వా ప్రచండసేనతో పోరి లాభము లేదని గూడ యతడు గ్రహించి యుద్ధప్రయత్నములను విరమించుకొనెను.



పీష్వాసైన్యము మే 30 వ తేదీకి గ్వాలియరు కారు మైళ్ల దూరమున నున్న బడాగావు అను చోట విడిసెను.

పీష్వా సింధియాసర్కారుకు వ్రాసిన యుత్తరము మీద వాదోప వాదములు జరిగెను. సింధియాయొక్క సరదారు లందరును పీష్వాకు సహాయము చేయవలెననిరి. ఒక్క దినకరరావు, జయాజీరావులు మాత్రమే పరప్రభుత్వదాస్యమున కొడిగట్టిరి. పీష్వాకును తనకును గల ప్రాచీనసంబంధమును గాని స్వధర్మ, స్వరాజ్యాశయముల కొరకు పీష్వా పోరుచున్నాడను దృష్టి గాని సింధియా కొంతమాత్రమును లేకపోయెను. ఆతడు విప్లవకారుల కెట్టి సహాయమును జేయకపోవుటే గాక వారితో పోరి వారి నోడించెదనని శపథము చేసెను. అతడు వెంటనే పొలిటికలు ఏజెంటు మేక్ఫరసను కీ విషయములను తెలియపరచి యింగ్లీషుసేనలు వచ్చువరకును తాము విప్లవకారులతో యుద్ధములకు దలపడక పట్టణమును జాగ్రతగా కాపాడుకొనుచు యుసువురును గలసి వారిపై నొక్కసారి పడవలెనని నిశ్చయించుకొనిరి. కొద్ది మంది మహారాష్ట్రసిపాయిలను మాత్రము పీష్వామార్గము నడ్డగించుటకు బంపిరి. కాని సింధియాయొక్క సరదారులు కొందరు వెంటనే పీష్వాతో యుద్ధము చేయవలెనని ప్రోత్సహించిరి. దినకరరా విది వలదని వారించున్నను జయాజీరావు వినక సమర సన్నాహములను గావించి స్వయముగా తాను

యోధవేషమును ధరించి మొలకు ఖడ్గమును వ్రేలగట్టి గుఱ్ఱముపై నెక్కి తన సర్వసేనలను దీసికొని జూను ఒకటవ తారీఖున బహాదరుపుర మను గ్రామమున విప్లవకారులతో దలపడుటకు సిద్ధమయ్యెను. ఆతనివద్ద నారువేల కాల్బలమును, పన్నెండువందల గుఱ్ఱపుదళమును యేడు పెద్ద పెద్ద ఫిరంగులును యుండెను. అతడు సేన కంతకును గ్రమమైన శిక్ష నొసగెను. అతని ఫిరంగులకు ప్రాచీన ప్రాశస్త్యము గలదు. విప్లవకారుల నొక్కసారి పేల్చివేయవలెనని యతడీ ఫిరంగుల నన్నిటికంటెను ముందు పెట్టించెను. వెంటనే వేలకొలది గుండ్లు పీష్వాసైన్యముపై గురిపింపబడెను. రావుసాహెబుపీష్వా తాత్యాతోపె లిద్దరును సింధియామహారాజు తమతో యుద్ధమునకు డీకొనునని తలంపరైరి! ఈగుండ్లు తమ గౌరవార్థమునకై పేల్చుచున్న నమస్కారములు (Salutes) అని వారనుకొని యుద్ధమున కాజ్ఞాపింపలేదు. ఇంతలో సింధియా ఫిరంగు లినుమడించుచు పీష్వాసైన్యమును సమీపించుచుండెను. పీష్వాసైన్యములో కలకలము బయలుదేరెను. రావుసాహెబు పీష్వాకీసంగతి తెలియుటతోడనే విచారాక్రాంతుడై కర్తవ్య విమూఢుడై యుండెను.

కాని సహస్రాక్షివలె సదా మేల్కొనియే యుండు లక్ష్మీబాయి యావంతయు జలింపక సైన్యముల నాయత్తము జేయుచుండెను.



మహారాణి రావుసాహెబుపీష్వాను ప్రోత్సాహపరచి గ్వాలియరుపైకి తీసికొనవచ్చినను సైన్యమంతయు నామె యధీనములో లేదు. ఆమె నిరుపమాన ధైర్య, శౌర్యములను, జూచి పీష్వా యామె సలహాను తన కవసరమగుటచే దీసికొనునేగాని యామె చెప్పునదంతయు చేయుచో దనప్రతిష్టకు భంగమువచ్చునని దురభిమానపూరితుడై యిట్లుచేయుచుండెను. కనుకనే యీసమయమునగూడ పీష్వాసైన్యములో గ్రమమేమియును లేకపోయెను. అయిన నీవార్తవినుటతోడనే లక్ష్మీబాయి తనతో రెండుమూడువందల యాశ్వికదళమును దీసికొని యత్యంతరయమున సుప్రార్థితసింగిచందమున సింధియాసైన్యముపైబడెను. తాత్యాతోపెకూడ తనసైన్యమును భిన్నభిన్నభాగములుగా విభజించి శత్రుసైన్యములను మార్కొనెను. లక్ష్మీబాయి సుశిక్షితులగు తనసైన్యమును దీసికొని సింధియాఫిరంగులపై బడుటతోడనే వారు పికాపికలై పరుగిడనారంభించిరి. సింధియాతరపున పోరుచున్న మరియొకసైన్యముగూడ తాత్యాతోపె సేనలను జూచుటతోడనే పలాయనమయ్యెను. కాని జయాజీరావు చాల శూరుడు. అతడావేశముతో తనసైన్యమును ముందుకు తీసికొనివచ్చి విప్లవసైన్యముతో హోరాహోరీని పోరాడసాగెను. ఒకప్రక్కన శూరాగ్రేసరుడగు నొకరాజకుమారుడు పదిపన్నెండువందలమంది జగజెట్టీలవంటి సిలేదారుపటాలముతో యుద్ధముచే

యుండెను. మరియొకప్రక్క దైవోపహతురాలగు నొక బ్రాహ్మణబాలిక రెండుమూడువందల రణకుశలురతో యుద్ధమునకు దలపడెను. జయాజీరావు ప్రభుత్వభక్తితత్పరుడై పోరుచుండెను. లక్ష్మీబాయి స్వరాజ్య, స్వధర్మపతాకముల కొరకు ప్రాణముల నర్పింపనుండెను. ఇట్లిరుపక్షములవారి కరవాలములును గొంతసేపు నరశిరోఖేలనతత్పరమై యుండెను. సింధియాయొక్క సేన లచిరకాలములోనే యలసట జెంది వెనుకాడుచుండ లక్ష్మీబాయియొక్క వీరు లుక్కుదక్కి శత్రుసేనలను స్వాహా జేయనారంభించిరి. ఇక లాభములేదని గ్రహించి జయాజీరావు దివానుదినకరరావు మొదలగువారిని వెంటబెట్టుకొని ధౌల్పురమార్గమున ఆగ్రాకు బారిపోయి మిత్రులగు ఇంగ్లీషువారి శరణుజొచ్చెను.

ఈవార్త గ్వాలియరులో తెలియగానే రాజమహాలులోనివారందరును, హాహాకారములు చేయ నారంభించిరి. అంతఃపురస్త్రీలు ఆత్మరక్షణార్థమై నరవరయను గ్రామమునకు బారిపోయిరి; విప్లవకారు లత్యుత్సాహముతో గ్వాలియరు పట్టణములో బ్రవేశించిరి. గ్వాలియరులోనున్న సరదారులు, రాజనీతికోవిదులు తదితరసిపాయిలు మొదలయినవారందరును గూడ తమయానందమును వెలబుచ్చ నారంభించిరి. వెంటనే గ్వాలియరుసేనలన్నియు పీష్వా నాహ్వానించుచు నమస్కారార్థము (salutes) ఫిరంగులను పేల్చుచుండిరి. రావుసాహేబుపీష్వా యెట్టియాటంకమును లేకుండ పట్టణము నతి వైభవముతో బ్రవేశించెను, ప్రజలందరు నతనినే తమ ప్రభువుగా స్వీకరించి యానందమున నోలలాడుచుండిరి. పీష్వా రాజమహాలులో బ్రవేశించి జయపతాకము నచ్చట స్థాపించెను. మహారాణి లక్ష్మీబాయి 'నవల్ఖా' యను తోటలో విడిదిచేసెను. తదితరులందరును వివిధ భవనముల నాక్రమించుకొనిరి. ఈ విధముగా పీష్వాకు సునాయాసముగా సింధియా యొక్క రాజధాని లభ్యమయ్యెను; స్వధర్మస్వరాజ్యాదర్శక జెండా యెత్తబడెను!



ఈవిధముగా పట్టణము నాక్రమించుకొనిన తరువాత తాత్యా కోటపైకి గొంత సైన్యముపంపెను. కోటలోని యధికారులందరు నదివరకే తాత్యాతో నేకమగుటచే కోట సునాయాసముగా నతనిపర మయ్యెను. తాత్యా వచ్చుటతోడనే దుర్గమద్వారము లన్నియు నతనికొరకు తెరచివేయబడెను. కాని దుర్భేద్యమైన గ్వాలియరు రాతికోటయు, నగణితయుద్ధసామగ్రియు, సైన్యమును, విశేషధనమును తమ యధీన మగుటచే తాత్యాకు కొంత గర్వము కలిగెను.

విప్లవకారులు పట్టణములో బ్రవేశించుటతోడనే ఆంగ్లాధికారి యుండు రెసిడెన్సీ తగులబెట్టిరి. అందులో నున్న సామాగ్రినంతను దోచుకొనిరి. సింధియాసర్కారుయొక్క పురాణరాజమహాలు, ఆంగ్లాధికారుల భవనములు, దినకరరావు

మొదలగువారి హవేలీలు మొదలైనవి మట్టిపాలుచేయబడెను.

ఈ ప్రకారముగా గ్వాలియరు విజయము పూర్తి యగుటతోడనే సింధియా యధికార మంతరించి పీష్వాయధికారము స్థాపింపబడెనని సూచించు విజయధ్వానములు చెలరేగెను. దర్బారులోని గొప్పగొప్ప సరదారులును, జాగీరుదారులును సైన్యాధికారులును రావింపబడిరి. సింధియాసర్కారు ఖైదు చేసిన విప్లవ సరదారులు నలుగురును విడిపింపబడిరి. తమ స్నేహకోటిలోనివారగు నితరరాజుల కాహ్వానము లంపబడెను. మూడవతారీఖున "పుష్పవనము" అనుచోట గొప్పదర్బారు జరుపబడెను సరదారులు, జాగీరుదారులు, సైన్యాధికారులు, మొదలగు వారందరు తమ తమ స్థానముల నలంకరించిరి. తాత్యాతోపె మొదలగు యోధులు యోధవేషములను ధరించి హాజరైరి! మంగళవాద్యములు మ్రోగుచుండ వందిమాగధులు స్తోత్రములు చేయుచుండ పీష్వాయత్యంత వైభవముతో రాజదుస్తులును ధరించి రత్నకిరీటమును, శిరోఫించమును దాల్చి మణి, కంకణ! హారవిభూషితుడై శుభముహూర్తమున సింహాసనమాసీను డయ్యెను. అనేక వస్త్రాభరణములు బహుమతు లివ్వబడెను. రామారావు గోవిందు అనునొక ప్రధానమంత్రికి వస్త్రము లివ్వబడెను. తాత్యాతోపె సేనాపతిగా నియమింపబడెను. అతనికొక రత్నస్థగితఖడ్గము బహుమతి చేయబడెను. తరువాత నెనమండుగురు ప్రధా



నులుగా నియమింపబడిరి. సైనికుల కిరువదిలక్షల రూపాయీలు పంచిపెట్టబడెను. పట్టణమంతయు కోలాహలముగా నుండెను; ఎచ్చట జూచిన నానందమయముగా నుండెను. సింధియాసర్కారు జాగ్రతతో గూడబెట్టిన ధనమంతను రావు సాహెబతిహుషారుగా ఖర్చు పెట్టుచుండెను. ఇక నిత్యబ్రాహ్మణ సంతర్పణలవిషయమై వర్ణింప నలవి గాకుండెను. పాకశాలలో వెయ్యిమంది వంటబ్రాహ్మణు లహర్నిశములు పనిచేయుచుండిరి. పంచభక్ష్యపరమాన్నములతో షడ్రసోపేతములైన భోజనము లమర్పబడుచుండెను. రాజమహాలులో నీప్రకారము నిత్యము నూతనోత్సవములతో నిత్యకళ్యాణము పచ్చతోరణముగా 'ఫెళ్ళు' మనుచుండెను. రావుసాహెబుపీష్వా, తాత్యాతోపె మొదలైనవా రవిరళసంతోషవారధిలో మునిగి కర్తవ్యజ్ఞానమూఢులై ప్రవర్తించుచుండిరి. ఈయవ్యక్తవ్యవహారమునకు లక్ష్మీబాయి యెంతయు దుఃఖాక్రాంతురాలై రావు సాహెబు ననేక పర్యాయము లిట్లు వారించెను. "మీరీసమయమున నిట్టిభోగములను కట్టిపెట్టవలెను; ఆనందముతోను, ఉత్సవములతోను కాలము వృథపుచ్చుట కిదిసమయముగాదు ఇది రణభేరులతోను, సమరసన్నాహములతోను శత్రువు నెదుర్కొనవలసిన తరుణము. మీరీసమయమున విజయోన్మత్తతచే నానందనిమగ్నులై యున్నారు. ఇదెంత మాత్రమును యోగ్యము కాదు. సింధియాయొక్క ఖజానా యంతయును

సర్వసేనలును మీయధీనములో నున్నవి. వీనిని మనము సరిగా నుపయోగించుకొనినయెడల మన యాశయము లన్నియు బూడిద పాలగును. ఆంగ్లేయులు చాకచక్యముగలవారు; తమ ప్రయత్నముల నెన్నడును విడుచువారు కారు. వారు మనపై కెన్నినిమిషములందు వత్తురో మనము చెప్పజాలము మనమిట్లు స్వస్థులమై పడియుందుమేని మననాశమున కెంత కాలమో పట్టదు. కనుక మీరిప్పు డిట్టి యుత్సవములను కట్టిపెట్టి సేనలను తయారు చేయుటయందు తత్పరులు గావలెను. సైనికుల నెక్కుడుగా నాదరించి వారి కుత్సాహము కలుగజేయవలెను. ఇట్టి సమయమును వృథా వ్యయపరచరాదు. మన మనేక కష్టములను పడి కార్యసాధన కనుకూలించు నిట్టి తరుణమును బడయ గలిగితిమి. కనుక మనము సావధానముగా నిట్టిసమయమున యుద్ధప్రయత్నములను జేసికొనుటే ప్రధానకర్తవ్యము." కాని రత్నములవంటి యీపలుకులన్నియు చెవిటివాని ముందు శంఖమూదినట్లయ్యెను. పీష్వా కివి బుర్రకెక్కలేదు. "భ్రష్టస్య కాలాగతిః" అనునట్లు వారు యథాప్రకారముగా నుత్సవములతోను బ్రాహ్మణసంతర్పణలతోను సంతృప్తి పడుచుండిరి. తాంత్యాతోపెకూడ తన సైన్యమును జూచి మురియుచుండెను. ఆంగ్లేయులు తనసేనతో యుద్ధము చేయజాలరనియే యతడు భావించుచుండెను.

కాల్పీ యుద్ధమైన తరువాత సర్ హ్యూగ్రోజుమిగిలినవిప్ల



వకారుల నందరను నాశనము జేయుట కేర్పాటులను గావించి బొంబాయి చేరిన సంగతి విని యేయున్నారము. కాని విప్లవకారులు గ్వాలియరు ప్రవేశింపనున్నారనువార్త యతనికి జూన్ ఒకటవతేదీని తెలిసెను. ఈవార్త వినుటతోడనే యతఁ డత్యాశ్చర్యపడెను; వెంటనే యతడు చాలమంది తెల్లసిపాయిలను, నేటివుసిపాయిలను, అశ్వికదళములను యిచ్చి మేజరు స్టువర్టు, మేజరు రాబర్టుసన్‌లను బంపించెను. కాని వారు గ్వాలియరు జేరకమునుపే గ్వాలియరు జయింపబడుటయు మహారాజు ఆగ్రాపారిపోవుటయు జరిగెను. ఈవార్త వినుటతోడనే రోజు దొర దుఃఖాక్రాంతుడయ్యెను. అతడు పడిన కష్టమంతయు వృథయైనట్లతనికి గాన్పించెను, వెంటనే యతడు వెనుకకు దిరిగి విప్లవకారుల నోడించుటకు ప్రజల ప్రయత్నములను గావించెను. ఈయుద్ధములో సర్‌హ్యూగ్రోజువంటి రణపండితుడును, యుద్ధకళానిపుణుడును లేనిచో పీష్వాచే పునరుజ్జీవితము గావింపబడిన మహారాష్ట్రాధికారము దక్షిణదేశమంతను విజృంభించి మన కెట్టి దుస్థితి పట్టెడిదో యూహింపజాలమని మేలిసను వ్రాయుచున్నాడు. రోజుదొర వెంటనే సర్వసైన్యాధిపత్యము వహించి గ్వాలియరుపై సేనలను నడిపించెను. ఆంగ్లసేనల సరాసరి గ్వాలియరు సమీపమున నున్న మురారిగ్రామమును వచ్చి చేరినను రావుసాహేబుకుగాని తాంత్యాకుగాని యీసమాచారమే తెలియకుండెను. వారి

యానందములో వారు పడి కొట్టు కొనుచుండిరి. మురారిలోనున్న సేనయంతయు సింధియాసర్కారుసైన్యము. ఈసైన్యమంతయు విప్లవకారులలో గలసిపోయెను. ఈసైన్యములో మరఫిరంగులు, అశ్వికదళము, కాల్బలము మొదలగు యుద్ధసామాగ్రియంతయు నుండెను. ఇవిగాక గ్వాలియరు సేనలు రోహిలాలు, పఠానులు మొదలగు యుద్ధవిశారదులు గూడ గ్వాలియరు సేనలో నుండిరి. కాని యెన్ని యున్న నేమి! పీష్వా, తాత్యాతోపె లంధప్రాయులై యిట్టిపరికరముల నుపయోగించుకొనక విందుల నారగించుచుండిరి. ఛత్రపతి శివాజీమహారాజు, బాజీరావు, నానాఫడ్నవీసు మొదలగు మహారాష్ట్రశూరులందరును తమతమ సైనికుల బాహుబలముచేతను, ఖడ్గనైపుణ్యముచేతను, మహారాష్ట్ర ప్రభుత్వమును అటల్ వరకును స్థాపించియుండ రావుసాహెబు పీష్వా దాన, ధర్మములచేతను, బ్రాహ్మణసంతర్పణల చేతను స్వారాజ్యపతాకమును స్థాపింపబూనెను కాబోలును! చిట్టచివర కాంగ్లసేనలు వచ్చుచున్నసంగతి తెలిసినతరువాతపీష్వా తాత్యాతోపెను పిలచి సేనలను తయారుచేయుమని యాజ్ఞాపించెను. తాత్యాతోపె స్వయముగా యుద్ధనిపుణుడను సంగతి మనమిదివరకే గ్రహించియున్నాము. కాని యితడు గూడపీష్వాతో విజయోత్సవములతో మత్తెక్కియుండెను. పీష్వా పట్టాభిషిక్తుడయ్యెను గనుక నింగ్లీషువారు తమపై యుద్ధమునకు వచ్చుచో నితర



రాజులందరును వచ్చి తమకు సహాయము చేయుదురని యతడు తలంచెను. కాని యీసమయమందు తమకు సహాయము చేయువారెవరును లేరను సంగతి యతనికి తెలియుటతోడనే తాత్యా తెలివి తెచ్చుకొని యోధవేషమును ధరించి ప్రతిచోటను ఫిరంగులకొరకు వేదికలను గట్టుట కాజ్ఞాపించెను. అతడు స్వయముగా మురారి పరువెత్తి దానిని రక్షింప బ్రయత్నించెను. అతని ప్రయత్నములు నిష్ఫలమయ్యెను. సర్ హగ్రోజు అకస్మాత్తుగా మురారిపై బడుటతోడనే నచ్చటనున్న సేనలు భయభ్రాంతులైరి. మురారిలోనున్న సైనికులలో కొందరు సింధియాకు విరోధులైనవారుండిరి. వీరు బహుపరాక్రమముతో యుద్ధము చేసిరి విప్లవకారులలో గూడ కొందరు శూరులు వెనుదీయక పోరాడిరి. ఇటు రెండుగంటల వరకును ఘోరయుద్ధము జరిగెను. చివర కాంగ్లేయులే గెలిచిరి విప్లవకారులు మురారి వీడి పారిపోవుటతోడనే యింగ్లీషువారు దానిని స్వాధీనము చేసుకొనిరి.

ఈసమాచారము గ్వాలియరులో తెలియుటతోడనే ఆందోళన బయలుదేరెను. రావుసాహెబుపీష్వా కిప్పుడు తెలివి వచ్చెను అతడు అతని సైన్యమున కుత్తేజమును కలిగించుటకు పైకి వచ్చెను. బాందానవాబుకూడ పట్టణముయొక్క బురుజులను బందోబస్తు చేయుటకు బయలుదేరెను. తాత్యాతోపె యిదివరకే మేల్కొని సేనలను కూర్చుచు, ఫిరంగుల నన్ని

చోట్ల నమర్చుచు. అశ్వికదళమును, కాల్బలములను యథాస్థానముల నియోగించుచు భిన్నభిన్న సైన్యములను వివిధప్రదేశములందుంచి త్వరత్వరగా యుద్ధప్రయత్నములను జేయుచుండెను. అతడు మహారాణిలక్ష్మీబాయిని సమీపించి యామె మ్రోల వినమ్రుడై నిలచి "తల్లీ! యిదివరలోవలెనే నీవు మా కీయుద్ధమందు గూడ సహాయమును జేయ వేడుకొనుచున్నాను" అని పలికెను.

ఈవచనములు వినుటతోడనే మహారాణికి దుఃఖము వచ్చెను. ఆమె పీష్వా తాత్యాలతో సైనికశిక్షణము గురించి యెన్నిసారులు చెప్పినను వారు పెడచెవిని బెట్టి పీష్వాపదవిని పునఃప్రతిష్ఠించు మహోత్సవములలో నిమగ్నులై కార్యసిద్ధి కదనగు కాలము నైశ్వర్యోపభోగములలో గడిపివేసి ఆత్మనాశమును, భారతదేశదాస్యశృంగములను దెచ్చిపెట్టిరి. ఇట్టివిచార మామెహృదయమును వ్రక్కలు జేయుచుండ "భారతదేశమా నీకింకను శుభదినములు పట్టలేదు. అట్లు కానిచో మావంటి నిర్భాగ్యులు నీకడుపుచిచ్చుకొఱకేల దాపరింతురు?" అని విలపించుచు పొద్దుపుచ్చుచుండెను. తాత్యాతోపె సందేహమనస్సుతోను దీనవాణితోను నామెను పదేపదే ప్రార్థింప నామె యిట్లు పలికెను. "సహస్రోపాయములను గనిపెట్టి నిరంతర పరిశ్రమను చేయుచు నేటివరకు మనము చేసిన కృషియంతయు నిష్ఫలమగు సూచనలు నాకు గాన్పించు



చున్నవి. నేను చెప్పిన సలహాయంతయు పీష్వాయొక్క దురభిమాన దురాగ్రహములచేతను, విజయోత్సాహముచేతను బూడిదలో బోసిన పన్నీరుచందమాయెను. ఆంగ్లసేనలు మన నెత్తిపై వచ్చిపడుచున్నను మనమింకను సరియైన సమరసన్నాహములను గావింపలేదు క్రమశిక్ష యెంతమాత్రమును లేని యిట్టిసైన్యముతో మన మాంగ్లేయులను బోరి యశమును సంపాదింపజాలము. కాని యిట్టి సమయములో మన ధైర్యమును విడనాడినను లాభములేదు. మీరు మీమీసైన్యములను యుద్ధసన్నద్ధులనుజేసి నలువైపులను నిపుణులగు సరదారులనుంచి తగినబందోబస్తు గావించి ఆంగ్లసేనల మార్గమును నిరోధించుడు. నేను నాధర్మమును నెరవేర్చుట కెప్పుడును సిద్ధముగానే యున్నాను, మీరు మీకర్తవ్యమును మాత్రము విస్మరింపకుడు."

ఈమాటలను వినుటతోడనే తాత్యాతోపెకు నూతనోత్సాహము కలిగెను. ఆమెమాటల నతడు శిరసావహించి గ్వాలియరుకు తూర్పుభాగమును రక్షించుభారము నామెకిచ్చివేసి తనసేనలతో మరియొకవైపుకు పోయెను.

మహారాణి లక్ష్మీబాయి యిదియే తన యంతిమయుద్ధమని గ్రహించి యద్వితీయరణోత్సాహముతో దనసేనల నతిత్వరితముగా రణోన్ముఖులను గావించెను. ఆమె తన మామూలు యోధవేషమును ధరించి, యుత్తమాశ్వము నధిరో

హించి శత్రుసంహారకేళియం దసమానకౌతూహలమును బ్రదర్శించు తన ప్రాణతుల్యమగు రత్నస్థగితకరవాలము నొఱనుండి యూడబెఱికి సైనికనివహంబులకు శిక్షను గఱపనారంభించెను. ఆసమయమునందలి యామె దివ్యస్వరూపమును, గంభీరస్వరమును, స్వధర్మస్వదేశాభిమానములను జూచి యామె సైనికులావేశపూరితులగుచు శత్రుసంహారోత్సుకతను బ్రదర్శించుచుండిరి.

బ్రిగేడియరుస్మిత్ మేజరుహార్ లిద్దరును హూగ్రోజుయొక్క ఆజ్ఞానుసారము గ్వాలియరుకైదుమైళ్ళదూరములో నున్న కోటకీసరాయియను గ్రామమున తమ సేనలను నిలిపి యచ్చటనుండి పట్టణముపైబడుటకు నిశ్చయించిరి. వీరిద్దరును గ్వాలియరు సేనలయొక్క వ్యూహరచనను బరీక్షింప నారంభించిరి. ఆవైపునున్న సేనలు మహారాణి యధీనములో నుండెను. ఫిరంగులకొఱకు వేదికలంతటను స్థాపిపబడెను. పర్వతముయొక్కనిమ్నోన్నతప్రదేశములలో సేనలు క్రమశిక్షణలో నుంచబడెను. అభేద్యమైనవ్యూహము పన్నబడెను. శౌర్యసాహససంపన్నులగు వీరు లగ్రభాగమున నుండిరి. వారివెనుక కొద్దిదూరములలో అశ్వికదళము, కాల్బలము మొదలగున వతిచమత్కారముగా కూర్పబడెను. తక్కిన యుద్ధప్రదేశములన్నియు సరికట్టబడెను. ఒకయెత్తైనప్రదేశములో గొప్ప గొప్ప ఫిరంగు లమర్పబడెను. ఈవ్యూహమును దాటి ఆంగ్లేయులు



పట్టణమును బ్రవేశించుట దుస్సాధ్యముగా నుండెను. పదహారవతారీఖున బ్రిగేడియరుస్మిత్ యుద్ధమును బ్రారంభించెను. ఆంగ్లసేనలు ముందుకు బయలుదేరుటతోడనే లక్ష్మీబాయి తన ఫిరంగివ్రేటు వాండ్రను హుషారు చేసెను. వెంటనే ఫిరంగివర్షము కురిసెను. దానితో నాంగ్లసేనలు చెల్లాచెదరై వెనుకకు మరలెను. లక్ష్మీబాయియొక్క రణశూరులగు సరదారులును, ముసల్మానులును ముందుకురికి యాంగ్లేయులపై బడి ఘోరయుద్ధము చేసిరి.

ఆంగ్లేయుల గుఱ్ఱపుదళము మహారాణి సైన్యముపై నత్యావేశముతో పడెను. మహారాణి సరదారులు వారి నెదిర్చిరి; సంగ్రామ మతిభీకరముగా నుండెను. ఇరుపక్షములవారును తమతమ పరాక్రమమును జూపుచుండిరి. మహారాణి సైనికులు ప్రాణములను త్యజించి కృపాణపాణులై విజయశ్రీని సాధించు తమకంబున శత్రుగణముపై కురికిరి. తల్వారుల ఝణాఝణధ్వనులు మారుమ్రోగెను. ఆంగ్లసేనలు ప్రాణముల నరచేతులలో నుంచుకొనిరి. ఇంతలో కలనల్ రేన్సు, కలనల్ వేలీలు తమ సైన్యములను దీసికొని, బొంబాయి నేటివుకాల్బలమును ముందుంచుకొని మహారాణి సైన్యముయొక్క పృష్ఠభాగముపై బడిరి. మహారాణి సైన్యము నలువైపులను యుద్ధము చేయవలసివచ్చెను. ఆంగ్లసేన లసంఖ్యాకముగా వచ్చుచుండెను. లక్ష్మీబాయిసైన్య మతికొద్దిగా నుండుటచే వెనుకకు తగ్గవలసివచ్చెను.

కిలసల్ రేన్సు, బ్రిగేడియరుస్మిత్ మొదలగువారీ సమయమును గనిపెట్టి తమతమ గుఱ్ఱపుదళములను దీసికొని శత్రుసైన్యమును చీల్చివేసి ముందుకు పోవలెనని ప్రయత్నించుచుండిరి. తన సైన్యము వెనుకపడినసంగతి లక్ష్మీబాయి చూచుటతోడనే యామె తన యశ్వము నురికించుకొనుచు కరవాలము నాకాశమండలమున గిరగిరం ద్రిప్పుచు సైన్యమున కగ్రభాగమున నిలచి మేఘగంభీరస్వరముతో సైనికులను ప్రోత్సహింప వారు సంగ్రామదేవతయగు లక్ష్మీబాయిచే ద్విగుణీకృతోత్సాహులై పోరసాగిరి. ఈవిధముగా మరల తుములయుద్ధము జరిగెను. మహారాణి సైన్యము కొంచెమైనను వారందరును వీరులు; క్రమశిక్షనొంది మృత్యువు నాలింగనము జేయవచ్చిన ధీరులు. రావుసాహెబుపీష్వా, తాత్యాతోపెలు పెద్దపెద్ద సైన్యములను పోగుచేసి పట్టణమును మరియొక వైపునుండి రక్షించుచుండిరి. కాని వారి సైన్యము లెంతపెద్దవియైనను క్రమశిక్ష లేదయ్యెను.

పదిహేడవతారీఖున ఆంగ్లసేనలు గ్వాలియరు నన్నివైపులనుండియు నొక్కసారి ముట్టడించి జయించవలెనని చాల ప్రయత్నములను గావించెను. బ్రిగేడియరుస్మిత్ కోటాకీసరాయిగ్రామమువైపునుండి శత్రుసేనలను చీల్చుకొని గ్వాలియరుపై బడవలెనని ముందుకు బోవుచుండెను. వెంటనే మహారాణి వారి నడ్డగింప తనసేనల నాజ్ఞాపించెను. నాలుగు



మూలలనుండియు రణభేరులు మ్రోగి యాకాశమును చిల్లులువడజేయుచుండెను, మహారాణి యాశ్వికదళము తమ యుద్ధనైపుణ్యమును జూపుచు రాణిని మెప్పించవలెనని యొక్కుమ్మడి ముందు కురికి ఆంగ్లేయులతో ఘాతీలను గలిపి ఘోరయుద్ధ మొనర్చిరి. ఈసమయమున మహారాణి వదనకమలము క్షాత్రతేజముతో నుట్టిపడుచుండెను; ఆమె నేత్రద్వయము దేదీప్యమానముగా నుండి క్రోధవహ్నిని గ్రక్కుచు నిజసైన్యము నుత్సాహపరచుచుండెను. ఆరోజంతయు భయంకరయుద్ధము జరిగెను. చాలమంది ఆంగ్లశూరులు యుద్ధములో యమసదనమున కంపబడిరి. బ్రిగేడియరుస్మిత్ కూడ నతిధైర్యముతో బోరెను. రణగర్జనములు మిన్నంటుచుండెను. ఆకాశమండలమంతయు ధూళిధూసరమై కారుచీకట్లు గ్రమ్మెను. ఇరుప్రక్కలయోధులును నేల గూలుచుండిరి. ఈయుద్ధములో గొప్పగొప్ప ఆంగ్లవీరు లందరును హతాశులై దుర్భేద్యమైన లక్ష్మీబాయి వ్యూహమును ఛేదించుట దుర్లభమని గ్రహించుటతోడనే యుద్ధము నుమాని వెనుకకు మరలిరి.

పదునెనిమిదవ తేదీని మరల యుద్ధము ప్రారంభమయ్యెను.

లక్ష్మీబాయి శౌర్యము నాంగ్లయోధులు మరువజాలకుండిరి. కనుకనే వారు మరియొకవైపునుండి గ్వాలియరుపై

బడ నుంకించుచుండిరి. ఇంతలో కలనల్ రేన్సుకూడ వచ్చి స్మిత్‌ను గలుసుకొనెను. వారిరువురును తమతమ సేనలతో నతిచాతుర్యముగ వ్యూహముల నేర్పరచి ఆశ్వికదళమునే శత్రువులతో బోరుటకు ముందుంచి కలనల్ హెక్స్, కప్తను హేనేజు మొదలగు వీరులను తీసికొని శత్రువు నణచివేయవలెనని మహావేగముతో బయలుదేరిరి. ఆంగ్లాధికారు లందరును యుద్ధసన్నద్ధులై శత్రువును స్వాహాచేయవలెనని యూటలూరుచుండిరి. లక్ష్మీబాయికూడ పూర్తియైన ప్రయత్నములనే గావించెను. ఆమె యోధవేషమును ధరించి శిరమున కుచ్చుతలపాగ జుట్టి, సఫేదుఅంగరకా ధరించి, పాయిజామా తొడుగుకొని, కంఠసీమను ముత్యాలహారము నలంకరించుకొని తన యశ్వరాజము నధిరోహించి రణచండికవలె కరాళకరవాలధారాప్రభచే సేనలను వధించుచుండెను. ఆంగ్లేయులు నలువైపులనుండియు గ్వాలియరుపై బడిరి. సర్ హ్యూగ్రోజు ఒకవైపునుండి వచ్చెను. బ్రిగేడిరుస్మిత్ మరియొకవైపునుండి ప్రచండసేనతో మహారాణి ననేక వైపులనుండి ముట్టడించుచుండెను. మహారాణి తన వీరులను వెంటబెట్టుకొని యావేశముతో బోరుచుండెను. ఆంగ్లేయులుకూడ శౌర్యమును జూపసాగిరి. ఈసమయమున లక్ష్మీబాయి మేఘమండలమును భేదించుకొని మెరయుమెరుపుతీగవలె యుద్ధరంగమున మెరయుచుండెను, ఆమె శౌర్యసాహసములకు మేర



లేకయుండెను. ఆంగ్లాధికారులుకూడ వెనుదీయక పోరుచు ముందుకు బోవలెనని యావేశమున వచ్చుచు నిలిచిపోవుచుండిరి. ఒకరికొకరు తీసిపోవుట లేదు. ప్రజలు హాతాశులగుచుండిరి. ఆకాశమండలము ధూళిధూసరముతో గప్పబడెను. సూర్యభగవాను డదృశ్యమగుచుండెను. కాని విజయలక్ష్మి యెవ్వరికిని సంప్రాప్తించుటలేదు. సర్ హ్యూగ్రోజు మురారివైపునుండి రావుసాహెబుపీష్వాయొక్క రెండు ఫిరంగులనుధ్వంసముచేసెను. ఈవార్త లక్ష్మీబాయి సైనికులకుగొంతయులజడి కలగించెను. ఆమెకాల్బలసరదారులెందుచేత నోగాని వెనుదీయుచుండిరి. వారు లక్ష్మీబాయితో గలిసిన సింధియాప్రభుత్వముయొక్క సైనికులు. కాని లక్ష్మీబాయి గుఱ్ఱపుదళముమాత్రము హిమగిరివలె నట్లే యుండి యుద్ధమును మరింత యుత్సాహముతో చేయుచుండెను. చాలమంది యోధు లపారపారావారముగా వచ్చిపడుచున్న ఆంగ్లఫిరంగుల కెరయగుచున్నను వెనుకనున్న కాల్బలమును, ఫిరంగులును తనప్రక్కనే యుండునని యామె తలంచుచుండెను. కాని ఈయాశ నిరాశ యయ్యెను. యుద్ధ మతితుములముగానున్న సమయమున నామెకు దని ప్రాణమును, బాల్యస్నేహితురాలును నైన కరవాలము దప్ప మఱియొండు సహాయము లేదయ్యెను!

బ్రిగేడియర్‌స్మిత్ మరియొక్కవైపునుంచి మహారాణి

కాల్బలముమీదకును, ఫిరంగులమీదకును కలనల్ హెక్స్ కప్తను హేనేజులను బంపించెను. వీ రతిచమత్కారముగా వెనుకనుండి వారిపై బడిరి. లక్ష్మీబాయి కాల్బలము వారిని చూచుటతోడనే పలాయనమయ్యెను. తుపాకులుమందు మొదలగు యుద్ధసామగ్రి యంతయు నాంగ్లేయుల పరమయ్యెను. ఈసహాయముతో వారు మరింత జోరుగా యుద్ధము జేయ సాగిరి.

యిక విప్లవకారులపై నాంగ్లేయులు కురిపించుచున్న శతఘ్నులకు మేరలేదు. వా రెంతశూరులైనను వారిలోక్రమములేదు; సరియైనవ్యవస్థ లేదు. ఆజ్ఞాపాలనలేదు. ఉపాయకౌశలము లేదు. "ఉపాయేనతుతత్కుర్యాద్యన్నశక్యమ్ పరాక్రమైః" అనుసంగతి ఆంగ్లేయుల కుగ్గుపాలతోబోసిన దివ్యౌషధము. పరాక్రమము (policy) కాపట్యముముందర పనికి వచ్చుట లేదు.

లక్ష్మీబాయికి పరిస్థితులన్నియు గోచరించుచునే యుండెను. దుశ్శకునములు కాన్పించుచుండెను. తనకాల్బలము పారిపోవుట; విప్లవకారులను నాల్గువైపులనుండియు నాంగ్లేయు లగ్నిహోత్రపుంజములతోగప్పివేయుచుండుట; యోధులందరు కూలుచుండుట; యితరసహాయమేమియు లేకపోవుట మొదలగు భయంకరిపరిస్థితులలోగూడ లక్ష్మీబాయి ప్రభంజనుని భీభత్సరూపము నెగతాళిజేయు కర్ణధారివలె



నిరువదిమందితో నాంగ్లసైన్యమును చీల్చుకొనుపోవుట కెన్నిసారులో ప్రయత్నించెను. కాని యవన్నియు వృధయయ్యెను.

1858 వ సంవత్సరము జూన్ నెల పద్ధెమ్మిదవ తేదీని. సహస్రకిరణసూర్యభగవాను డాకాశమండలమున దివ్యతేజోరాశివలె బ్రకాశించుచు నిరుపక్షముల యోధులను సూర్యమండలమును ఛేదించుకొని వీరస్వర్గమును జూరగొనుమని యాహ్వానించుచుండెను. మహారాణిపై బ్రిగేడియరుస్మిత్ ' కప్తనుహేనేజు లిరువురు నెనిమిదవ హుస్సారుపటాలమును దీసికొని ఘోరయుద్ధమునకు దలపడిరి. లక్ష్మీబాయి పురుషవేషమును ధరించి పోరుచుండుటచేతను, ఆకాశమంతయు ధూళిధూసర మగుటచేతను శత్రుసైన్యము లామెజాడను కనుగొనలేక యుండెను మహారాణి తనతోగూడ నాంగ్లేయుల పీచమడచుచున్న సుందర, కాశీ లను నిద్దరుదాసీలతోను విశ్వాసపాత్రులగు నిద్దరు సరదారులతోను, కొద్దిమంది అశ్వికులతోను ఆంగ్లసేన నొకప్రక్క ఛేదించివైచి కొద్దిదూరములో నున్న విప్లవసైన్యముతో గలసి మరల నొకగొప్ప వ్యూహమును పన్నవలెనని ప్రయత్నించెను. కాని ఆంగ్లహుస్సారుదళము నలుగడలను గాచియుండి యామె ప్రయత్నములను విఫలము గావించిరి. ఈయుద్ధములో తల్వారుల తళతళలును, ఝునాఝున ధ్వనులును దప్ప మరేమియు గాన్పించకుండెను. ప్రాణములపై నాశ నందరును విడచిపెట్టుకొనిరి.

ఆంగ్లేయుల ఫిరంగిగుండ్లవర్షమును, లక్ష్మీబాయియొక్క ఇద్ద పరిహారములును వందలకొలది సిపాయిలను గూల్చుచుండెను. రాణి లక్ష్మీబాయి తన కరవాలముతో నాంగ్లేయులను కంఠస్నానము చేయించుచు గుఱ్ఱమును వాయువేగమున బరువెత్తించుచు శత్రుసైన్యమును ఛేదించుకొని పోయెను. కాని గుఱ్ఱమిక ముందుకు బోక నిలచిపోయెను. అదిచాల భయపడిపోయెను ఇంతలో బ్రిగేడియరుస్మిత్ హుస్సారుదళము నామె వెనుకనే బంపెను. వారు గుండ్లవర్షమును గురిపించుచుండిరి; లక్ష్మీబాయికి వెనుకనుండి యొకగుండుదెబ్బ తగిలెను. దానివలన నామెకు బాధ కలిగెను. ఇంతలో శత్రుసైన్యము మీదకు వచ్చెను. మరల వారికి సంగ్రామము జరిగెను.

లక్ష్మీబాయి మూడురోజులనుండి హెూరాహెూరీ యుద్ధమును జరుపుచుండుటచే గొంత యలసిపోయెను. కాని యామె రణోత్సాహమును, స్వాభిమానమును మొక్కవోలేదు. ఈవిషయమై (Empire in Asia) అను గ్రంథము లోటారెన్సు యిట్లు ప్రశంసించెను.

"At the first note of insurvection in 1857, she took to horse, and for months in male attire headed bands, squadrous, and at length formidable corpse of the Maharattas, until she became in her own way another Joan of Arc to her frinzied and fierce followers. No insurgent leader gave more trouble to the columns of Sir Hugh Rose, but not



even in desparate and deadly fight, lasting for many hours, could she be persuaded to quit the field."

"1857 లో విప్లవము బయలుదేరుటతోడనే యామె తన యశ్వమునధిరోహించి, పురుషవేషమును ధరించి నెలలకొలది గుంపులను, సైనికనికాయములను నడిపించుచు చివరకు గొప్పగొప్పమహారాష్ట్రదళముల కధినాయకురాలై తనకాతూహలోన్మాదులును, శత్రుభయంకరులునునగు తనయనుచరులకు మరియొకజోనుకన్య యయ్యెను. (ఈఫ్రెంచికన్య ఆంగ్లసేనల నోడించి ఫ్రాన్సును రక్షించెను.) సర్ హ్యూరోజు సేనల నేవిప్లవనాయకుడును గూడ నీమెవలె బాధించి యుండలేదు. ఇంతేకాక నెట్టి విజయసూచనలును లేక మృత్యుసదనమునకు గొంపోవు యుద్ధమందైనను గంటలకొలది నిరంతరాయముగా బోరుచు నామె యుద్ధరంగమును విడువనొల్లదయ్యెను !"

ఝాన్సీకోట నెట్టిసహాయమును లేకుండ ద్వాదశ అహెూరాత్రములు కాపాడిన రణచండికను, శత్రువుసహస్రనేత్రములను గొఱచి కాచుకొనియుండినను గూడ నిర్భయముగా కొలదిమందితో పట్టణమును వీడి ఖడ్గధారచే నడ్డువచ్చిన వారిని యమపురికి బంపుచు నిరువదినాల్గుగంటలలో నూటరెండుమైళ్ళు స్వారిచేసిన వీరవనితను, పారిపోవనున్న సైన్యమధ్యమున సింహపుపిల్లవలె నురికి శత్రునాశము కవతరించి

నశక్తివలె బోరిన శౌర్యలక్ష్మినిజూచి యాంగ్లేయు లబ్బురపడుచు నట్టివీరలక్ష్మి నెట్లయినను బట్టుకొనవలెనని పందెము వేసికొనిరి! కాని ఈశౌర్యలక్ష్మి భారతశౌర్యలక్ష్మి! ఆమె "యుద్ధములో చంపుటొండె! చచ్చుటొండె! చిక్కుటలేదు! నేను మరణించుటే తటస్థించినచో నాపవిత్రశరీరము నాంగ్లేయుల స్పర్శచే మలినము గావింపనొల్లను." అని నిశ్చయించుకొని పురుషవేషధారులై యున్న సుందర, కాశీ లనునిద్దరుదాసీలను రామచంద్రరావు రఘునాథసింహు మొదలగు తన యంగరక్షకులను బిలిచి "యుద్ధములో నేను పడిపోవుచో నాశరీరమును మ్లేచ్ఛులు తాకకుండునట్లు మీరు సంరక్షింపవలెను. ఈనాకోరిక ఈడేరినపుడే మీరు యదార్థమైన స్వామిభక్తులు కాగలరు" అనిచెప్పెను. ఆయంగరక్షకులామెపలుకులను సువర్ణాక్షరములతో దమహృదయసీమలందు లిఖించుకొని నీడవలె యుద్ధములో లక్ష్మీబాయి నెప్పుడును విడువకుండిరి. వారందరును గుఱ్ఱములనధిరోహించి యామె వెనువెంటనే యుండుచుండిరి. బాలుడైన దామోదరరావు రామచంద్రరావు దేశముఖు గుఱ్ఱముపై నుండెను.

హుస్సారుగుఱ్ఱపుదళ మీచిన్నసైన్యముపై నగ్నివర్షమును గురిపించుచుండెను. మహారాణిపై కురికిన ఆశ్వికులనామె తన ఖడ్గనైపుణ్యముచే చెదరగొట్టి ముందుకు బోవుచుండెను. ఇంతలో నామె దాసియగు సుందర దీనస్వనము



తో "తల్లీ! చచ్చితిని! చచ్చితిని! చచ్చితిని! అని కేకవిడెను. ఈమాటలు కర్ణపుటముల బడుటతోడనే లక్ష్మీబాయి గిర్రున వెనుకకు మరలెను. ఆమె కడు భయంకరదృశ్యమును జూచెను. ఒక ఆంగ్లేయు డామె ప్రియదాసియగు సుందరను యమపురికి బంప నుద్యుక్తుడయ్యెను! తోడనే లక్ష్మీబాయి వానికే యమపుర మార్గమునుజూపెను. తిరిగి లక్ష్మీబాయి తన చిన్నసేనతో ముందుకు బోవుచుండెను. ఇంతలో లక్ష్మీబాయి గుఱ్ఱము వెనుకనుండి వచ్చు గుండ్లకు భయపడసాగెను. ముందొక చిన్నయేరు అడ్డమువచ్చెను. ఆగుఱ్ఱము దానిని దాటక నిలచిపోయెను. లక్ష్మీబాయియొక్క స్వంత గుఱ్ఱము రెండు రోజులనుండి యుద్ధములో పనిచేయుటచేతను గుండుదెబ్బలు తగులుటచేతను జ్వరపడియుండెను. ఈగుఱ్ఱము సింధియా గుఱ్ఱములలోనిది. ఇది లక్ష్మీబాయికి చాల విషమపరిస్థితులను దెచ్చిపెట్టెను. మహాభారత యుద్ధమున కర్ణుడు రథచక్రమూడి విరథుడైనచందమున లక్ష్మీబాయి తుముల యుద్ధములో గుఱ్ఱము లేకయుండెను. ఆమె యెన్నిసారులు ప్రయత్నించిన నాగుఱ్ఱము కదలక మెదలక యుండెను. ఆమెతో నున్న యాశ్వికు లందరును గుండుదెబ్బలతో జనిపోవుచుండిరి. ఈసమయమునం దామెయొద్ద నైదారుగురు పరమభక్తులైన సేవకులుదప్ప మరెవ్వరునులేరు. ఇట్టి విషమావస్థలో హుస్సారుగుఱ్ఱపుదళము వెనుకనుండి వీరిపై కురికెను.

ఇంతలో నొకయాశ్వికుడు లక్ష్మీబాయి నతిభీకరముగా మార్కొనెను. లక్ష్మీబాయి యదివరకే గుండుదెబ్బలచే నవసియుండెను; గుఱ్ఱము కదలకపోవుటచే కుడిభుజమే కూలిపోయిన ట్లయ్యెను !

ఇట్టి స్థితిలో నాయాశ్వికుడు పిడుగుపడిన ట్లామెపై బడెను. కానిలక్ష్మీబాయి యేమియు చలింపక కరవాలమును నాలుగువైపుల నత్యంతరయమున గిరగిరద్రిప్పుచు నతిచతురతతో నాత్మరక్షణము చేసికొనుచు నతని నొక్కవ్రేటు వేసెను. ఆవ్రేటుతో నతడు నేలంబడ కూలవలసినదే కాని యతడుగూడ చతురుడగుటచే నతికష్టముమీద దానిని తప్పించుకొని తనతో పోరు వీరుని గుర్తెరుంగజాలక నత్యాశ్చర్యపడుచు మరల లక్ష్మీబాయిపై కురికి తన కరవాలముతో నామె శిరముపై మోదవలెనని జూచెను. లక్ష్మీబాయి తన ఖడ్గమును గాలిలో గిరగిరంద్రిప్పుచు వాని ఖడ్గమును తుత్తునియలు జేసెను. ఖడ్గద్వయసంఘట్టనచే నిప్పులు జలజలరాలెను. ఒకప్రక్క మహారాణి యొక్క తెయును కొద్దిమంది యంగరక్షకులతో బోరుచుండ మరియొకప్రక్క హుస్సారుగుఱ్ఱపుదళమశేషము బోరుచుండెను. ఇట్టిస్థితిలోగూడ మహారాణి కొంతమంది సిపాయిలను గూల్చెను. కాని యొక యోధు డామె ఖడ్గము నెట్లో తప్పించుకొని సమయముగనిపెట్టి వెనుకనుండ యామె శిరమును కత్తితో చూర్ణముచేయజూచెను. దుర



దృష్టవశమున నీఖడ్గమువలన లక్ష్మీబాయియొక్క దక్షిణపార్శ్వ మెగిరిపోయెను. ఒక కన్నుకూడ నూడివచ్చి క్రిందపడెను. ఇంతలో మరియొక యాశ్వికు డామె ఛాతిపై కత్తితో పొడిచెను. ఆమె శరీరమంతయు దూట్లు పడియుండెను, ఇట్టి యవస్థలో రుధిరధారలు గారుచుండ గుండుదెబ్బలు తినిన బెబ్బులిచందమున నామె రోషకషాయితనేత్రయై ఆయాంగ్లయోధులపై బడి విరోధిరక్తపిపాసోత్సుకయై యున్న తన కరవాలముతో వారిని యమధర్మరాజుకడకు బంపి తన క్షాత్రధర్మమును సార్థకము జేసికొనెను. మహారాణి యీ విధముగా దన యంతిమపరాక్రమములను బ్రదర్శించెను; కాని యామె శరీర మంతయు దూట్లుపడి రక్తసిక్తమయి యుండెను. ఆమెశక్తి యంతకంతకు క్షీణించుచుండెను. ఆమె కవసానకాలము సమీపించుచున్నట్లు గాన్పించెను.

యుద్ధస్థలమునందే శరీరమును విడుచుచో మ్లేచ్ఛులామె పవిత్రశరీరమును స్పృశింతురనుభయముచే నామె వెంటనే రామచంద్రరావు దేశముఖుకు బిలిచి తగు ప్రయత్నములను గావింపుమని యాజ్ఞాపించెను. అతడు పరమభక్తుడు; మహారాణి శరీరమును జూచుటతోడనే యతని హృదయము వ్రక్కలయ్యెను. కడుపు తరుగుకుపోయెను. అతడు కన్నీరు మున్నీరుగా కార్చుచు నోట మాట రాకయుండెను. వెంటనే యతడు యుద్ధరంగమున కతిసమీపముననున్న యొక పర్ణకు

టీరము లోని కాపెను గోసిపోయెను. ఈకుటీరము గంగాదాసుబాబాయను వానిది. లక్ష్మీబాయి కడు డప్పి దప్పిగొని యుండెను. అప్పు డామెకు గంగాజలము దనివిదీర ద్రావ నిచ్చిరి. ఆమె శరీర మంతయు రక్తములో స్నానమాడుచుండెను. గాయముల బాధ హెచ్చుచుండెను. కానిముఖము మాత్రము వీరలక్ష్మి యెప్పటివలెనే చెక్కుచెదరక యుండెను?

ప్రియపుత్రుడైన దామోదరరావును బిలిచి తనయొద్ద గూర్చుండబెట్టుకొని రెప్ప వాల్పక నతనిని మాతృవాత్సల్యముతో జూచుచు జగత్పాలకుడైన యీశ్వరుని కతని నర్పించి సిద్ధార్థిసంవత్సర జ్యేష్ఠ శుక్ల సప్తమినాడు గ్వాలియరు సమీపమున యుద్ధరంగమధ్యమున, గంగాదాసు బాబాకుటీరమున. భారతదేశ శౌర్యరాశియు, నగణిత సుగుణ నికురంబము, పాతివ్రత్యనిధియు, దివ్యస్త్రీరత్నమును నగు మహారాణి ఝాన్సీలక్ష్మీబాయి యిరువదిమూడవయేట నీలోకమును వీడి స్వర్గధామము నలంకరించెను. మహారాణి శరీరమును విడుచుటతోడనే రామచంద్రరావు దేశముఖు తన దేవి యాజ్ఞానుసారము తత్క్షణమే యొక చితిని జేర్పించి సమీపముననున్న తృణకాష్ఠములను దెప్పించి విగత ప్రాణమై యున్న యాపవిత్ర శిరీషకుసుమపేశల దేహమును దానిపై నుంచి తన స్వహస్తములతో నగ్నిసంస్కారము గావించి ధన్యుడయ్యెను. సమాప్తము.



# ఆంగ్లేయుల ప్రశస్తులు



"We found that the woman from whom we had taken. as incapable of Government, the regency of a state, could at least command an army. Her name was the centre of the revolp in the North west. She was the sworthy Boadicea of the Hindu and Mussulman levies; by her admit intrigues Gwalior was nearly lost and Central India with it? for weeks and months, after Delhi fell, her wonderful power of Generalship kept the British columns under Sir Hugh Rose at the strain of effort and endurance till at last she led her troops in open battle against us at Kalpi, Defeatd there, she made another masterly effort against us at Gwalior, and it was not the fault of this able and passionate woman that her army broke that day, and fled in confusion utter confusion. Armed and dressed as a Cavalry Officer, she led her ranks to repeated and fierce attacks, and when the camel corps pushed at by Sir Hugh in person, broke her last line, she was among those who stood when hope was gone.

Dalhousie's Administpation of British India."

"పరిపాలించుట కసమర్థురాలని మన మేస్త్రీనుండి యొక సంస్థానరాజ్యమును లాగుకొంటిమో అట్టి స్త్రీ

సైన్యములనైన నవలీలగా నడుపగలదని మనము కనుగొంటిమి. ఉత్తరహిందూదేశమున నామెపేరు విప్లవకేంద్రమయ్యెను. ఆమె హిందూమహమ్మదీయ సైన్యములకు బోడిసియావలె నుండెను. ఆమెయొక్క యత్యంత సాహసోపాయముల వలననే గ్వాలియరును దానితోపాటు మధ్య హిందూదేశమును కొంచ మించుమించుగా మనచేతులలో నుండి జారిపోయెను. ఢిల్లీ పడిపోయిన తరువాత ననేకవారములును, మాసములును సర్ హగ్రోజు సైన్యముల కనేకకష్టములను గల్పించి ముప్పుతిప్పలు బెట్టిన ధీరవనితయొక్క యద్భుత సేనానాయకత్వమే యని వేరుగ జెప్పనక్కరలేదు. చివర కామె తన సైన్యములను గూర్చుకొని మనతో కాల్పిలో బహిరంగయుద్ధమునకు డీకొనెను. ఇచ్చట నోడిపోయినతరువాత నామె తిరుగ గ్వాలియరులో మనపై ప్రబలయుద్ధ ప్రయత్నములను గావించెను. అనాడామెసైన్యములు కూలి ఒంటరవంటరవై పారిపోవుటలో నామెలోప మెంతమాత్రమును గాన్పింపదు. ఆశ్వికదళాధికారివలె నామెదుస్తులను, అస్త్రశస్త్రములను ధరించి తనసైన్యములతో మనపై ననేకపర్యాయములు భయంకర దాడులను సాగించెను; సర్ హగ్రోజుచేత స్వయముగా నడిపింపబడిన ఒంటెదళ మామె తుదిదళమును చీల్చివేసినపు డాశలన్నియు నశించినను చివరవరకును నిలచిన



వీరలలో లక్ష్మీబాయి కూడ నుండెనని వేరుగ చెప్పనక్కరలేదు."

◆ ◆ ◆ ◆ ◆ ◆

One of those who fought to the last on the rebel side was the Ranee or Princess of Jhansi whose territory as we have already seen had been one of our annexations, She had plunged all her energies into the rebellion, regarding it clearly as a rebellion and not as a mere mutiny. She took the field with Narcsahaib and tharthiathcpe. For months after the fall of Delhi she contrived to battle Sir Hugh Rose and the English. She led squadrons in the field. She fought with her own hands. She was engaged against us in the battle for the possession of Gwalior. In the uniform of the Cavalry Officer she led charge after charge and was killed among those who resisted to the last. Her body was found upon the field scarred with wounds enough in the front to have done credit to any hero. Sir Hugh Rose paid her the well deserved tribute which a generous conqueror is always glad to able to offer. He said in his general orders "the best man upon the side of the enemy was the woman found dead, the Ranee of Jhansi."

"ఏమహారాణియొక్క రాజ్యము మనము కలుపుకొనినవాటిలో నొకటియని మనమిదివరలో కనుగొంటిమో

అట్టిఝాంసీరాణి లక్ష్మీబాయి మనతో జీవరవరకును బోరిన తిరుగుబాటువారులలో నొకతెయని వేరుగ చెప్పనక్కర లేదు. ఆమె తన సర్వశక్తుల నీతిరుగుబాటులో (ఇది కేవలము తిరుగుబాటనియు సిపాయిపితూరీ కాదనియు పూర్తిగా భావించి) ధారపోసెను. నానాసాహెబు, తాత్యాతోపెలతో నామె రణరంగమునకు దుమికెను. ఢిల్లీ పడిపోయినతరువాత నామె మాసములకొలది సర్ హ్యూరోజుతోను, ఇంగ్లీషువారితోన హోరాహోరీగా పోరుసాగించెను. ఆమె సైన్యముల నాహవరంగములో నడిపించెను ఆమె తన స్వహస్తములతో యుద్ధముచేసెను. గ్వాలియరును తమస్వాధీనములోనే యుంచుకొనుట కామె మనతో యుద్ధరంగమున బోరెను. అశ్వికదళాధికారివేషమును ధరించి యామె మనల ననేకసారులు బహిరంగముగా నెదుర్కొని చిట్టచివరకును పోరుచు యుద్ధరంగములో చనిపోయెను. ఎట్టివీరాగ్రేసరులకైన నలంకారము లగునాయుధవ్రేటులతో నిండియుండిన యామె శరీరము యుద్ధభూమిలో గాన్పించెను ఔదార్యవంతుడైన విజయత అతిసంతోషముతో గొనియాడునట్లే సర్ హ్యూరోజు ఆమెను కీర్తించెను. ఆతడు తన కాగితములలో నిట్లు వ్రాసెను. "వైరిపీకులలో నుత్తమోత్తమపురుషు డీయుద్ధరంగమున చనిపోయినట్లు కనుగొనబడిన ఝాంసీరాణియే?"

"The extraordinary actions and heroism of this great lady shed an imperisaable lustre on the



ever memorable period of 1857. Ranee Lakshmibayi the flower of maiden chivalry, was a lady of 26 or 30 years of age ( the age was only 23 ) exceedingly beautiful and endowed with high spirit, enthusiastic courage and lafty patriatic fervour. She was remarkable also for her immaculate charector, strength of mind and physical activity. A few years the out break of the rebellion of 1857, this charming beauty was seen on the masnad of Jhansi, govening the country like an accomplished ruler for the infant adopted son of her deceased lord Gangadhara Rao. The influence which this great lady has over her subjects was immense. On all hands she was regarded as a generous and able ruler."

The national guardian 14-12-1891.

"ఎప్పటికిని మరువు రాజాలనట్టి 1857 వ నాటిచరిత్రకీయుత్కృష్టదేవియొక్క అద్భుతచర్యలును, నిరుపమాన ప్రతాపమును మరింత దిగంతశాశ్వత కీర్తి నొసంగుచున్నవి. వీరస్త్రీ మకుటమగురాణి లక్ష్మీబాయి కిరువదియారు లేక ముప్పది (ఆమె వయస్సు 23 మాత్రమే) వత్సరములున్నవి. ఆమె సౌందర్యగని; అపారమైన యుత్సాహము, అతులితధైర్యము, ఉత్తమదేశభక్తి మొదలగు సుగుణరాసి. ఆమె విశుద్ధశీలము, మనోబలము, క్రియాకలాపానురక్తి మొదలగునవి జగద్విఖ్యాతిని గడసెను. 1857 లోని తిరుగుబాటుకు పూర్వమీ

మోహనాకారము ఝాన్సీ సింహాసనము నలంకరించి తన భర్త మహారాజా గంగాధరరావు దత్తత చేసికొనిన బాలకుని తరపున చతురుడైన పరిపాలకునివలె నత్యంతకౌశలముతో బరిపాలించెను. ఈదేవికి దన ప్రజలపై జాల పలుకుబడికలదు ఈమె యౌదార్యసమర్థతలు గల పరిపాలకురాలని ప్రతివారును సంభావించుచుండిరి."

♦ ♦ ♦ ♦ ♦ ♦

"Thus fought Laxmi. She had achieved her purpose fulfilled her ambition, carried out her resolve, One such life vindicates the whole existence of a nation, She was the concentrated essence of all virtues. A mere woman, hardly twentythree yet, beautiful as the rose, charming in her manners, pure of conduct. She had a power of organisation of her subjects, exhibited by very few, ever among men. The flame of patriotism was always burning in her heart and she was proud of her country's honour and preeminent in war, It is very rarely that a nation is so fortunate as to be able to claim such an angelic person, as a daughter and a queen. That honour has not yet fallen to the lot England. In the revolution of Italy, high Ideals and heroism of the very highest type are to be found, yet, in all this period of glory, Italy could not give birth ta a Lakshmi."



"లక్ష్మి యీవిధముగా పోరాడెను ఆమె తనయుద్దేశ్యమును సాధించెను; తన కోరికలను సఫలీకృతము చేసికొనెను; తన మనోనిశ్చయమును నిర్వహించుకొనెను? జాతియంతయు సజీవముగా నున్నదని రుజువుచేయుట కిట్టి జీవితమొక్కటియే చాలును! ఆమె సకల సద్గుణసారసికుం బము; ఇరువదిమూడు సంవత్సరములు వచ్చిరాని కేవల మొకయబల; కిసుగందని గులాబివంటి మేనిసొగసు; మనోహరములైన చైద్యములు; విశుద్ధప్రవర్తనము పురుషులలో గూడ బహుకొద్దిమంది మాత్రమే చూపగల నిజప్రజా సంధాన శక్తి కామె 'పెట్టినది పేరు.' ఆమె హృదంతరాళమున దేశభక్తి యను దివ్వె సదా జాజ్వల్యమానముగా బ్రకాశించుచునే యుండెను. ఆమె తన స్వదేశాధికృత కొంతయు గర్వించుచుండెడిది; ఇక యుద్ధమునందు నామెకు సాటియే లేదు! ఇట్టి దేవతా విగ్రహము నొకజాతి తన కుమార్తెగను రాణిగను బడయు భాగ్యమును కలిగియుండుట అతియరుదు; ఇంగ్లాండు కిట్టిభాగ్యమింతవరకును అబ్బి యుండలేదు. ఇటలీ విప్లవములో నుత్తమోత్తమమైన ఆదర్శములును, వీరత్వమును మనము చాలవరకు కనుగొందుము; కాని యిట్టి కీర్తివంతమైన కాలమందు గూడ నిటలీ యొక లక్ష్మిని కానజాల దయ్యెను!"

## The Life of Vinayaka savarkar by Mudiganty Jaggannasastry, B. A.

### RAJAHMUNDRY.



If you wanted a book to kindle your sympathies and to occupy your time for not more than 60 Minutes and in that short space to fill you with pathos and patriotic fervour, then you buy a copy of Vinayaka Savarkar's biagraphy for a rupee and get the full return for your money. The story of his revolutionary activities, his Zeal for the emancipation of his motherland, his escapades, his arrest. hid adventures in the French waters, his dip into the ocean, his race for life, his appeal to the french dolice, his arrest by the Jubhurdhust of the British pursuer in Marseilles, his trial in India and sentence his experiences in the Andamans, makes, such pathetic, albeit, rapturous reading that we have no words with which to congratulate the author upon the choice language in which he has clothed the story and the racy style which adds qipue to the language.

Janmabhumi 3rd May 1928.

(Reduced price. As, 0—12—0.

శివుడు శివరావుగారు, కొవ్వూరు.
చేడ నారాయణమూర్తిగారు, తొండంగి.
ముళ్ళపూడి తిమ్మరాజుగారు, జమీందారు తణుకు.
తల్లాప్రగడ కామేశ్వరరావుగారు, ఉంగుటూరు.
తల్లాప్రగడ భీమేశ్వరరావుగారు, ఉంగుటూరు.
పులవర్తి లక్ష్మణస్వామిగారు, ఆకివీడు.
పసల సోమయ్యగారు, తాడేపల్లిగూడెం.
దేవులపల్లి రామమూర్తి శాస్త్రిగారు,
అగ్రహారందారు, తిమ్మరాజుపాలెం.
వెలగల శ్రీరామరెడ్డిగారు, ఆరవల్లి.

### పోషకులు.

బొడ్డుపల్లి లక్ష్మీనారాయణగారు, కొవ్వూరు.
డాక్టరు యర్రమిల్లి దీక్షితులుగారు, నిడదవోలు.
డాక్టరు నజీపుఅమ్మద్ గారు, తాడేపల్లిగూడెం.
కఠారి అచ్యుతరామరాజుగారు, ఒడ్డూరు.
రేకపల్లి వర్ఘులుగారు, వకీలు రాజమండ్రి.
గొడవర్తి నాగేశ్వరరావుగారు, ఆచంట.
బొళ్ళ వెంకటరత్నంగారు, పెదపట్నమగ్రహారం.
తుమ్మలపల్లి సత్యన్నారాయణగారు, పిప్పర.
తుమ్మలపల్లి లక్ష్మీనారాయణగారు, పిప్పర.

33 ఇందుకూరి సుబ్బరాజుగారు, పిప్పర.

34 మాజేటి రామచంద్రరావుగారు, పే

35 జోస్యుల రామచంద్రరావుగారు, వ

36 న్యాపతి సుబ్బారావుపంతులుగారు,

37 జూపూడి సుబ్బన్నగారు, ఆకివీడు.

38 పోలిన రాజుఅనే రామచంద్రుడుగా

39 గాడేపల్లి హనుమానులుగారు, అత్తి

40 బొమ్మకంటి రామమూర్తిశర్మగారు,

41 ఆరుమిల్లి వెంకటసుబ్బారాయుడుగార

42 రావుసాహేబు కళ్ళిచిట్టిఅబ్బాయినా

43 పెన్మెత్స రాఘవరాజుగారు, గోటేరు.

44 కర్రా శ్రీరామమూర్తిగారు, పెనుగు

45 అరవ తిరుపతిరాయుడుగారు, రాజమం

46 తేతలి సీతారామయ్యగారు, తేతలి.

47 రెబ్బాప్రగడ మందేశ్వరశర్మగారు, కొ

48 ప్రభల చిన్నసుబ్బారావుగారు, పుల్లేటి

49 నామన బాపన్నగారు, దేవరపల్లి.

50 పెండ్యాల రామలింగంగారు, తాడేపల్లి

51 తుకగా పురుషోత్తంగారు, పలివెల.

52 ఇందుకూరి లక్ష్మీపతిరాజుగారు, దువ్వ.

